13

Entred.

327 వ సంచిక

# చతుర

ఏప్రిల్ 2005

రూ.7/-



మునిపల్లె లక్ష్మీరమణ కుమారి నవల

## హారిణి



నుదుట తిరునామం! రసనపై హరినామం!!

సాతాని జియ్యరు నా వ్యవహార నామం! విశ్వశాంతి నా లక్ష్యం!!

ఫొటో: కె.ఎల్. కుమారస్వామి

రసమయ నవలా తరంగం

# చతుర

సంపుటి: 28 సంచిక: 3

ఏప్రిల్ 2005 327వ సంచిక



## ఈ నెల 'చతుర'లో ...



ఇలస్ట్రేషన్స్: పినిశెట్టి

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: జయకృష్ణ

మోడల్: శ్రీ విజయ

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (5)

రాసేటప్పుడు మన నమ్మకాలు, మన నిబద్ధత, మన నైతిక విలువలు మనకు మార్గదర్శకంగా, కరదీపికలుగా ఉంటాయి. అయితే ఆ విలువలు వెలుగుగా పనికొస్తాయేగాని, మనం చూసే వస్తువులు మాత్రం కాదు. వెలుగు సాయంతో లోకాన్ని చూడాలి. కాని వెలుగే లోకం కాదు. వెలుగు ఒక మీడియం. ఒక శక్తి. ఒక దృష్టి. రచయిత రాసే ప్రతి వాక్యానికీ గీటురాయి, దృష్టికోణం వ్యక్తిత్వం. ఈ దృష్టితో మనం ఎంత లోకాన్ని చూడగలం! ఎంత అర్థం చేసుకోగలం? ఎన్ని విషయాల గురించి మంచీ చెడ్డా వివేచన, తీర్పు, మీమాంస చెయ్యగలం? వివేచన దృష్టిలో భాగం. వివేచనా శక్తి దృష్టి నుండి వేర్పడిన రోజున మనసులో ద్వైధీభావం జనిస్తుంది. క్రమేణా అది రచనలో కూడా ప్రతిబింబిస్తుంది.

దయ గురించి రాసి దయనూ, సానుభూతి గురించి రాసి సానుభూతినీ, ఉద్రేకాన్ని గురించి రాసి ఉద్రేకాన్నీ, ఆలోచన్ని గురించి రాసి ఆలోచనల్నీ పాఠకుల్లో కలిగించలేం. ఈ దయ, సానుభూతి, ఉద్రేకం, ఆలోచనలు ఉన్న సజీవ శక్తులు-బరువూ, ఒడ్డూ, పొడుగూ, కొంత నిర్ణీత జీవితకాలమూ ఉన్న వ్యక్తులు-అంటే పాత్రల ద్వారా మాత్రమే అది సాధ్యం.

కళ అంటే అభివ్యక్తీకరణ. అభివ్యక్తీకరణకు పరిశీలన ప్రాణం. కథారచన అనే ప్రక్రియకు మూలం కథ చెప్పటం కాదు. జరిగింది చూపించటం.

కథా రచనకు కావలసిన ముడిసరుకు చాలా సామాన్యమైనది. మనిషి-మనిషికి సంబంధించిన విషయం మాత్రమే కథకు ముడి సరుకు-ఈసప్ కథలూ, పంచతంత్రంలాంటి వాటిలో పాత్రలు జంతువులైనా అవి మనకోసం చెప్పిన నీతి కథలే గదా! మనిషి మట్టిలోంచి వచ్చాడు. అందువల్ల గుడ్డలు మట్టికొట్టుకుపోతాయేమోనని భయపడే రచయిత కథారచనకుపక్రమించకూడదు.



మేధాప్రతిభ కాదు. అతిసామాన్యమైన మాటల్లో మనం చూసిన, మనమెరిగిన మనుషులకు ప్రాణప్రతిష్ఠ చేయగలగాలి. (మన పంచేంద్రియాలు ఆరోగ్యంగా ఉంటేనే ఇది సాధ్యం). రచయిత, వ్యక్తులకున్న అద్భుతమైన అభిప్రాయాల్ని వర్ణించినా, వర్ణించకపోయినా, వాళ్ల దుస్తుల్నీ, హావభావాల్నీ, ఆకారాన్నీ మాత్రం ఉన్నదున్నట్టుగా చెప్పగలగాలి. అయితే చూసిందంతా వర్ణించాలని కాదు.

పాత్రల గురించిగాక, పాత్రల ద్వారా మాట్లాడతారు రచయిత.

★ ★ ★

నిత్యం డజన్లకొద్దీ చదువుతున్నా, తీరా రాయటానికూర్చున్నపుడు మాత్రం "కథలె

4 ఏప్రిల్ 2005 (signature)

క్కణ్ణించి వస్తాయసలు" అంటూ బుర్రగో క్కోవటం సహజం- కనీసం నాకు ఐడియా కావాలిగా మరి.

ఐడియా అంటే కొత్తకోణం. కొంటెకోణం. రెండు తెలిసిన విషయాలు కలిపితే మూడో (కొత్త) విషయం తయారవుతుంది. అదే అయిడియా.

నాణాలు ముద్రించేయంత్రాన్నీ, ద్రాక్ష రసం తీసే యంత్రాన్నీ (ప్రెస్) కలిపి అచ్చు యంత్రం సృష్టించాడు గుటేన్‌బర్గ్.

అయిడియాలే అయిడియాలజీ. అంటే భావజాలం. వ్యక్తిగత సమస్యలన్నీ సామా జిక, రాజకీయ పరిస్థితుల ఫలితమే. వ్యక్తి జీవితాలను రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాల నేపథ్యంలో అర్థం చేసుకోవటానికి రచయి తలు ప్రయత్నిస్తున్నారు. కాని రాస్తున్న వాళ్లకూ, రాయాలనుకొన్నవాళ్లకూ తెలుసు. సిద్ధాంతాలను వ్యాసాల్లో చెప్పినంత స్పష్టంగా కథల్లో చెప్పటం వీలుపడదు. (కథ స్టేట్‌మెంట్ కాదు. ఉదాహ రణలాంటిది) ఒకే సమస్యను వేదిక మీద విశ్లేషించి విమర్శించటం వేరు. ప్రైవేటుగా గొణుక్కుంటూ, చిరాకుపడటం వేరు.

అంతేకాదు. తత్కాలీన ప్రముఖ సంఘ టన పరిస్థితుల (పేపర్ హెడ్‌లైన్లు) గురించి రాస్తే ఆ రచన నిన్నటి వార్తాపత్రి కలాగ మూలనపడేస్తారు కూడాను. కొడవ టిగంటి కుటుంబరావు గారి కథల్లో రాజకీ యచైతన్యం, అవగాహన, విశ్లేషణ ఉంటుంది. కాని వాటిని రాజకీయాలను గురించిన కథలనలేం.

మొత్తం మీద, రచన రెండంశాల సమ్మే ళనం. ఒకటి నైపుణ్యం. రెండవది కళ. నైపుణ్యం అంటే- సరైన పద్ధతులు నేర్చుకో వడం వల్ల మరింత సమర్ధవంతంగా చెయ్యగ లిగేవి. కళ అంటే స్వతాహాగా, స్వభావరీత్యా కొందరు కొన్ని పనులు మిగతావాళ్లకన్నా బాగా చెయ్యగలరు. రచన గురించిన అభిని వేశం కొందరిలో ఎక్కువగా ఉంటుంది. ఇది ఎవరూ ఎవరికీ నేర్పలేరు, నేర్చుకోలేరు.

సామర్ధ్యం లేకపోతే (స్వభావరీత్యా) మంచి రచయిత కూడా పసలేని రచనలు చేసే అవకాశముంది. "సాధనమున పనులు సమకూరు ధరలోన..." అని శతకకారుడె ప్పుడో చెప్పలేదా?

ఇంగ్లీషులో తరచుగా వినిపించే మాట- Fiction is Friction సంఘర్షణ. రెండు పాత్రలు, రెండు గొర్రెపొట్టేళ్ళు ఫైట్ టు ఫినిష్ అన్నట్లు ఢీకొట్టుకుంటే కథ, పాత్రలు కష్టపడితే పాఠకులు ఆనందిస్తారు. పాత్రలు ఆనందంగా ఉంటే పాఠకులు ఆవులిస్తారు.

"ఏ కథా వస్తువూ డల్‌గా ఉండదు. కొందరు డల్‌గా రాస్తారంతే" అంటాడో మహానుభావుడు. పరిస్థితులు మనుషుల మీద చూపే ప్రభావమూ, వాళ్లు తమ మనుగడకోసం చేసే ప్రయత్నాలే కథ.

'ప్లాట్' గురించి ఇ.ఎం. ఫార్స్టర్ ఇచ్చిన ఈ నిర్వచనం చదివి ఎంత మంది యువ రచయితలు ఉత్సాహం పొందారో!

"ఒక కాల క్రమంలో జరిగిన సంఘటనల సమాహారమే కథ అనుకున్నాం. కార్య కారణ సంబంధమున్న సంఘటనల్ని ప్లాట్ అందాం. "రాజుగారు మరణించాడు. రాణి గారు కూడా మరణించింది". - అది కథ. ఒకదాని తర్వాత ఒకటిగా జరిగిన రెండు సంఘటనలు. కాని 'కారణం' చెప్పలేదే? - "చాలా కాలం దాకా రాణిగారి మరణానికి కారణం తెలియలేదు. ఆ తర్వాత ఆంతరంగి కులు తెలుసుకున్నారు. రాజుగారి వియో గాన్ని భరించలేక రాణిగారు మరణించింది". ఇందులో మిస్టరీ కూడా లేకపోలేదు. కేవలం వియోగమే కారణమా? లేక చేసిన అకృత్యా లకు పశ్చాత్తాపమా? రాణిది అసలు సహజ మరణమా? హత్యా?'

— ముక్తవరం పార్థసారథి

**(వచ్చే నెల మరిన్ని విశేషాలు)**

★



జ్ఞానతరంగిణి

# మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్‌గారి సందేశం

## ఇంటి లోపల...

ఇంట్లో ఉన్న కుటుంబ సభ్యులందరితోనూ ప్రేమగా వ్యవహరించు. ఒకవేళ నీవు తల్లివైతే పిల్లలను ప్రేమగా చూడటం నేర్చుకో. వాళ్లు కూడా నిన్నలాగే ప్రేమతో చూస్తారు. కొడుకువైనచో తల్లిదండ్రులను ప్రేమతో ఆదరించు. పూజ్యభావంతో సత్కరించు. ఇది చూసి నీ పిల్లలు కూడా నీలాగే మంచి పద్ధతులు నేర్చుకుంటారు.

తల్లిదండ్రులను సముచితంగా గౌరవించని వారు తమ పిల్లలచేత తాము కూడా గౌరవింపబడరు. తుదకు అదే దుఃఖమునకు కారణం అవుతుంది.

స్త్రీ పురుషులు పరస్పరం ప్రేమభావంతో ఉండాలి. అలా ఉంటేనే ఇల్లు స్వర్గధామం అవుతుంది లేదా అది నరకమే!

ఇల్లొక చిన్న రాజ్యం. దీనికి తండ్రి రాజు. తల్లి కోశాధికారి, మంత్రి. పిల్లలు ప్రజలు. ఇంట్లో మంచి ఏర్పాట్లను చేసిన మనిషే అవసరమైతే పెద్ద రాజ్యాలను కూడా కట్టుదిట్టం చేయగల సమర్థుడు. ఇలాంటి లక్షణాలు లేనివారు ఉన్నత దశ పొందజాలరు.

ఇల్లొక ఉద్యానవన వాటిక. ఇందులో వికసించిన పువ్వులే బాలలు! తోటమాలులే తల్లిదండ్రులు. పూలనూ, మొక్కలనూ, వృక్షాలనూ ప్రేమతో, శ్రద్ధతో, ఆసక్తితో ఏ తోటమాలి పెంచుతాడో ఆ తోటలో చక్కని పూలు పూస్తాయి. పళ్లూ కాస్తాయి. అవి సుఖశాంతులకీ దోహదపడతాయి. సరైన పోషణ లేకుంటే చెట్లయినా, పిల్లలైనా కలహాలు పెంచుకుంటూ, ముళ్లవలె గుచ్చుకుంటూ ఇతరులకు బాధలనే కలిగించటం జరుగుతుంది.

మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్

ఇల్లొక చిన్న మందిరం. తల్లీ తండ్రీ ఆ ఇంటి లక్ష్మీనారాయణులు. పిల్లలే వారి పూజారులు. తల్లిదండ్రులను దైవ సమానంగా భావిస్తే ఆ ఇల్లు ఒక వైకుంఠం. ఇంటిని వైకుంఠధామంగా చేయాలంటే ప్రతి మనిషీ తనవంతు కర్తవ్యం తాను సక్రమంగా నిర్వర్తించాలి. లేకుంటే సత్ కర్మలకూ, ధర్మాలకు సరైన ఆకృతి మిగలదు.

ఇంట్లో సుఖశాంతులుంటే బయటకూడా ప్రశాంతి దొరుకుతుంది. ఇంట్లో దుఃఖితులైనవారికి బయట కూడా దుఃఖాలే ఎదురవుతాయి.

ఇల్లు మనిషి హృదయంతో సమానం. చిత్తం శాంతంగా ఉంటేనే శారీరక వ్యవహా

రాలు కూడా ప్రశాంతంగా జరుగుతాయి. ఈ విధంగా లేకుంటే ఆ ఇల్లు నరకమవుతుంది. బయట కూడా ఇలాంటి దృశ్యాలే తటస్థపడతాయి.

తల్లిదండ్రులలో లక్ష్మీనారాయణులను దర్శించగలిగినవారే భగవంతుని భక్తులు కాగలుగుతారు. తల్లిదండ్రుల్ని గౌరవించలేని మనిషి ధర్మమార్గాన్నెలా ఆచరిస్తాడు?

పరమసంత్ కబీర్ సాహెబ్ తమ 'దోహా'లో "ఎవరైతే ఇహలోకంలో భగవంతుని సాక్షాత్కరించుకోలేరో, మానవుల్లో ఈశ్వరుని చూడలేరో వారికి పరలోకంలో కూడా దర్శనభాగ్యం లభించదు. ప్రపంచంలో భగవంతుని సందర్శించలేని వారికి అక్కడ కూడా ఏమీ లభించదు" అన్నారు.

ప్రేమాదరాలు లేని ఇంట శాంతి ఉండదు.

తన ప్రవర్తనవల్ల ఎక్కువమంది శత్రువులు తయారైనపుడు, ఆదాయాన్ని మించి ఖర్చుచేసి అప్పులపాలైనపుడు, పిల్లలు మూర్ఖులుగా మారినపుడు, జీవిత భాగస్వామి గయ్యాళితనంతో సాధించి పీడిస్తున్నప్పుడు ఆ ఇంట్లో ఉండటం కష్టమనిపిస్తుంది.

సహృదయమున్న జీవిత భాగస్వామి, నీతివంతులైన పిల్లలు, మంచితనం, కష్టపడి సంపాదించిన ఆదాయం ఈ నాలుగు ప్రాప్తిస్తే ఇల్లు స్వర్గతుల్యమవుతుంది.

స్త్రీ, పురుషులు పృథ్వి, ఆకాశాల సదృశం. ఆకాశం నుండి వర్షం కురిసిన తరువాతే చెట్లు మొక్కలు, మంచి పూలూ, పళ్లూ ఇస్తాయి. పురుషుడు శాంతచిత్తుడు, వీర్యవంతుడు, సత్యసంధుడు కానపుడు మంచి సంతానం ఎలా జన్మిస్తారు? మంచి పొలంలో మంచి విత్తనాలు వేస్తేనే చక్కటి ఫలసాయాన్ని ఆశించవచ్చు.

సత్యవంతుడూ, ధర్మాత్ముడు, పెద్దల్ని సత్కరించేవాడై ఉన్న మనిషి ఇంట్లో మంచి సంతానం ఉద్భవిస్తుంది. సత్సంతానం కలగటం వారి వారి మనస్సుల్లోని శుభ భావనలపై ఆధారపడి ఉంటుంది.



చెడ్డపిల్లలు ఆరోవేలుతో సమానం తీసేస్తే చేతికి బాధ, ఉంచేస్తే చూసేందుకు అసహ్యం.

ఏదైనా మంచి వస్తువు కనిపిస్తే గృహస్థు ఇంటిలోకి తెచ్చి దాస్తాడు. అలాగే మంచి విషయాలు వింటే వాటిని హృదయంలో దాచాలి. వాటి ప్రభావంతో మనసు నిర్మలమవుతుంది.

గృహస్థు న్యాయమార్గంలో ధనం సంపాదించాలి. ధనం సంపాదించకుంటే భార్యా, పిల్లల పోషణ, దీనులకు దానాలు, ధర్మాలు చేయలేడు. బంధువుల్లో, మిత్రుల్లో గౌరవ మర్యాదలు పొందలేడు.

అన్ని ధర్మాల్లోకి గృహస్థ ధర్మం గొప్పది.

సేకరణ, అనువాదం: జ్యోతిరాణి

★

# మీరూ చెప్పుకోండి!

**మీ ప్రశ్నలకు శంకర నారాయణ సరదా సమాధానాలు**

---

రేణుకాదేవి, మహబూబ్‌నగర్

**ప్ర: పేరు గొప్ప ఊరు దిబ్బ అంటారు. దీన్ని ఇంకోమాటలో చెప్పండి?**

జ: నేతిబీరకాయ.

ఎస్. రామకృష్ణ, కాశీబుగ్గ

**ప్ర: సిగరెట్ పెట్టెలమీద 'పొగతాగడం హానికరం' అని రాయడంలో ఆంతర్యం!**

జ: తాగి 'చావకు' అనే!

**ప్ర: ప్రశ్నకు నవ్వురాకపోతే ఏం చేస్తారు**

జ: ఏడ్చినట్టు జవాబిస్తాను.

వై. పాండురంగారావు, ఆదిలాబాద్

**ప్ర: కుక్క విశ్వాసానికి చిహ్నం. మరి నక్క?**

జ: విషవాసానికి చిహ్నం.

ఎస్. శైలజ, తంజావూరు

**ప్ర: 'పుట్ట'గతులు ఉండవు అని కోపం వస్తే తిడతారు. న్యాయమే!**

జ: అది తిట్టుకాదు ఆశీర్వచనమే. 'పుట్ట' గతుల్లోకి వెళ్లితే పాములు కనపడతాయి.

ఎం. రాజ్యలక్ష్మి, అమలాపురం

**ప్ర: బుద్ధి 'గడ్డి'తిన్నదంటారు. అది సాధ్యమా?**

జ: బీహార్‌కు వెళ్ళి చూస్తే అది నిజమేననిపిస్తుంది. అక్కడ కొందరు మహానుభావుల 'బుద్ధి' వెయ్యి కోట్ల మేరకు 'గడ్డి' తిన్నదట!

బి. స్వామిచరణ్, బెంగుళూరు

**ప్ర: రాజకీయాల్లో పైకి రావాలంటే?**

జ: 'దండోపాయమే' మార్గం. కనిపించిన ప్రతి నాయకుడికి చేతికి ఎముక లేకుండా 'దండ' వేయాలి.

పి. సుభాష్, మచిలీపట్నం

**ప్ర: మెంటల్ వస్తే?**

జ: మంటలే.

ఎం. ప్రసూనాంబ, కనిగిరి

**ప్ర: కోరుకున్న దొరగారు?**

జ: కట్నం ఇవ్వమంటే కంగారు.

వి. రామారావు, చీరాల

**ప్ర: 'నిలువవే వాలుకనులదానా?' అని ప్రియుడు పదేపదే అంటుంటే అర్థమేమిటి?**

జ: ప్రియుడికి మోకాళ్ల నొప్పులు, చక్కగా నడవలేడని!

వై. దేవానంద్, పుణె

**ప్ర: ఆడవాళ్లకు తమ అత్తలమీద కోపం ఉన్నా, పిల్లలకు వాళ్ల పేర్లు ఎందుకు పెడతారు?**

జ: వారిని తలుచుకుని పిల్లలను కసి తీరా తిట్టవచ్చు, కొట్టవచ్చునని!

కె. నారాయణ, కనిగిరి

**ప్ర: ఏ కోణంలో చూసినా కుంభకోణం కనిపిస్తున్నది. ఎందుకు?**

జ: ఎర్ర త్రికోణం మరచి పోవడం వల్ల!

ఎస్. నవనీతరావు, మంచిర్యాల

**ప్ర: రాజకీయాలకు రాసకీయాలకు పోలిక ఏమిటి?**

జ: పట్టులేకపోతే రెండింటిలోనూ పరాజయం తప్పదు.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసే వారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ! 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యం కాదు.

**★ నవలను గురించే కాక ఇతర శీర్షికలపై కూడా పాఠకుల అమూల్య అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం.**

**కూపన్**

ఏప్రిల్ చతుర నవల **హారిణి**

చిరునామా: ________________________

________________________

________________________

________________________

# పోలీసువ్యవస్థపై వ్యంగ్యాస్త్రం

# 'ఖాకీవనం'

కథ వెనుక కథ

*'ఖాకీవనం'నవల 1980 నవంబర్ 'చతుర' మాసపత్రికలో ప్రచురితమయ్యాక అది సృష్టించిన సంచలనం అంతా ఇంతా కాదు. ముఖ్యంగా పోలీసువర్గాల్లో అది పెద్ద అలజడినే రేపింది. సాధారణ కానిస్టే*



కె.ఎన్.వై. పతంజలి

*బుల్ నుంచి పోలీసు ఉన్నతాధికారుల వరకూ అనేకమందికి చర్చనీయాంశం అయింది.. కొందరి ముఖాలు జేవురించినా ఎందరినో ఆలోచింపచేసింది. సాహితీరంగంలోనూ ఓ కుదుపునిచ్చింది.. ఆహా.. ఏం నవల? ఏం శైలి? అని సగటు పాఠకుల నుంచి మేధావుల వరకూ కొనియాడారు. కితాబులిచ్చారు. చర్చాగోష్ఠులు నిర్వహించారు. ఇంతటి సంచలనానికి కారణమైన 'ఖాకీవనం' నవల కథ వెనుక కథ ఏమిటి ? ఈ కథా వస్తువు తీసుకోవడానికి ప్రేరణ ఏమిటి అన్న విషయాలపై రచయిత కె.ఎన్.వై. పతంజలి ఇలా చెప్పుకొచ్చారు..*

మాది విజయనగరం జిల్లాలోని అలమండ గ్రామం. విజయనగరం మహారాజా కాలేజిలో బి.కాం., చదివాను. కాలేజీరోజుల్లోనే అవీఇవీ రాయడం అలవాటైంది.. ఎందుకో మొదటినుంచీ ఏదైనా వ్యంగ్యంగా, సునిశితహాస్యంతో చెప్పడమంటే ఇష్టం.. 1963లో తొలినవల రాశాను. అది డిటెక్టివ్ నవల. ఎక్కడా అచ్చుకాలేదు. ఆ తర్వాత మరోటి కూడా రాశాను. కానీ అది పూర్తిచేయలేదు. ఆ తర్వాత కథలూ, కవితలూ రాశాను. కొన్నాళ్లతర్వాత అవన్నీ చించేసి తగలబెట్టేను. 1973 వరకూ ఏవో కొన్ని కథలు రాశాను. తరువాత అంటే 1979 వరకూ ఏ రకమైన రాతల జోలికీ పోలేదు. 'ఈనాడు' దినపత్రికలో ట్రెయినీ సబ్-ఎడిటర్గా చేరాను. ఉద్యోగం చేసుకుంటూ దొరికిన పుస్తకాలు, వెదుక్కు తెచ్చిన పుస్తకాలు చదవడంతోనే సరిపుచ్చుకున్నాను.

## పోలీసులపై గురెందుకంటే?

1979లో 'ఈనాడు' విజయవాడ ఎడిషన్కు బదిలీ అయిన తరువాత ఏదైనా రాద్దామని అన్పించింది. దాష్టీకంమీదా, హింస మీదా, కండకావరం మీదా నాకున్న అసహ్యం ఇంతంత కాదు. ఆ ద్వేషంతో పోలీసులమీద నవల రాద్దామని కూర్చు

న్నాను. పోలీసుల మీద నాక్కోపం ఎందుకంటే నేను 'ఈనాడు'లో చేరిన రోజునే ఎమర్జెన్సీ ప్రకటించింది ప్రభుత్వం. పత్రికాస్వేచ్ఛను చెరపట్టింది.. ప్రతిపక్షనేతల మీద, ప్రజాస్వామిక వాదులమీద దాడులు చేసింది. వాళ్లూ వీళ్లూ అనిలేదు.. ఇది అన్యాయం అన్నవారందరినీ అరెస్టుచేసింది. తనకు ఎదురుచెప్పిన వారందరినీ కటకటాల్లోకి నెట్టింది. ఈ అరెస్టుల సందర్భంగా పోలీసులు వ్యవహరించిన తీరు చాలా అన్యాయంగా ఉండేది. గౌరవనీయులైనవారినీ, మేధావులనూ కూడా నేరగాళ్లలా అదిలిస్తూ.. బెదిరిస్తూ నానాహంగామా చేసేవారు.. అవమానించేవారు. పత్రికలో ఉద్యోగం కావడంతో నిత్యం ఇలాంటి వార్తలెన్నో చదివే పరిస్థితి నాకేర్పడింది. ఆ కారణంగా పోలీసులే నాకు ప్రజాకంటకుల్లా కన్పించేవారు. నాకేకాదు.. సామాన్యుడికి ఎవర్కైనా కంటికి కన్పించే మొదటి ప్రజాకంటకుడు పోలీసే కదా? అందుకే వారిపై రాయాలని నిర్ణయించుకున్నాను.



### మధ్యలో మళ్లీ మార్పు

పోలీసుల మీద కసితో నవల ప్రారంభించాను. కొంత రాసిన తర్వాత పంజాబులోనూ, తమిళనాడులోనూ పోలీసుల సమ్మె జరిగింది. అది హింసాత్మకంగా మారింది. చేసేది పత్రికాఉద్యోగం కనుక దానికి సంబంధించిన వార్తలన్నీ తెలుసుకునే అవకాశం దొరికింది. ఆ తర్వాత విజయవాడలో కొందరు మామూలు పోలీసు కానిస్టేబుల్స్‌ను కలిసి మాట్లాడాను. పోలీసు శాఖలోని దొంతరలు, అట్టడుగు వారి కష్టనష్టాలు నిష్ఠురమయమైన బతుకులు కొంత అర్థమయ్యాయి. దాంతో పోలీసే ప్రజాకంటకుడనే దృష్టితో మొదలైన రచనలో మార్పులుచేయక తప్పలేదు. క్రమంగా అదో చిన్న నవలలా



తయారైంది.

### పోటీకి వెళ్లి తిరిగొచ్చింది

ఆర్టిస్ట్ మోహన్ నా రచనను చదివి, బాగుందంటూ అదేసమయంలో విశాలాంధ్ర ప్రచురణ సంస్థ నిర్వహిస్తున్న నవలల పోటీకి దాన్ని ఇచ్చాడు. చాగంటి సోమయాజులుగారూ, కేతు విశ్వనాథరెడ్డిగారూ, మరి కొందరు పెద్దలు ఆ పోటీకి న్యాయనిర్ణేతలు. వారు ఆ సంవత్సరం మరెవరినో ఉత్తమనవలా రచయితగా ప్రకటించి ఆ బహుమతులేవో వారికిచ్చి నా రాతప్రతిని నాకు బహుమతిగా వాపస్ ఇచ్చారు.

### 'చతుర' ద్వారా ప్రపంచం ముందుకు..

వాపసు వచ్చిన ఆ నవలను ఎవరికి పంపాలో తోచలేదు. ఆంధ్రజ్యోతి వీక్లీకి పంపిద్దామని అనిపించింది కానీ వేస్తారో లేదో అని అనుమానం.. ఈలోగా 'చతుర' సంపాదకుడు చలసాని ప్రసాదరావుగారు ఏదోపనిమీద బెజవాడ వచ్చారు. ఆయన చేతిలో పెట్టాను. ఆయన చదివి అచ్చువేయడానికి సాహసించి, పత్రికాధిపతి రామోజీరావుగారికీ ఓమాట చెప్పి వేశారు. ఆ రకంగా 'ఖాకీవనం' అచ్చయి బయటకు వచ్చింది. నవల రాయడం కన్నా బయటకు తీసుకురావడంలో రామోజీరావుగారు, చలసానిగారు చూపిన సాహసం గొప్పది.

దాన్ని చదివిన మిత్రులు చాలామంది పొంగిపోయారు. విప్లవరచయితల సంఘం మిత్రులు డానీ మొదలైనవాళ్లు, ఎల్ల కమ్యూనిస్టులకు మిత్రుడు విశ్వేశ్వర్రావూ ఏదో ఒక లైబ్రరీలో ఖాకీవనం రాగానే ఒక గోష్ఠి నిర్వహించారు. రచయితగా నన్నూ రమ్మంటే పీక బోయినా సరే నేనాసభకు రానని చెప్పాను.

### ఎస్పీకి సర్దిచెప్పిన రావిశాస్త్రి

ఖాకీవనం పోలీసు వ్యవస్థలోని కుళ్లును నలుగురి ముందూ బట్టబయలు చేయడంతో కొందరు పోలీసు ఉన్నతాధికారులు చాలా సీరియస్ అయ్యారు. బాగుందని దిగువ తరగతి సిబ్బంది అనుకున్నారు. నేనెవరో ఎవరికీ తెలియదు. ఓ హెడ్‌కానిస్టేబుల్ ప్రఖ్యాతకథకుడు రావిశాస్త్రిగారి వద్దకు వచ్చి 'బాబూ.. ఖాకీవనం నవల్లో వాడెవడోగానీ మమ్మల్ని జలకడిగేసేడండీ బాబూ' అంటూ చెబితే ఆయన నవ్వి ఊరుకున్నారట. అలాగే ఓ ఎస్పీ నవలపై బాగా సీరియస్ అయితే '..పోనిద్దురూ.. ఏదో కుర్రాడు తెలిసీతెలియని వయసు' అని శాస్త్రిగారే సర్దిచెప్పారట. ఇవన్నీ ఆయనే నాకు నవ్వుతూ చెప్పారు. అంతేకాదు.. 'పతంజలిగారూ.. మీ నవలను పోలీసులే ఎక్కువగా కొని చదివారండీ' అంటూ నవ్వేవారాయన. నామీద ఆయనకున్న వాత్సల్యం అలాంటిది. ఇక ప్రముఖరచయిత బీనాదేవిగారు ఈ నవలకు 'ప్రచారక్'గా పనిచేశారు. అంటే వీలు చిక్కినప్పుడల్లా ఫలానా నవల చదివారా? కుర్రాడైతేనేం.. బ్రహ్మాండంగా రాశాడు అంటూ తనను కలిసిన మిత్రులందరికీ చెప్పేవారు. నాపై ఆయనకంత ఆదరాభిమానాలు..

### అరెస్టు చేస్తారనుకున్నారు..

రావి శాస్త్రి, బీనాదేవివంటి పెద్దలు ఇంకెందరో నన్ను ఆదరించడానికి ఏకైక కారణం 'ఖాకీవనం'. అసలు ఓ దశలో నవలను నిషేధిస్తారని ప్రచారం అయింది. నిన్నూ అరెస్టు చేస్తారేమో అంటూ మిత్రులు తెగ ఆందోళన చెందేవారు. కానీ అలాంటిదేమీ జరగలేదు. కొన్నాళ్లకు ఈ నవల 'ఖాకీవర్ది యోంకా జంగిల్' పేరుతో హిందీలో అనువాదమైంది. ఇందులోని చాలా సన్నివేశాల్ని కొద్దిగా అటూ ఇటూ మార్చి మార్చకుండా కూడా చాలా సినిమాల్లో వాడుకున్నారు. పాత్రికేయ మిత్రులు ఈ టైటిల్‌ను ఎన్నిరకాలుగా కావాలంటే అన్నిరకాలుగా వాడి అరగదీసేశారు.. ఇదీ 'ఖాకీవనం' కథ.

సేకరణ: – చంద్రప్రతాప్

★

# ఆలయమేల? అర్చనలేల?

ఈ మధ్య మీడియోలో వస్తున్న వార్తలు చూస్తుంటే మన వేమన్నకు ఎంత 'ఫాలోయింగ్' ఉందో తెలిసి బిత్తరపోతాం!

'కామిగాక మోక్షగామి కాడు' అనీ

'మొదట సోమయాజి తుద కామయాజిరా' అనీ వేమన్న అన్న మాటల్లో మొదటి అర్ధభాగాన్ని అక్షరాలా ఆచరిస్తున్న స్వాములను చూస్తుంటే 'ఈ స్వాముల మాటున ఏ స్కాములు దాగెనో' అనిపిస్తుంది. భక్తిప్రపత్తులు వెల్లివిరియవలసిన ప్రదేశాలైన గుళ్ళూ, గోపురాలు, మఠాలూ, పీఠాల్లో 'రక్తి ప్రపత్తులు' విజృంభిస్తున్నాయన్న 'విషయం' 'బట్టబయలు' అవుతుంటే, 'నీలి' మేఘశ్యాముల గురించి తలచుకుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. తాపీ ధర్మారావు రాసిన దేవాలయాలపై 'బూతుబొమ్మలు', అరుద్ర రాసిన 'గుడిలో సెక్సు' వంటివి చదివి 'గ్రంథసాంగులను' గురించి తెలుసుకుంటే 'ఏది భక్తి? ఏది సంప్రదాయం ఓ మహాత్మా? ఓ మహర్షీ' అనిపిస్తుంది. బుర్ర తిరిగిపోతోంది. ఆలయమేల? అర్చనలేల? అన్న విరక్తి పుడుతుంది!

అందరికీ తెలిసిన ఓ ఆలయంలోని పూజారులే జారులై సాధువులే 'సన్యాసులై' 'రాసలీలావేళ ఇదే'నంటూ 'కామాతురాణానాం న భయం న లజ్జ' అన్నట్టు ప్రవర్తించినట్టు 'భోగట్టా'. దీనికితోడు మహిళలతో బూతుచిత్రాలు తీస్తూ వాటిని సి.డి.ల రూపంలో 'చీకటి' మార్కెట్‌కు తరలిస్తూ వ్యాపారం చేస్తున్న కేడీలను చూస్తుంటే 'కాషాయపు తెరమరుగున కామం ప్రసవిస్తున్నది' అన్న మాట గుర్తొస్తుంది.

పుణ్యానికి పోతే పాపం వెంట వస్తుందా? అని భక్తులు భయపడే గడ్డురోజులు వస్తున్నాయి. పవిత్ర ప్రదేశాలలో కూడా సరికొత్త మాఫియా చేతుల్లో పడితే మనశ్శాంతికి మార్గమెక్కడ?

కంచే చేను మేస్తుంటే 'ఇదేనా ఇదేనా మన సంప్రదాయ మిదేనా? ' అనిపిస్తుంది. 'ఉన్నావా? అసలున్నావా ఉంటే కళ్ళు మూసుకున్నావా? ' అని దేవుణ్ణి ప్రశ్నించాలనిపిస్తుంది. కలడు కలండనెడువాడు కలడో లేడో అన్న అనుమానం వస్తుంది.

'నిధి చాలా సుఖమా రాముని

సన్నిధి చాల సుఖమా? ' అని అలనాడు త్యాగయ్య పాడితే ఈనాటి 'భోగయ్యలు' రాముని విగ్రహాల దగ్గర ఉండే పెన్నిధులే చాలా సుఖమని 'భోరారా!' పాడుతున్నారు. దేవుణ్ణి 'నమ్మే' రోజులు గతిస్తూ దేవుణ్ణి 'అమ్మే' రోజులకు స్వాగతించే పాడుకాలం దాపురిస్తున్నది. మహర్షులు తిరిగిన సీమల్లో మహమ్మారులు తిరుగుతుంటే 'దేశమే గతి బాగుపడునోయ్' అన్న సందేహం రాకతప్పదు. దొంగల చేతికి తాళాలు ఇస్తున్నామా? అన్న బాధ కలుగకమానదు. ఆధ్యాత్మిక సుగంధాలతో పునీతం కావాలసిన ప్రదేశాల్లో పిశాచాలు కులుకుతుంటే మనస్సు కలుక్కుమంటుంది.

ఈ పరిస్థితిని చూస్తుంటే

'భగవంతుడా! నిన్ను నీవు రక్షించుకో!

నీ మందిరాలను కాపాడుకో, మమ్మల్ని రక్షించనక్కరలేదు' అని ప్రార్థించక తప్పదు. ఈ ముందుచూపు వల్లనేనేమో 'ధర్మోరక్షతి రక్షితః' అనేమాట పుట్టింది. దేవుడు ధర్మస్వరూపుడుకదా! ఆయన్ను (ఆడదేవతలు కోప్పడకండి!) మనం రక్షిస్తేనే, ఆయన మనల్ని రక్షిస్తాడు. కాబట్టి మనపని మనం కానిద్దాం!

– ఫన్‌కర్

★

# చతుర

## నవలా పరిచయం

స్నేహితులతో సరదాగా నవ్వుతూ, తుళ్ళుతూ ఉండవలసిన ఆ శ్రీమంతురాలైన విద్యార్థిని సదా చిరాకుగా ఉంటుంది. బిచ్చగాళ్ళకు పావలా విదల్చక చీదరించుకునే ఆమె తనకు డబ్బంటే లెక్కలేదని నిరూపించుకోవడానికి పదివేల రూపాయల్ని క్షణంలో కాల్చి బూడిద చేస్తుంది. తోటివారు చావు బతుకుల్లో ఉన్నా పట్టించుకోని అహంకారి.

అలాంటి యువతిని తొలి చూపులోనే ప్రేమించి మనసు పారేసుకున్నాడా యువకుడు. ప్రేమ, జాలి, దయ, స్నేహం వంటి గుణాలకు అతీతంగా, పాషాణ సదృశంగా ఆమె మారడానికి గల కారణాలను అన్వేషించి ఆమెను మార్చి, ఆమె ప్రేమను పొందడానికి ఆ యువకుడు చేసిన సాహసాలను హృద్యంగా వర్ణించిన

**మునిపల్లె లక్ష్మీరమణకుమారి** నవల

# హారిణి

ఈనెల చతుర సమర్పణ.

## రచయిత్రి పరిచయం



చదివింది ఎం.కామ్. ఏ.జీ. ఆఫీస్‌లో సెక్షన్ ఆఫీసర్‌గా ఉద్యోగం.ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, స్వాతి మొదలైన వివిధ పత్రికలలో అచ్చయిన కథలు నలభై. ఆకాశవాణిలో అయిదు నాటికలు ప్రసారమయ్యాయి. యాభైకి పైగా వివిధ భాషల కథలు అనువాదం చేశారు. ఆంధ్రభూమిలో పెద్దకథల పోటీలో, ఆంధ్రజ్యోతి న్యూ జెర్సీవారి కథల పోటీలో కన్సొలేషన్ ప్రైజ్‌లు లభించాయి. ఆంధ్ర భూమి మాసపత్రికలో రెండు చిన్న నవలలూ, 'చతురలో నాలుగు నవలలూ ప్రచురితమయ్యాయి.

చిరునామా: ఎం.లక్ష్మి రమణకుమారి
సెక్షన్ ఆఫీసర్, యూ.పీ. సెల్,IIIrd. ఫ్లోర్,ఏ.జీ. ఆఫీస్,
(ఎ అండ్ ఇ),హైదరాబాద్.

"మెడొన్నా కాలేజ్ ఆఫ్ ఇంజినీరింగ్ అండ్ టెక్నాలజీ"

అందమైన బోర్డు ఎండలో ధగధగ మెరుస్తోంది. నిజానికి ఆ కాలేజీ స్థాపించాలనుకున్న చింతపిక్కల మాదన్నగారు దానికి తనపేరే పెట్టాలని అనుకుని శంకుస్థాపన ముహూర్తం కోసం ఒక గొప్ప సిద్ధాంతిని సంప్రదించారు. ఆ సిద్ధాంతికి విద్యతోపాటు లోకజ్ఞానం, లోకానుభవం కూడా ఉన్నాయి. మాదన్న పేరు పెడితే కుర్రకారు ఎట్రాక్ట్ కారేమోననిపించింది ఆయనకి. కాలేజీ గనక విద్యార్థులతో కళకళలాడకపోతే నువ్వు పెట్టిన ముహూర్తం బాగాలేదని తనమీద ఎక్కడ విరుచుకుపడతాడోనని భయంవేసి, ఉపాయం గల మనిషి కాబట్టి తెలివిగా ఒప్పించాడు.

"చింతపిక్కల మాదన్న అన్న పేరు కాలేజీ స్థలం దృష్ట్యా కలిసి రాదనిపిస్తోంది... పోనీ మీకు మరీ పట్టుదలగా ఉంటే మీ పేరుకి సరిపోయేట్లు మాదన్న బదులు మెడోన్నా అని పెడదాం" అన్నాడు. కాలేజ్ పెట్టి, కోట్లు ఆర్జిద్దామన్న ఆశ ఉంది కాబట్టి మాదన్నగారు రాజీపడిపోయి మెడొన్నా కాలేజ్ అని నామకరణం చేసేశారు.

ఆపేరు స్టూడెంట్స్‌ని బాగా ఆకర్షించింది. మాదన్నగారి ఆశ నెరవేరి పిల్లలతో కాలేజీ కళకళలాడిపోతోంది.

కాలేజ్‌కి ముందూ, వెనకా చక్కటి గార్డెన్, మధ్యలో అద్భుతమైన బిల్డింగులూ ఉన్నాయి.

కాలేజ్‌లో ముందువైపు గార్డెన్ నిండా విద్యార్థులు కోతుల్లా కూర్చుని ఉన్నారు. కొత్త విద్యా సంవత్సరం ప్రారంభమై నెలరోజులే అయింది. కొత్త కాబట్టి కొత్త మోజులో వచ్చిన వాళ్ళూ, కొంతమంది దారినపోయే దానయ్యలూ అంతా కలసి కాలేజ్ కిటకిటలాడుతోంది. రంగురంగుల జీన్ ప్యాంట్స్, టీషర్టులూ, ఫుల్ షర్టులూ, హాఫ్‌షర్టులూ రకరకాల రంగుల డ్రెస్సులు ధరించిన అబ్బాయిలూ, మిడ్డీలూ, హాఫ్‌స్కర్ట్లూ, చుడీదార్లూ, జీన్‌పాంట్‌లూ అనేక రకాల డ్రెస్సుల్లో అమ్మాయిలూ కలిసి చూసేవాళ్ళకి కళ్ళు చెదిరిపోయేలా కనిపిస్తున్నారు. ఆనందం, సరదా, జోక్స్, వెటకారాలు రకరకాల అరుపులూ పాటలూ అదొక కొత్త సిద్ధ విద్యాధర లోకంలా ఉంది.

కిష్కింధలా ఉన్న ఆ గార్డెన్‌లో కొందరు పళ్ళికిలిస్తుంటే మరికొందరు కామెంట్స్ చేస్తున్నారు. ఇంకొంతమంది మౌనంగా ఉన్నారు.

వాళ్ళు అంతా ఒక్కలాగే పైకి కనిపిస్తున్నా ఈ ప్రపంచంలో ఉన్నట్లే చాలా రకాల మనుషులున్నారు. కొందరు వేదాంతులు కూడా ఉన్నారు. కొందరు ప్రేమికులూ, మరికొందరు భగ్నప్రేమికులూ కూడా ఉన్నారు. వారసత్వంగా పాలిటిక్స్‌లో తిరిగే వాళ్ళున్నారు.

అందరిలో పవన్‌ది ప్రత్యేక లోకం. నెల రోజులు గడిచినా అతనేమిటో ఎవరికీ అర్థం కాలేదు. బాగా చదువుతాడు.

ఏ విషయంలో అయినా మంచి నాలెడ్జ్ ఉంది. అతను మాట్లాడుతుంటే అంతా వింటూ ఉండిపోతారు. సరదాగా బాబాయ్ అని పిలుస్తుంటారు.

మొహం వేళ్ళాడేసుకుని కాళ్ళీడ్చుకుంటూ వస్తున్న హరీష్‌ని చూసి శ్రీకాంత్ ఆశ్చర్యపోయాడు.

"అదేంట్రా? నిన్న నీ గర్ల్‌ఫ్రెండ్‌తో సినిమాకి వెళ్తున్నానని చెప్పి పక్షిలా ఎగుర్తూ వెళ్ళావు కదా? ఏమైంది? వస్తానని హ్యాండిచ్చిందా? అలా ఉన్నావేం?" అడిగాడు.

"వచ్చింది. సినిమాకి వెళ్ళాం. కానీ అదే కొంప ముంచింది" హరీష్ నీరసంగా చెప్పాడు.

"ఏమైంది?"

"హాయిగా సినిమా చూశాం. ఇంటర్వె

ల్‌లో కూల్‌డ్రింక్స్ తాగాం. చివరిదాకా అంతా బాగానే ఉంది. కానీ చివర్లోనే..." హరీష్ రుమాలు తీసి కళ్ళు తుడుచుకున్నాడు.

"ఏమైంది? అప్పేమైనా అడిగిందా? "

"ఛీ. అదేం లేదురా. కానీ జాయ్ టీవీ ఛానెల్ వాళ్ళుట... హాల్లోంచి బయటకు వస్తుంటే మమ్మల్నందర్నీ వీడియో తీస్తూ, 'ఈ సినిమా ఎలా ఉంది? దీనిమీద మీ అభిప్రాయం ఏంటి?' అని వెంటబడ్డారు. ఖర్మ, తప్పించుకునే టైం లేకపోయింది. అదంతా లైవ్‌షో వచ్చిందిట. నేను వెళ్ళేసరికే మా ఇంట్లో అంతా ఆ ప్రోగ్రాం చూసేశారు. ఏరా చదువుకొమ్మని కాలేజ్‌కి పంపిస్తే గర్ల్స్‌తో సినిమాలు చూస్తావా అని మా మమ్మీ డాడీ..." హరీష్ ఇంక చెప్పలేక ఆగాడు.

"అర్థమైంది. నీపని క్లోజ్. ఇంక పాకెట్ మనీలో కూడా కటింగ్ పెడతారు. అయ్యో ఖర్మ. ఈ టీవీల వాళ్ళు ఎందుకిలా మన ప్రాణాలు తీస్తారో..." అంతా మూలిగారు.

హరీష్ నీరసంగా అడుగులు వేస్తూ క్యాంటీన్ వైపు వెళ్ళాడు.

"తిక్క కుదిరింది. పెద్ద తనకే గర్ల్‌ఫ్రెండ్ ఉందని పోజు" గర్ల్‌ఫ్రెండ్ లేనివాళ్ళు కొందరు సంతోషిస్తూ, పళ్ళు నూరారు.

పైకి సానుభూతి చూపించినా లోపల మాత్రం చాలామంది ఆనందించారు.

హఠాత్తుగా గేటుముందు చాలా స్పీడ్‌గా, మేఘాలమీద ప్రయాణం చేస్తున్న విమానంలా ఒక పొడవాటి కారు వచ్చి కీచుమని శబ్దంచేసి ఆగింది.

పవన్ అతని ఫ్రెండ్ రాజ్‌మోహన్ గార్డెన్లో సిమెంట్ సోఫాల్లో కూర్చుని ఉన్నారు.

"కారుని అంత స్పీడ్‌గా మాత్రమే నడపాలని ఏదన్నా రూలా? వెధవ న్యూసెన్స్." అన్నాడు రాజ్ కిరణ్ ఎండలో మిలమిలలాడిపోతున్న కారువైపు కోపంగా చూస్తూ.

"ఖరీదైన కార్లు. పికప్ కూడా అలాగే ఉంటుంది కాబోలు."

"ఇట్లాగే యాక్సిడెంట్స్ చేస్తారు" అన్నాడు రాజ్‌కిరణ్.

ఇంతలో కారు స్టూడెంట్స్‌ని క్లియర్ చేసుకుంటూ కాలేజ్‌లో ప్రవేశించింది. నేరుగా వచ్చి పవన్, కిరణ్ కూర్చున్న దగ్గరే ఆగింది.

తమముందే ఆగింది కాబట్టి అప్రయత్నంగా వాళ్ళిద్దరూ ఆ కార్లో ఎవరున్నారా అన్నట్లు యథాలాపంగా చూశారు.

అంతే. వాళ్ళ చూపులు అక్కడే ఫిక్స్ అయిపోయాయి. తెరిచిన కారు డోర్లోంచి మొదట లేత గులాబీరంగులో పువ్వులా మెరిసిపోతున్న ఒక పాదం కనిపించింది. పాదం మీద నుంచి దృష్టిని దాని తాలూకు మొహం దాకా పోనిచ్చేసరికి వాళ్ళ కళ్ళు తిరిగిపోయాయి.

ఆ అమ్మాయి ఒక వండర్‌ఫుల్ బ్యూటీ. లేత గులాబీరంగు, బంగారం కలిపి మలిచినట్లున్న ఒళ్ళు, తీర్చిదిద్దినట్లున్న ఒంపుసొంపులు, కళ్ళు చెదరగొట్టే కనుముక్కు తీరు, పట్టులాంటి జుట్టు, మనిషిని ఇంకా అందంగా కనిపించేటట్లు చేస్తున్న నల్లటి సిల్క్ ఫ్రాక్... చెప్పలేనంత అందంగా ఉంది ఆ అమ్మాయి.

పవన్ ఆమె మీద నుంచి తన కళ్ళు తిప్పుకోలేకపోయాడు. ఆ అమ్మాయి అతని మనసుని ఇనుముని పట్టి లాగేసిన అయస్కాంతంలా లాగేసింది. అన్నీ మర్చిపోయి ఆమెనే చూస్తూ ఉండిపోయాడు.

వాళ్ళే కాదు. అక్కడ ఉన్న అందరూ ఆమెవైపు అలాగే గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయారు.

రాజ్‌కిరణ్ కాస్త ముందుగా స్పృహలోకి వచ్చి పవన్‌ని తట్టి కుదిపాడు. ఈలోపల ఆ అమ్మాయి స్పీడ్‌గా నడుస్తూ ముందుకి సాగిపోయింది.

పవన్ ఆ అమ్మాయిని చూసి ఇంతగా

షాక్ అవటం కిరణ్‌కి ఆశ్చర్యం కలిగించింది. వాళ్ళిద్దరూ ఇంటర్‌లో కూడా ఫ్రెండ్స్. ఇంత అందమైన వాళ్ళని కాకపోయినా కాస్త అటూ ఇటూగా ఉన్న అమ్మాయిల్ని ఎంతమందినో చూస్తూనే వచ్చారు. పవన్ ఇలా ఎందుకు అయాడో కిరణ్‌కి అర్థంకాలేదు. అదీ గాక పవన్ అందరి లాంటి అబ్బాయి కాడు. చిన్నప్పుడే ఎంతో జీవితాన్ని చూసి ఎంతో జ్ఞానం సంపాదించాడు. మంచిమంచి పుస్తకాలు చదివి ఎంతో నేర్చుకుని వాటిని ఆచరిస్తుంటాడు కూడా. అతనికి గురువూ, మార్గదర్శీ అయిన జ్ఞానానందం మాస్టారు పవన్‌కి ఎన్నో సత్యాలు చెప్పారు. బాహ్య సౌందర్యం కన్నా అంతఃసౌందర్యం చాలా గొప్పదని పవన్ గట్టిగా నమ్ముతాడు. అతనికి చాలా ఆదర్శాలున్నాయి. కొన్ని ఆశయాలున్నాయి. వాటిని సాధించాలని చాలా కృషి చేస్తున్నాడు. అందుకని పవన్ కూడా మామూలు అందరు అబ్బాయిల్లా ఆ అమ్మాయిని గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయేసరికి కిరణ్‌కి ఆశ్చర్యం కలిగింది.

"ఆ అమ్మాయిలో ఏదో ఉంది" అన్నాడు పవన్.

"డబ్బు. డబ్బు ఇచ్చే మెరుపూ, ఆకర్షణా వంద బ్యూటీ పార్లర్లు కూడా ఇవ్వలేవు" అన్నాడు కిరణ్.

"అది కాదు. ఇంకేదో..."

"సరేలే. క్లాస్‌కి టైమ్ అవుతోంది" అన్నాడు కిరణ్.

ఇద్దరూ తమ క్లాస్‌వైపు నడిచారు. మొదటి పీరియడ్ ఇంగ్లీషు.

అప్పటికి క్లాసులు మొదలై నెలరోజులైంది. క్లాస్‌లో ఒకళ్లకొకళ్ళు అంతా బాగా పరిచయమైపోయారు. పవన్ క్లాస్‌లో అడుగుపెట్టబోతూ మళ్ళీ ఒక్కసారిగా స్తంభించిపోయినట్లు ఆగిపోయాడు.

ఆ అమ్మాయి మొదటి వరుసలో కూర్చుని ఉంది. పవన్ తనను తాను సంభాళించుకుని క్లాస్‌లోకి నడిచాడు.

ఇంగ్లీష్ లెక్చరర్ సుధ వచ్చింది. మొదటి వరుసలోనే కూర్చోవటం వల్ల సుధ దృష్టి వెంటనే ఆ అమ్మాయి మీద పడింది. ఆ స్టన్నింగ్ బ్యూటీని చూసిన ప్రతి ఒక్కళ్ళూ రియాక్ట్ అయినట్లే, సుధ మొహంలో కూడా ఆశ్చర్యం, ప్రశంస కనిపించాయి.

కొత్తగా వచ్చింది కాబట్టి ఆమెను లెక్చరర్ తప్పకుండా పేరు అడుగుతుంది. ఆ అమ్మాయి పేరు తెలుసుకోవాలని పవన్‌కి చాలా ఆసక్తిగా ఉంది. సుమ, శిరీష, మాధురి, రమ్య... ఆ అమ్మాయి పేరు ఏమై ఉంటుంది? ఇంత అందమైన అమ్మాయి పేరు ఇంకెంత మృదువుగా ఉంటుందో కదా!

"కొత్తగా వచ్చావా? " సుధ అడిగింది.

"అవును" ఆ అమ్మాయి జవాబు చెప్పింది. ఆమె కంఠం ఎలా ఉంటుందో అని ఎదురుచూసిన పవన్‌కి ఆశ్చర్యం కలిగింది. ఆమె స్వరం కూడా ఆమెకి తగ్గట్లే అందంగా ఉంది. కానీ మృదువుగా మాత్రం లేదు. జవాబు చెప్తున్నట్లు కాకుండా శాసిస్తున్నట్లు అదోమాదిరి అహంకారం స్పష్టంగా ధ్వనిస్తోంది ఆ స్వరంలో.

అందరూ ఆ అమ్మాయినే చూస్తున్నారు. పవన్ రెప్ప వాల్చకుండా ఆమెనే చూస్తున్నాడు. అప్పుడు అతను కనిపెట్టాడు. ఆమె చాలా అందంగా ఉంది కానీ ఆ కదలికల్లో, మొహంలో అంతులేని అహం, దర్పం ఉన్నాయి. నేనొక రాజకుమార్తెనని మీరంతా నాకు దాసులు అన్నట్లు నిర్లక్ష్యంగా చూస్తోంది.

"నీ పేరేంటి? " అడిగింది సుధ.

"నా పేరు ..." ఆ అమ్మాయి ఒక్క క్షణం ఆగి చుట్టూ చూసింది.

అంతా ఆసక్తిగా చూస్తున్నారు. పవన్ అయితే చెవులు రిక్కించుకుని వింటున్నాడు.

"నా పేరు షెర్నీ" అంది ఆ అమ్మాయి.

"షెర్నీనా... అంటే ..." సుధ ఆశ్చర్య పోతూ అడిగింది.

"షెర్నీ అంటే ఆడ సింహం" షెర్నీ చాలా నిర్లక్ష్యంగా చూస్తూ జవాబు చెప్పింది.

"ఓ. కే. ఇంటర్ ఎక్కడ చదివావు? "

"హోలీ హార్ట్ జూనియర్ కాలేజ్‌లో" ఇంకేం అడక్కు అన్నట్లు నిటారుగా కూర్చుంది షెర్నీ.

షెర్నీ? ఇదేం పేరు? ఎన్నో మంచి పేర్లు ఉండగా, ఇంత అందమైన అమ్మాయికి షెర్నీ అని పేరు పెట్టటానికి ఆ తల్లి దండ్రులకి మనసెలా ఒప్పింది? పవన్ ఆలోచిస్తున్నాడు.

క్లాస్ ఎలా ముగిసిందో కూడా తెలీదు. అంతా లేచి వెళ్ళిపోయారు. కిరణ్, పవన్ మాత్రం మిగిలారు.

"పవన్.. నీకో మంచి ఛాన్స్" అన్నాడు కిరణ్.

ఏమిటన్నట్లు చూశాడు పవన్. కిరణ్ షెర్నీ కూర్చున్న బెంచ్‌వైపు చూపించాడు. నేలమీద ఒక అందమైన రుమాలు పడి ఉంది. చాలా ఖరీదైన సిల్క్ కర్చీఫ్ అది.

"ఇది ఖచ్చితంగా షెర్నీదే" అన్నాడు కిరణ్.

"నో డౌట్, అయితే? "

"నిజం చెప్పు. నీకు ఆ అమ్మాయితో మాట్లాడాలని లేదూ? " కిరణ్ కొంటెగా అడిగాడు.

"ఉంటే? " పవన్ ఎటూ కాకుండా చెప్పాడు.

"పవన్, ఇది తీసుకెళ్ళి షెర్నీకివ్వు. మీదేనా అని అడుగు. పలకరించటానికి ఛాన్స్ దొరుకుతుంది. ఇది డెఫినిట్‌గా ఆమెదే కాబట్టి హ్యాపీగా థాంక్స్ చెప్పి తీసుకుంటుంది. నువ్వు ఆమెకి ఫ్రెండ్ అయిపోతావు."

పవన్ నవ్వేశాడు.

"సరేలే. అవన్నీ అనవసరం. కానీ ఇది ఆమెది కాబట్టి ఆమెకి చేరుస్తే సరి. మనకి నెక్స్ట్ క్లాస్ వేరే చోట కాబట్టి షెర్నీ మళ్ళీ ఇక్కడికి రాదు. ఈ కర్చీఫ్ దొరికే ఛాన్స్ కూడా లేదు. మనమే ఇచ్చేయటం బెటర్."

"ఓ. కే. ప్రొసీడ్, పద."

ఇద్దరూ క్లాస్‌లోంచి బయటకు వచ్చారు. ప్యారిస్‌లో ఫ్యాషన్ షోలా ఉన్న కాలేజ్ క్యాంపస్‌లో తిరుగుతూ షెర్నీ కోసం వెతుకుతున్నారు.

ఒక చెట్టుకింద నిలబడ్డ షెర్నీ కనిపించింది. కానీ చుట్టూ వాళ్ళ క్లాస్‌మేట్స్ స్వప్నా, హృతికా, రోహిణీ ఉన్నారు.

"బాబోయ్, వాళ్ళంతా ఉన్నారు. నవ్వుతారో ఏమో? అసలే ఫాస్ట్ గర్ల్స్. ఈ కర్చీఫ్‌ని క్లాస్‌లో వదిలి వచ్చేద్దాం." అన్నాడు పవన్.

"నీకు అన్నీ డౌట్సే. వాళ్ళంతా ఫాస్ట్ గర్ల్స్ కానీ షెర్నీ సూపర్ ఫాస్ట్. వాళ్ళందర్నీ వన్ మినిట్‌లో డిస్పోజ్ చేసేస్తుంది చూడు" అన్నాడు కిరణ్.

కిరణ్ జోస్యం హండ్రెడ్ పర్సెంట్ కరెక్ట్ అయింది. ఇద్దరూ అక్కడికి చేరేలోపలే షెర్నీ వాళ్ళతో డైలాగ్స్ కట్ చేసేసినట్లుంది. వాళ్ళంతా వెళ్ళిపోయారు.

షెర్నీ ఒక్కతే నిలబడి ఉంది.

"వెళ్ళు ఇచ్చిరా" అన్నాడు కిరణ్ షెర్నీకి వినబడకుండా గుసగుసగా.

పవన్ బెదురుగా చూశాడు. ముందుకి నడిచాడు.

"ప్లీజ్, ఎక్స్క్యూజ్ మి" అన్నాడు పవన్. షెర్నీ తటాల్న ఇటు తిరిగింది.

ఆ తిరగటంలో ఒక వేగం, ఒక వడి, ఆ మొహంలో రాజసం... దర్పం.

"ఇది మీదేనా? " కర్చీఫ్ చూపిస్తూ అడిగాడు పవన్. షెర్నీ కనుబొమలూ, ముక్కూ చిట్లించింది. పవన్‌వైపు సూటిగా చూసింది.

ఆ కళ్ళల్లో కనిపిస్తున్న తిరస్కారం, అహం చూసి పవన్ కృంగిపోయాడు.

"మీది కాదా? సారీ. మీరు కూర్చున్న

బెంచ్ కింద కనబడింది" అన్నాడు.

"నాదే. కానీ కిందపడ్డ వాటిని మళ్ళీ తీసుకునే అలవాటు నాకు లేదు" షెర్నీ కరుగ్గా చూస్తూ చెప్పింది.

"మరి దీన్నేం చెయ్యను?" పవన్ తడబడుతూ అడిగాడు.

"విసిరి అవతల పారెయ్యి" అనేసి చకచకా ముందుకి నడిచింది షెర్నీ.

ఆమె కళ్ళల్లో కనిపించిన కఠినత్వం ఒక్క క్షణంపాటు పవన్‌ని నిరుత్తరుడిని చేసింది.

తను చూసింది నిజమేనా?

ఆమె కళ్ళల్లో క్రూరత్వం ఉందా?

ఎందుకుంటుంది?

తను పొరపాటు పడుతున్నాడు అనుకున్నాడు.

★ ★ ★



గేటుకి కాస్త దూరంలో కాలేజ్ బిల్డింగ్ మెట్ల మీద కూర్చుని, వచ్చేపోయే వాళ్లందరినీ తలా ఒక మాట అంటూ పలకరిస్తున్నారు కొందరు అల్లరిపిల్లలు. పవన్ కూడా వాళ్ళ దగ్గర కూర్చుని మౌనంగా అంతా గమనిస్తున్నాడు.

"ఎక్సరే ప్యాంట్. ఎక్స్‌రే ప్యాంట్" అని అరిచారు. కంప్యూటర్ లెక్చెరర్ కోపంగా వెనక్కు తిరిగి చూశాడు.

"ఎక్సరే ప్యాంటా? ఎవర్నంటున్నావ్?" అని అడగాలనుకున్నాడు కానీ, కల్లు తాగిన కోతుల్లాంటి విద్యార్థుల్ని ఏం అడిగినా లాభం లేదని ఆయనకి తెలుసు. ఏమంటే ఏం పరువు తీస్తారోనని భయంవేసి, చరచరా నడుస్తూ వెళ్ళిపోయాడు.

"ఎక్స్‌రే ప్యాంట్ అంటే ఏంటి?" ఆశ్చర్యంగా అడిగాడు శ్రీకాంత్.

"ఆయన ప్యాంట్‌లోంచి డ్రాయర్ కనిపిస్తోంది చూడు. అదే ఎక్స్‌రే ప్యాంటంటే" నవ్వాడు హరీష్.

అలాగే అటుపోతున్న ప్రతివాడినీ ఏదో ఒకటి అని వెక్కిరిస్తున్నారు.

అంతలో ఒకమ్మాయి ఎందుకోగానీ స్పీడ్‌గా పరిగెత్తుకుంటూ వచ్చి, వీళ్ళ దగ్గరకు రాగానే ధభాల్న జారి పడిపోయింది. జారిపడ్డ పిల్లని ఏమాత్రం జాలిలేకుండా 'హిహిహ' అని పళ్ళికిలిస్తూ వెక్కిరిస్తున్నారు అంతా. ఆ అమ్మాయి లేవటానికి తంటాలు పడుతుంటే పవన్ వెళ్ళి చెయ్యి అందించబోయాడు. ఆ అమ్మాయి కోపంగా చూసి, 'హుఁ' అంటూ ఉరిమి లేచి నిలబడింది.

"అంత హైహీల్స్ ఎందుకు? పడిపోతావు. ఏకాలో చెయ్యో విరిగితే కుంటిదానవని పెళ్ళికూడా కాదు. ఇంటి కెళ్ళేటప్పుడు మామూలు చెప్పులు కొనుక్కో. హిహిహి" అన్నాడు ఒకడు.

ఆ అమ్మాయి పవన్‌వైపు కోపంగా చూస్తూ వెళ్ళిపోయింది.

"ఇది మరీ బాగుంది. మధ్యలో నేనేం చేశాను? హెల్ప్ చెయ్యబోవటం కూడా తప్పేనా?" అన్నాడు పవన్.

"అదే మరి. ఈ రోజుల్లో ఎవర్నీ పాపం అనుకోకూడదు"

"అటు చూడరా" అన్నాడు శ్రీకాంత్. అంతా అటు చూశారు. ప్రణీత వస్తోంది.

బహుజనులకు సుఖసంతోషాలను ఏది సంపాదించి పెట్టగలదో అదే ఉత్తమమైన పని.
– ఫ్రాన్సిస్ హట్సన్

## ఏడొంతులు చచ్చాడన్నమాట..




అదో పల్లెటూరి బడి..

కలరావల్ల ఫలానా ప్రాంతంలో 12.7 శాతం మరణించారని బోర్డుమీద రాసిమరీ ఓ ఉపాధ్యాయుడు తరగతి గదిలో పాఠం చెబుతున్నాడు.

అటుగా పోతున్న ఓ గ్రామపెద్ద అదివిని 'ఏంటయ్యా మాస్టరూ.. 12కి ఏడుకి మధ్య ఆ చుక్క ఏంటి? ' అన్నాడు.

'దానర్థం 12కన్నా ఎక్కువ 13కన్నా తక్కువ అని అర్థమండీ' అన్నాడుఉపాధ్యాయుడు వినయంగా.

గ్రామపెద్దకు అర్థంకాలేదు. ఆయనకెలా చెప్పాలో ఉపాధ్యాయుడికీ తెలియక తికమక పడుతున్నాడు.. అంతలో ఆ గ్రామపెద్దే సర్లే కంగారుపడమాక.. నాకర్థమైందిలే.. పన్నెండు మంది పూర్తిగా చచ్చారు.. పద మూడోవాడు ఏడొంతులు చచ్చి ఇంకా కొనూపిరితో ఉన్నాడంతేగా!' అను కుంటూ వెళ్లిపోయాడు.

"ఒరేయ్ అది శుభ్రంగా తాగేసి వస్తోందిరా" అన్నాడు హరి

"నీకెలా తెలుసు? " ఆశ్చర్యంగా అన్నారు అంతా.

"దాని కళ్ళు చూడు... వాలిపోతూ, చిట్లించుకుంటూ, అదోలా చూస్తూ, మత్తులో ఉన్నట్లు లేవూ? పైగా తూలుతూ నడుస్తోంది"

"ఫూల్. దానికి సైట్ ఉంది. షోకుకి తక్కువని కళ్ళజోడు పెట్టుకోకుండా కాంటాక్ట్ లెన్స్ పెట్టుకుంది. అవి సరిగ్గా అడ్జస్టకాక కళ్ళు అదోలా చికిలించి నడుస్తోంది. అది మనలా కాదు. రాత్రిళ్ళు బాగా చదువుతుంది. నిద్రలేక కాస్త తూలుతోంది అంతే" అన్నాడు శ్రీకాంత్

"అంతేనా? తాగేసి రాలేదా? " నిరుత్సాహంగా అడిగాడు హరి. "కళ్ళజోడు పెట్టుకో" అని ప్రణీతకి ఉచిత సలహా ఇచ్చాడు. ఆమె కోపంగా తల ఎగరేసి వెళ్ళింది.

"అయినా మీరు దార్లో కూర్చుని ఇలా అందర్నీ వెక్కిరించటం ఏమన్నా బాగుందా? " అన్నాడు పవన్.

రాజ్ కిరణ్ కి కోపం వచ్చింది.

"నువ్వు మిస్ అండర్‌స్టాండ్ చేసుకుంటున్నావు. నీకు తెలుసా? గ్రీకు తత్త్వవేత్త సోక్రటీస్ తన శిష్యులతో నాలుగురోడ్ల కూడలిలో కూర్చునేవాడుట. ఆయనా, ఆయన శిష్యులూ దారినపోయే వాళ్ళందరికీ అడక్కుండానే సలహాలూ, తమ అభిప్రాయాలు చెప్పేవాళ్ళుట. అది విమర్శగా జనానికి అనిపించేది. కానీ కాదు. అవి నిజానికి వాళ్ళ బాగుకోరి చెప్పే మాటలు" అన్నాడు.

పవన్‌కి నవ్వు ఆగలేదు

"పోలికలకేం తక్కువలేదు. గొప్ప గొప్ప వాళ్ళతో పోలికలు" అన్నాడు.

"ఉన్నమాట చెపుతున్నాము. నలుగురిలో నవ్వులపాలయ్యే బదులు వాళ్ళలో ఉన్న లోపాలు మనలాంటి వాళ్ళు ఎత్తిచూపిస్తే, వాళ్ళు తెలుసుకుని మారతారు. మేం చెప్పేవన్నీ వాళ్ళ మంచికే" అన్నాడు.

అంతా ఏవేవో కబుర్లు చెప్పుకుని విరగబడి నవ్వుకుంటున్నారు. పవన్ మాత్రం

ఊరికే వాళ్ళలో కూర్చున్నా వాళ్ళంత విరగబడి నవ్వటం, విమర్శించటం చెయ్యడు.

రాజ్ కిరణ్ అదే అడిగాడు. "మేమంతా ఇలా ఉంటే నువ్వు చాలా సీరియస్‌గా, డిగ్నిఫైడ్‌గా ఉంటావు. ఎలా అయినా నువ్వు మెచ్యూర్డ్." అన్నాడు.

పవన్‌కి నవ్వు వచ్చింది.

"నిజం మాట్లాడితే నేనే ఇమ్మెచ్యూర్డ్ అనుకోవాలి" అన్నాడు.

"అదేంటి? నువ్వు మాలా ఉండవుగా? "

"దాని గురించి చెప్పాలంటే నేను కూడా ఒక గ్రీకు గురువు గురించి చెప్పాలి."

"ఎవరాయన? "

"చెపుతాను. పురాతనకాలంలో గ్రీస్‌లోని ఏథెన్స్ నగరంలో ఎపిక్యూరస్ అనబడే సన్యాసి ఉండేవాడు. ఆయన శిష్యులంతా హాయిగా నవ్వుతూ, తుళ్ళుతూ డాన్స్ చేస్తూ ఉండేవాళ్ళు. వాళ్ళకి ఎపిక్యూరస్ కాస్త రొట్టె, కొంచెం ఉప్పూ తప్ప మరేం ఇచ్చేవాడు కాదు. అయినా వాళ్ళంతా ఎప్పుడూ ఆనందంగా ఉండేవాళ్ళు. చక్రవర్తికి వాళ్ళంతా అంత సంతోషంగా ఎలా ఉంటున్నారో తెలుసుకోవాలనిపించింది. చక్రవర్తికి సమస్తం ఉన్నాయి గానీ మనశ్శాంతి మాత్రం లేదు. ఎపిక్యూరస్ దగ్గర అన్నిటితోపాటు మనశ్శాంతి కూడా ఉంది. అతని మనశ్శాంతి అతనికి అన్నీ ఇచ్చింది.

చక్రవర్తికి ఎపిక్యూరస్‌ని చూడాలనిపించింది. ఆయన ఉంటున్న చోటుకి వెళ్ళాడు. ఒక తోటలో ఆయన శిష్యులంతా ఆయన చుట్టూ చేరి హాయిగా డాన్స్ చేస్తున్నారు. ఎపిక్యూరస్ కూడా డాన్స్ చేస్తున్నాడు. చక్రవర్తిని కూడా పట్టించుకోనంత తన్మయత్వంలో ఆయన శిష్యులు డాన్స్ చేస్తున్నారు. "రండి, మీరు కూడా రండి. అంతా కలసి నాట్యం చేద్దాం" అని పిలిచాడు ఎపిక్యూరస్. చక్రవర్తి వెళ్ళాడుగానీ డాన్స్ చెయ్యలేకపోయాడు. మనసంతా ఎన్నో చింతలూ, ఆలోచనలూ, జనం ఏమనుకుంటారోనని భయం.

డాన్స్ చేయాలంటే మనసు స్వేచ్ఛగా, హాయిగా ఉండాలి. అహంతో నిండి ఉన్న మనస్సు నాట్యం చేయలేదు. చక్రవర్తి నాట్యం చేయలేకపోయాడు.

'నాకు మనశ్శాంతిని ప్రసాదిస్తే నీకు కావల్సినంత సంపద ఇస్తాను' అని చక్రవర్తి ఎపిక్యూరస్‌ని కోరాడు.

'నీ సంపద నాకక్కర్లేదు. కానీ నీకు సంతోషంతో ఉండే మార్గం మాత్రం చెపుతాను' అన్నాడు ఎపిక్యూరస్. ఆ తర్వాత ఇలా బోధించాడు. 'నీరాజు వేషాన్ని వదిలెయ్యి' ఆ బరువు తగ్గాక చాలా తేలిగ్గా అనిపిస్తుంది. సంఘం గురించి మర్చిపోయి, ప్రకృతి గురించి ఆలోచించు. నీ కోర్కెల్ని ఇవాల్టివరకే పరిమితం చేసుకో. మేమిదే చేస్తున్నాం. మా బాధ్యతల్ని మేం వదిలిపెట్టలేదు. కానీ వాటిని ఈ రోజుకే పరిమితం చేసుకున్నాం. ఈ రోజుకి నీ బాధ్యతల్ని నిర్వర్తించి, ఈ రోజువరకే నీ కోరికల్ని పరిమితం చేసుకుని, ఈ రోజు కోసమే బతికితే ఎంతో ఆనందం లభిస్తుంది. దేశానికి చక్రవర్తి కావటం కాదు. నీ మనసుకు నువ్వు రాజు కావాలి. మనసుని సరిగ్గా పరిపాలించిననాడు ఎవర్కైనా సుఖం దక్కుతుంది"

చక్రవర్తి చాలా సంతోషించాడు.

ఇదీ ఎపిక్యూరస్ కథ" అన్నాడు పవన్.

"అందుకని నేను చెప్పేది ఏంటంటే నాలో అహం పోలేదు. అందుకే మీలా ఉండలేకపోతున్నాను" అన్నాడు.

అంతా నవ్వేశారు.

★ ★ ★

సెకండియర్ ఎలక్ట్రానిక్స్‌లో విరజ అనే అమ్మాయి ఉంది. క్లాసులో తల తిరిగి పడిపోయింది. కాలేజ్ పిల్లలు అంతా కలిసి ఆమెను సిటీలో ఒక హాస్పిటల్‌లో చేర్పించారు. వాళ్ళు ఎమర్జెన్సీ ట్రీట్‌మెంట్ మాత్రం చేశారు. ఒక గంట అయినా విరజ స్పృహలోకి రాలేదు. ఆ అమ్మాయి తన

బంధువుల ఇంట్లో ఉండి చదువుకుంటోంది. వాళ్ళు చాలా బీదవాళ్ళు. వాళ్ళలో విరజ ఒక్కత్తే ఇంజినీరింగ్ దాకా వచ్చి చదువుతున్న మనిషి.

"వెంటనే క్విక్ రిలీఫ్ హాస్పిటల్‌కి షిఫ్ట్ చెయ్యాలి. అక్కడ అయితే అడ్వాన్స్‌డ్ మెడికల్ ట్రీట్‌మెంట్ దొరుకుతుంది. లేకపోతే లైఫ్‌కే డేంజర్" అన్నారు డాక్టర్లు.

క్విక్ రిలీఫ్ హాస్పిటల్‌లో కాలుపెడితే చాలు యాభైవేలన్నా వదులుతాయి అంటారు. విరజా వాళ్ళు అంత డబ్బు ఇచ్చే స్థితిలో లేరు. మరి షిఫ్ట్ చేయకపోతే ప్రాణానికే గండం అంటున్నారు. ఏం చేయాలో ఎవరికీ పాలుపోలేదు.

"ముందు విరజని సేవ్ చేయాలి. ఫీజు కావలిస్తే తలా కొంచెం కాంట్రిబ్యూట్ చేసుకుని ఇచ్చేద్దాం" అన్నాడు పవన్.

ఈ మాట అందరికీ నచ్చింది. అప్పటికప్పుడు తలా కాస్తా డబ్బు వేసి అడ్వాన్స్ కట్టి, విరజని క్విక్ రిలీఫ్ కార్పొరేట్ హాస్పిటల్‌లో చేర్పించారు.

వాళ్ళ శ్రమ వృథాకాలేదు.

ఫీజు సంగతి అవతల పెడితే, క్విక్ రిలీఫ్ హాస్పిటల్‌లో విరజకి చేసిన చికిత్స అపూర్వం, అద్భుతం. వాళ్ళు వైద్యులా లేక అపర ధన్వంతరులా అనిపించింది పవన్‌కి. ఏవేవో పరీక్షలు చేశారు. మందులిచ్చారు. కంటికి రెప్పలా కాపాడారు.

"మీరు ఆమెను తేవటం ఏమాత్రం లేట్ అయినా, ప్రాణం పోయి వుండేది" అని చెప్పారు డాక్టర్లు.

పవన్‌కి ఎంతో సంతోషం అనిపించింది. క్షణంలో ఎన్ని ప్రాణాలైనా తీసేయవచ్చు గాని, యుగాలు ప్రయత్నించినా ఒక్క ప్రాణాన్ని కూడా ఎవరూ పోయలేరు. జీవితం ఎంత విలువైంది? అంత విలువైన నిండు జీవితం నిలబెట్టగలిగినందుకు



స్టూడెంట్స్ అంతా సంతోషించారు.

"రెండ్రోజుల్లో ఆమెని డిశ్చార్జ్ చేస్తాం" అన్నారు హాస్పిటల్ వాళ్ళు.

అప్పుడు వచ్చింది సమస్య.

బిల్ ఎనభై వేలు అయింది. పదివేలు అడ్వాన్స్ కట్టారు. ఇంకా డెబ్బై వేలు కావాలి. విరజ ఇంట్లోవాళ్ళు ముందే చేతులెత్తేశారు. తామే గనక అయితే పిల్ల పోతే పోయింది లెమ్మని ఊరుకునేవాళ్లం గానీ ఇంత గొప్ప హాస్పిటల్‌లో చేర్పించి ఉండే వాళ్లం కాదని వాళ్ళు ముందుగానే చెప్పారు.

ఇక అంతా కాంట్రిబ్యూట్ చేసుకుని బిల్ కట్టాల్సిందే. ఒక్కో క్లాస్‌కీ ఒక్కొక్క విద్యార్థి ఆ క్లాస్‌లో డబ్బు వసూలు చేసి తేవాలని నిర్ణయం చేశారు. పవన్ క్లాస్‌లో వసూలు చేసే బాధ్యత పవన్ మీద పడింది.

మెడికల్ ట్రీట్‌మెంట్‌కి బిల్ కట్టాలి అనగానే చాలామంది వాలంటరీగా అడగక ముందే ఇచ్చేశారు. ఎవరి ఇష్టం వచ్చినంత వాళ్ళు ఇవ్వవచ్చునీ, బలవంతం ఏదీ లేదనీ ముందే చెప్పేశారు. డబ్బున్న స్టూడెంట్స్ కొందరు ఒక్కొక్కళ్ళూ రెండువేలు, మూడు వేలు కూడా ఇచ్చారు.

క్లాస్‌లో ఇవ్వగలిగిన వాళ్లంతా ఇచ్చేశారు. కొంతమంది పూర్ స్టూడెంట్స్ ఇవ్వలేనందుకు బాధపడుతూ సారీ చెప్పారు. వాళ్ళ పరిస్థితి తెలుసు కాబట్టి ఎవరూ ఏమీ అనలేదు. ఇక మిగిలింది షెర్నీ.

షెర్నీ కారిడార్లో నిల్చుని ఉంది.

పవన్‌తో పాటు శ్రీకాంత్ కూడా వచ్చాడు.

షెర్నీ నల్లటి స్కర్టు, నల్లటి బ్లౌజ్ ధరించి ఉంది. ఆ నలుపు రంగు డ్రెస్‌లు షెర్నీకి చాలా ఉన్నాయని ఆ కొద్దికాలంలోనే పవన్‌కి తెలిసిపోయింది. ఇప్పుడు షెర్నీ వేసుకున్న డ్రెస్ నలుపు అని పేరే గాని దానినిండా అత్యంత ఖరీదైన ఎంబ్రాయిడరీ ఉంది. బ్లౌజ్ అయితే నిండా బంగారు రంగు టిక్కీలూ, జరీ దారాలూ వేసి కుట్టారు. అందువల్ల ఆ బ్లౌజ్‌ని బంగా

రంతో చేసి, నల్లరంగు అక్కడక్కడా అద్దారా అని భ్రమకలిగించేట్లు ఉంది. నలుపురంగు పనికిరాదంటారు. నలుపురంగు విచారానికీ, సంతాపానికీ చిహ్నం అంటారు. కానీ, నలుపురంగుని ఎంత అందంగా, దర్పంగా ప్రదర్శించవచ్చో చూడాలంటే షేర్నీ డ్రెస్సులు చూడాల్సిందే.

షేర్నీని దూరం నుంచి చూస్తూనే శ్రీకాంత్ మెల్లగా గొణిగాడు.

"ఆ డ్రస్ చూశావా? నువ్వు నమ్ముతావో లేదో... అది పద్దెనిమిది వేలు"

"ఆ" పవన్ ఆశ్చర్యపోయాడు.

"అవును. మొన్న మా చెల్లెలికి డ్రెస్ కొనాలని వెళ్ళాము. అక్కడ షోకేస్‌లో పెట్టారు. సరదాకి అడిగితే ధర తెలిసింది"

"అంత ఖరీదైన డ్రెస్ కాలేజీకి అవసరమా? "

"అది ఆ మనిషిని బట్టే ఉంటుంది. నీలాటి నాలాటి మనుషులకి అది అనవసరం అనిపిస్తుంది- ఖరీదైన మనుషులు ఎక్కడికి వెళ్లినా కూడా ఖరీదైనవే వేసుకుంటారు. ఆ వాచ్ చూడు. బంగారంతో చేసి, వజ్రాలు పొదిగారు. అది లక్షా యాభైవేలు. అట్లాంటివి షేర్నీ దగ్గర చాలా ఉన్నాయి. డ్రెస్‌కి తగ్గట్లు మార్చేస్తుంది"

పవన్ నోరు తెరిచి వింటున్నాడు. అవన్నీ చాలా ఖరీదైనవే అని మాత్రం అనుకున్నాడు కానీ ఇంతంత ఖరీదని మాత్రం అతనికి తెలీదు.

"ఇంకేం. బాగానే ఇస్తుందేమో తన కాంట్రిబ్యూషన్" అన్నాడు.

ఇద్దరూ ముందుకి కదిలారు. షేర్నీని చూస్తే ఎందుకోగానీ పవన్‌కి గుండె కొట్టుకుంటుంది. ధైర్యంగా ఆమె కళ్లల్లోకి చూసి మాట్లాడాలంటే జంకుగా అనిపిస్తుంది. ఆమెపట్ల తనకున్న ఎట్రాక్షన్ ఎక్కడ పసికట్టేస్తుందోనని భయం. శ్రీకాంత్‌కైతే షేర్నీని చూస్తే చచ్చే బెదురు. అందర్నీ వెక్కిరించి, వెటకారం చేస్తాడు గానీ, షేర్నీని చూసి వణుకుతాడు.

ఇద్దరూ షేర్నీ ముందు నిల్చున్నారు. పవన్ గుండె వేగంగా కొట్టుకుంటోంది. జంకూ బెరుకూ ఆవరించి ఎలా అడగాలో తెలీక చూస్తూ నిలబడ్డాడు.

ఇద్దరూ అలా సందేహిస్తూ, జంకుతూ నిలబడి ఉంటే షేర్నీ వాళ్లు వచ్చింది తన దగ్గరకు కానట్లే మొహంపెట్టి నిల్చుంది. కనీసం కళ్లెత్తి వాళ్లవైపు చూడను కూడా లేదు. పన్నెత్తి పలకరించలేదు. అసలు వాళ్లక్కడ లేనట్లే, కేర్‌లెస్‌గా తనదారిన తాను నిలబడింది.

శ్రీకాంత్ బెదురుగా చూస్తున్నాడు. నెమ్మదిగా పవన్ చెయ్యి నొక్కాడు. పవన్ తనవైపు చూడగానే 'అడుగు' అన్నట్లు సైగ చేశాడు.

పవన్ ఎలాగో ధైర్యం చేశాడు.

"విరజకి సీరియస్ అవుతే హాస్పటల్‌లో చేర్పించాము" అన్నాడు.

చేర్పించుకోండి నాకేంటి? అన్నట్లు ఒక లుక్ ఇచ్చింది షేర్నీ.

"బిల్ చాలా అయింది. వాళ్లది పూర్ ఫ్యామిలీ. అంతా కాంట్రిబ్యూట్ చేసి బిల్ కడుతున్నాము. మీరు ఎంత ఇస్తారో చెపితే..."

అసలే సీరియస్‌గా ఉన్న షేర్నీ ఆ మాటతో నిప్పులు చెరుగుతున్నట్లుగా మారిపోయింది. అందమైన ఆ కళ్లూ, మొహం, అన్నీ వికృతంగా మారాయి.

"నేనెందుకు ఇవ్వాలి? " కోపంగా అడిగింది.

"ఒకరికి ఒకరు... అంతే"

"ఎవరికి ఎవరో నాకు అనవసరం. డోంట్ ఎక్స్‌పెక్ట్ ఎనీథింగ్ ఫ్రమ్ మి. నేనొక్క పైసా కూడా ఇవ్వను" షేర్నీ నిష్కర్షగా చెప్పింది.

పవన్‌కి కోపంతో ధైర్యం వచ్చేసింది.

"ట్రీట్‌మెంట్‌కి కూడా ఇవ్వరా? " అన్నాడు.

"అంత డబ్బు లేకపోతే గవర్నమెంట్ హాస్పటల్ కి పోవాల్సింది" అంది షేర్లీ.

"కేవలం అక్కడ చేర్పించినందువల్లే ఆమె బతికింది. అడ్వాన్స్డ్ ట్రీట్ మెంట్ దొరుకుతుంది అక్కడ."

"అయితే? ఈమె సంగతి సరే. మరి ఎంతోమంది సరైన వైద్యం లేక చస్తూనే ఉన్నారు. మీరు వాళ్ళందర్నీ సేవ్ చేస్తారా? చెయ్యగలరా? " అడిగింది షేర్లీ.

"చెయ్యలేకపోవచ్చు మనం లోకంలో అందరికీ చెయ్యలేం. కనీసం మనకి తెలిసిన వాళ్ళకైనా మనం హెల్ప్ చెయ్యాలి."

"ఏడిసినట్లుంది. మనకి తెలియకపోవటం వాడి ఖర్మన్నమాట. సరే ఎవడి ఖర్మ వాడనుభవిస్తాడు. నేను మాత్రం సింగిల్ పైకూడా ఇవ్వను." ఖచ్చితంగా చెప్పేసింది షేర్లీ.

పవన్, శ్రీకాంత్ నిర్ఘాంతపోయి చూస్తున్నారు. తమ కాలేజ్ మేట్ కి ప్రాణంమీదికి వస్తే కూడా ఎంత మాత్రం చలించకుండా నేను మాత్రం ఒక్క పైసా కూడా ఇవ్వనని భీష్మించుకుని కూర్చున్న ఆమెని ఏం అనాలో కూడా అర్థం కాలేదు వాళ్ళకి.

చేసేది లేక వెనుతిరిగారు.

"ఇదెక్కడి కేసు బాస్. చూస్తే మహా కరోడాలాగా ఉంది" అన్నాడు శ్రీకాంత్.

పవన్ జవాబు చెప్పలేదు.

"ఈ డబ్బున్న వాళ్ళింతే. ఏ ఫీలింగ్స్ ఉండవు. జాలీ, దయా, వాళ్ళనుంచి ఎక్స్ పెక్ట్ చెయ్యలేం. ఏదన్నా చారిటీ ఇచ్చినా, ఇన్ కమ్ టాక్స్ నుంచి ఎగ్జంప్షన్ ఉంటే ఇస్తారు."

"జాలీ, దయా అనేవి స్వతస్సిద్ధంగా ఉండే గుణాలు. దేన్నీ జనరలైజ్ చెయ్యలేం. డబ్బుంటే జాలీ, దయ ఉండవని కాదు మనిషి గుణానికీ, ధనానికీ సంబంధం లేదు" అన్నాడు పవన్.

"అంతేలే. డబ్బు దగ్గర ఎవరు ఎలా ప్రవర్తిస్తారో తెలీదు" అన్నాడు శ్రీకాంత్.

ప్రపంచంలో చెడ్డవాళ్ళెంతమంది ఉన్నా, మంచివాళ్ళకీ, ఉదారులకీ కూడా కొదవ లేదు. విరజ బిల్లు డబ్బు ఆరోజే కలెక్ట్ అయిపోయింది. అంతేకాదు. విరజకి బ్రెయిన్ లో ఏదో చిన్న ప్రాబ్లమ్ ఉందనీ, దానికి చిన్న ఆపరేషన్ చేయాలనీ, దానికి మరో అరవైవేలు ఖర్చవుతుందనీ తెలిసింది. దానికి కూడా డబ్బు కాంట్రిబ్యూట్ చేసేందుకు చాలామంది ముందుకి వచ్చారు. లెక్చెరర్లూ, ప్రిన్సిపాల్ కూడా తమవంతు డబ్బు ఇచ్చారు.

కాలేజ్ మేనేజ్ మెంట్ కి ఆ హాస్పటల్ మేనేజ్ మెంట్ తెలుసుట. వాళ్లు మాట్లాడి ఫీజులో కన్సెషన్ ఇప్పించారు. చివరికి ఈ వచ్చే మిగిలింది, దాన్ని విరజకి ఇచ్చి ముందు జరగబోయే ఆపరేషన్ ఖర్చులకీ, మందులకీ వాడుకోమన్నారు.

విరజ ఇంట్లోవాళ్ల ఆనందానికి అంతే లేదు. వాళ్ల మొహాల్లో వెలుగుతున్న ఆనందం చూసి స్టూడెంట్స్ కి చాలా సంతోషం కలిగింది.

ఇచ్చుటలో ఉన్న హాయీ...

వేరెచ్చటనూ లేనే లేదనీ...

పాట వినిపిస్తోంది. పవన్ ఆ పాట వింటూ ఆలోచిస్తున్నాడు. ఎంత బాగా రాశారు ఆ పాట.

నిజంగా నాది, నాది అని అంతా దాచుకుని తామే అనుభవించేద్దామని అనుకుంటారు. ఆ జల్సాలో సుఖం ఉందనుకుంటారు. సుఖం వేరు, శాంతి వేరు. ఏదీలేకున్నా శాంతి కోట్ల సుఖాల ఆనందాన్ని ఇస్తుంది. కానీ కోటి సుఖాలున్నా ఒక్క శాంతి లేకపోతే ఆ మనిషికి సుఖం ఉండదు. రెస్ట్ లెస్ గా తయారవుతాడు. ఆ సుఖాలను అనుభూతి చెందలేదు. ఆస్వా

మహాత్ములు మనోబలాన్ని కలిగి ఉంటారు. దుర్బల మనుషులు కోరికలను మాత్రమే కలిగి ఉంటారు. —పంచతంత్రం

దించలేని రుచులెందుకు. అనుభూతి చెంద లేనప్పుడు ఎన్ని సుఖాలుండి ఏం లాభం? కానీ, మూర్ఖులకి ఆ సంగతి తెలీదు. నిజానికి ఎవరికన్నా ఏదన్నా ఇచ్చినప్పుడు బోలెడంత ఆనందం దొరుకుతుంది. ఆ ఆనందానికి విలువ కట్టడం ఎవరి తరం?

షెర్నీకి ఆ ఆనందపు విలువ తెలియదు. పరమ మూర్ఖురాలిలా ఉంది. పవన్‌కి షెర్నీ మీద కోపంగా ఉంది. అంతలోనే ఆ కోపం తుడిచిపెట్టుకుని పోతోంది. ఒక్క క్షణం ద్వేషం కలుగుతోంది. మరుక్షణం ఆ ద్వేషం మటుమాయమైపోతోంది. తనేమిటో తనకే అర్థం కావడంలేదు.

"పిచ్చివాడా. నువ్వు షెర్నీని గాఢంగా ప్రేమిస్తున్నావు. ఆమెని ద్వేషించాలనుకున్నా ద్వేషించలేవు. అది నీతరం కాదు" అతని అంతరాత్మ చెప్పింది.

నిజమే. షెర్నీని తను ప్రేమిస్తున్నాడు. కానీ ప్రేమించి ఏం లాభం?

లాభం కోసం ఎవరూ ప్రేమించరు. ప్రేమ అనేది అప్పటికప్పుడు అనుకోకుండా పుడుతుంది.

ఆరోజు ఇంటికెళ్ళాక కూడా అదే ఆలోచిస్తున్నాడు. పవన్ పరధ్యానం గమనించి విజయ్ అడిగేశాడు.

"ఏంటి? ఏం జరిగింది? ఎవరో అమ్మాయిని హాస్పటల్‌లో చేర్పించానన్నావు కదా? ఆ అమ్మాయికి ఎలా ఉంది?"

"బాగానే ఉంది. రేపు డిశ్చార్జ్ చేస్తారు."

"మరి అలా ఉన్నావేం?" విజయ్ మళ్లీ అడిగాడు.

"ఏంలేదు... మా క్లాస్‌లో ఒకమ్మాయి-" అంటూ షెర్నీ సంగతి చెప్పాడు.

"ఈమె అంత సీన్ లేకపోయినా మా క్లాస్‌లో కోటీశ్వరులు ఇంకో ముగ్గురున్నారు. కానీ ఈమెలా మాత్రం ఎవరూ లేరు. అదేంటో గానీ అణువణువునా అహం - అంత నిష్కర్షగా ఉండటానికి ప్రాణం ఎలా ఒప్పిందో?" అన్నాడు

"ధనానికీ గుణానికీ సంబంధంలేదు. కృష్ణప్రసాద్ గారి గురించి నీకు తెలుసుగా..." అన్నాడు విజయ్.

పవన్ తల ఊపాడు.

విజయ్‌కి తను ఆ ప్రసక్తి తేకుండా ఉండవలసింది అనిపించింది. పవన్ గత జీవితం గుర్తుచేసినట్లయిందా? పవన్ గత జీవితం ఒక పీడకల.

ఆ కథ...

విజయ్ తండ్రి జ్ఞానానందం గారు టీచర్‌గా పనిచేస్తున్నారు. పదేళ్ల క్రితం ఆయన ఒక పల్లెటూళ్ళో పనిచేస్తుండేవారు. పల్లెల్లో షావుకార్ల దౌర్జన్యాలు ఆయనకి తెలుసు. కానీ ఒక ఘోరమైన సంఘటన కళ్లారాచూసి ఆయన అమాంతం కదిలిపోయారు.

ఆ ఊళ్లో ఒక షావుకారు దగ్గర పదేళ్ల పిల్లవాడున్నాడు. అతని తల్లిదండ్రులు ఆ షావుకారు దగ్గర అప్పుచేసి అది తీరకుండానే మరణించారు. వాళ్లు చేసిన అప్పుకి షావుకారు ఆ పిల్లాడ్ని కుదువపెట్టుకున్నాడు. పారిపోకుండా వాడి కాళ్లకి సంకెళ్లు వేశాడు. షావుకారుకి కుటీర పరిశ్రమలా ఇంట్లోనే నాటుబాంబుల పరిశ్రమ ఉంది. ఆ పిల్లాడికి అందులో తర్ఫీదు ఇచ్చి బాంబులు తయారుచేయిస్తున్నాడు.

జ్ఞానానందం గారు అదిచూసి తీవ్రంగా కదిలిపోయారు. షావుకారు ఆ పిల్లాడికి తిండి కూడా సరిగ్గా పెట్టడు. పైపెచ్చు అది అత్యంత ప్రమాదకరమైన పని. ఒక్కోసారి తయారు చేస్తుండగానే పేలిపోతాయి. అట్లాంటి సమయంలో ఆ పిల్లాడు కనీసం పారిపోను కూడా పారిపోలేదు.

జ్ఞానానందం గారు అందర్నీ తనవాళ్లనీ, తను అందరి వాడిననీ అనుకునేవారు. డబ్బు మిగుల్చుకోలేకపోయినా, ఆత్మీయుల్నీ, గౌరవాన్నీ మాత్రం మిగుల్చుకున్నారు.

ఆ బాబుని విడిచిపెట్టమంటే షావుకారు వినలేదు. ఆ పిల్లాడి తల్లితండ్రులు తనకి పదిహేనువేలు ఇవ్వాలనీ, ఆ డబ్బు ఇస్తేనే

వాడిని విడిచిపెడతాననీ ఖచ్చితంగా చెప్పాడు. తనమీద రిపోర్ట్ ఇచ్చినా లాభం లేదనీ, తనకి బోలెడంత పలుకుబడి ఉందనీ, ఏది ఎటుతిరిగినా తను ఎలాగో తప్పించుకుని బయట పడగలడనీ, మర్యాద గానే స్పష్టం చేశాడు. జ్ఞానానందంగారు ఆలోచించారు. షావుకారు ఈ ఊళ్లో వ్యక్తి. లోకల్ స్టాండింగ్ ఉంది. బలవంతుడు. అతడిని తనేమీ చేయలేడు.

ఆ పక్కనున్న ఊళ్లో కృష్ణప్రసాద్ అనే ఒక ధనికుడున్నాడు. ఆయన చాలా మంచి వాడు. దానకర్ణుడని పేరు. అడిగిన వాళ్లకీ, అడగని వాళ్లకీ కూడా సాయం చేస్తుండే వాడు. ఆయనకి చెప్పి పిల్లాడిని విడిపించా లనుకున్నారు జ్ఞానానందం గారు.

ఇంతలో పులిమీద పుట్రలా మరో కష్టం వచ్చిపడింది. ఆ పిల్లాడి కాళ్లకి వేసిన సంకె ళ్లవల్ల కాలికి పుండు పడింది. అది సెప్టిక్ అయింది. షావుకారు నిమ్మకినీరు ఎత్తినట్లు న్నాడు. ఆ పిల్లాడి తరఫున పోరాడే దిక్కు లేదు.

అక్కడ మందూ మాకూ లేక, ఆ పుండు వికటించి చివరికి కాలు కూడా తీసేస్తారే మోనని భయం వేసింది. జ్ఞానానందంగా రికి. ఆయన ఇక ఉండబట్టలేక కృష్ణప్రసాద్ ఊరికి వెంటనే బయల్దేరి వెళ్లాడు.

ఆయన దురదృష్టం.

కృష్ణప్రసాద్ ఊళ్లో లేడు. అర్జెంట్ పని మీద హైదరాబాద్ వెళ్లాడట.

జ్ఞానానందంగారు హతాశులైపోయారు. ఇక ఆ బాబు సంగతి ఆశవదిలేసుకోవలసిం దేనని ఆయనకి అర్థమైపోయింది.

కానీ అంతలోనే ఆయన ఊహించనైనా ఊహించని సంఘటన జరిగింది.

కృష్ణప్రసాద్ కూతురు ఏడేళ్లలోపు పాప ఇంట్లో ఉంది. ఆ పాప జ్ఞానానందంగారిని ఎందుకొచ్చారని అడిగింది. ఆయన వారి స్తున్నా వినకుండా సేఫ్‌లోంచి డబ్బుతీసి ఇచ్చింది.

"వద్దమ్మా. డాడీకి తెలియకుండా ఇంత డబ్బుతీసుకోను" అన్నారాయన.

"మా డాడీ ఏమనరు. ఆయనే నాకు ఇవన్నీ నేర్పారు. ముందు ఆ బాబుని రక్షిం చండి" అంది ఆ పాప.

జ్ఞానానందంగారు ఇంకా సందేహిస్తూనే ఉండటంతో ఆ పాప వాళ్ల డాడీకి ఫోన్‌చేసి ముద్దుముద్దుగా జ్ఞానానందంగారు వచ్చిన సంగతీ, ఆయన అవసరం గురించీ చెప్పింది.

"మీరే మాట్లాడండి డాడీతో" అంది. ఫోన్‌లో కృష్ణప్రసాద్ ఆయన్ని పాప ఇచ్చిన డబ్బు తీసుకోమని చెప్పారు.

ఇంక ఏ సందేహం లేకుండా జ్ఞానానం దంగారు ఆ డబ్బు తీసుకోవటం, బాబుని విడిపించటం, స్కూల్లో చేర్పించటం వేగంగా జరిగిపోయాయి. ఆ తర్వాత జ్ఞానానందం గారు ఆ బాబుకి పవన్ అని పేరు పెట్టారు. ఆయన ఎంతోమందిని అడిగి, పవన్ చదువుకి ఏ అడ్డూ లేకుండా చేశారు. తను ఇంజనీరింగ్ చదవటం కోసం ఆయ నెంత శ్రమపడుతున్నాడో పవన్‌కి తెలుసు. ఇందరు మంచివాళ్లు కలిసి ఏర్పరచిన తన జీవితానికి సార్థకత తనూ నలుగురికి సాయం చేయగలిగినప్పుడే అని పవన్ ఎప్పుడూ అనుకుంటూ ఉంటాడు. జ్ఞానానం దంగారు పవన్‌కి ఎప్పుడూ గతం గుర్తు చెయ్యరు. అన్నీ మర్చిపోవాలంటారు.

★ ★ ★

ఇందిరా పార్క్‌లో చెరువుదగ్గర కూర్చుని, నీళ్లలోకి చూస్తున్నారు పవన్, శ్రీకాంత్. కింద నీళ్లల్లో చేపలు చకచకా ఈతకొడుతు న్నాయి. బోట్ షికారు చేస్తున్న వాళ్లనీ, సంతోషంగా ఒకళ్లమీద ఒకళ్లు ఒరిగిపోయి అటూ ఇటూ నడుస్తున్న జంటల్నీ సంతో షంగా చూస్తున్నాడు పవన్.

"నీది చాలా మంచి మనసు. ఎవరు సంతోషంగా ఉన్నా హ్యాపీగా ఫీల్ అవు తావు. నువ్వు చాలా మంచివాడివి బాస్"

అన్నాడు శ్రీకాంత్.

"ఏమో. నాది కూడా స్వార్థమేనేమో? "

"స్వార్థమా? " అర్థం కాక అయోమయంగా చూశాడు శ్రీకాంత్.

"అవును. పది శుభాలు కంటపడితే ఒక శుభం ఇంట పడుతుందంటారు. నేను పది జంటల్ని చూసి ఆనందిస్తే, నాకూ ఒక జంట దొరుకుతుందేమోనని..." నవ్వుతూ అన్నాడు పవన్.

"ఓహో. ఏం కన్నింగ్. ఇదన్నమాట అసలు సీక్రెట్. ఓ.కే. నేనుకూడా నీదారినే నడుస్తాను" అన్నాడు శ్రీకాంత్, తనుకూడా అటు వెళ్తున్న జంటలవైపు ఆనందంగా చూస్తూ.

చూస్తున్న ఇద్దరూ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు.

"అయ్యబాబోయ్. అది మన ఫైర్ బ్రాండ్ షేర్నీనే కదూ? " అన్నాడు శ్రీకాంత్

"అవును" అన్నాడు శ్రీకాంత్

షేర్నీ వాళ్ల డాడీతో వచ్చినట్లుంది. యాభైఏళ్ల వయసున్న ఆయన, ఆమె పక్కన నడుస్తున్నాడు. ఆయన వాకింగ్‌కి కాబోలు ఒక్కడే చకచకా నడుచుకుంటూ వెళ్లాడు. షేర్నీ ఒక బెంచీమీద కూలబడి, తన సహజ నిర్లక్ష్య శైలిలో అటూ ఇటూ చూస్తోంది.

అయస్కాంతం లాగిన ఇనుపముక్కలా ఆమెవైపు నడుస్తున్నాడు పవన్. షేర్నీని పలకరిస్తే మండిపడుతుందనీ, విరుచుకుపడి తిడుతుందనీ తెలుసు. అయినా ఏదో బలహీనత.... ఎంత పట్టుదలా, దీక్షా ఉన్న మనిషైనా షేర్నీ ముందు అన్నీ మాయం అవుతాయి. అతను షేర్నీ వైపు నడుస్తుండటం చూసి శ్రీకాంత్ పిలిచాడు.

"ఏంటి? ఎటు పోతున్నావు? "

"షేర్నీని పలకరించి వస్తాను"

"చస్తావ్. వద్దు"

"ఫర్వాలేదు"

"సరే. నాకు భయం. నేను రాను. ఇక్కడ కూర్చుంటాను. నువ్వు పోయిరా" శ్రీకాంత్ ఖచ్చితంగా చెప్పేసి, పచ్చికమీద చతికిలబడ్డాడు.

కొంతమంది చిన్నపిల్లలు చేయిచూపి అడుక్కుంటున్నారు. వాళ్ల శరీరాలమీద దుమ్ము పేరుకుపోయి ఉంది. తలలు అట్టలుకట్టి ఉన్నాయి. కళ్లల్లో దీనత్వం, మొహంలో దిగులు... ఎవరికైనా సరే వాళ్లను చూస్తే గుండె కరిగిపోయేట్లున్నారు. షేర్నీ దగ్గరకు వెళ్లి చేయి చాపారు.

"ఇడియట్స్" కొంపలు మునిగిపోయినట్లు అరిచింది షేర్నీ.

"అమ్మా... ప్లీజ్ అమ్మా.... రెండ్రోజులైంది అన్నం తిని... ఏదన్నా ఇవ్వమ్మా" దీనంగా అడుక్కుంటున్నారు వాళ్లు.

"తినకపోతే చావండి" అంది షేర్నీ కసిగా. వింటున్న శ్రీకాంత్, పవన్ నిర్ఘాంతపోయారు.

"హలో. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం వేసినట్లు వాళ్లమీద అరుస్తావా? " అన్నాడు పవన్ షేర్నీ దగ్గర కెళ్లి.

"నీకెందుకు మధ్యలో. నోరు మూసుకుని దయచెయ్యి" అంది షేర్నీ ఉగ్రంగా.

"చిన్నపిల్లల్ని అలా కసరటం ఎవరూ సహించరు" అన్నాడు.

"వాళ్లు నా పీస్‌ని డిస్టర్బ్ చేస్తుంటే నేను సహించాలా? " కోపంగా అడిగింది షేర్నీ.

"అది మెల్లగా కూడా చెప్పవచ్చు"

"నాకంత పేషన్స్ లేదు"

"తెచ్చుకోవాలి"

"డోంటాక్ రబ్బిష్. పో" అంది షేర్నీ.

"పోతాలే" అన్నాడు పవన్.

"పోతా పోతా అంటావు కానీ పోవేం? పో" అంది షేర్నీ.

పవన్ కదలలేదు.

షేర్నీని చూస్తే అతనికి ఒళ్లుమండుతోంది.

చిన్న పిల్లల్ని చూస్తే ఎవరికన్నా మనసు కరిగిపోతుంది. షేర్నీ అంత అతిగా ప్రవ

ర్తించటం చూసి అతనికి కోపం వచ్చేసింది. పైగా షెర్నీ మీద ఉన్న ఆకర్షణ వల్ల ఏదో ఒకటి అని అమెని టీజ్ చేద్దామనిపించింది.

ఆ పిల్లలవైపు తిరిగాడు.

"ఇట్లా అయితే ఎలా? ఏ వృత్తిలో వాళ్ళకి ఆ టెక్నిక్ తెలియాలి. మీకు మనిషిని చూడగానే వాళ్ళు మంచివాళ్ళో కాదో తెలిసిపోవాలి" అన్నాడు మెల్లగా.

షెర్నీకి కోపం ఆగలేదు.

"ఏం మాట్లాడుతున్నావ్? నేను చెడ్డదాన్నా? " అంది ఉగ్రంగా

"నువ్వు చెడ్డదానివని అనలేదే? "

"మరి? "

"మంచిదానివి మాత్రం కాదన్నాను. అంతే"

"రెండింటికీ తేడా ఏంటి? "

"తీరిగ్గా బోధిస్తాను. తొందరపడకు" పవన్ వాళ్ళకి తన జేబులోంచి డబ్బుతీసి ఇస్తూ అన్నాడు.

"ఇంత చిన్న పిల్లలు అడుక్కోవటమా? సిగ్గులేదూ? నువ్వు వాళ్ళకి డబ్బు ఇచ్చి ఎంకరేజ్ చేసి, లైఫ్‌లాంగ్ బెగ్గర్స్‌లాగా తయారుచేస్తున్నావు" అంది షెర్నీ.

పవన్ నవ్వేశాడు. "ఓ.కే. వాళ్ళని మరి ఏ చిల్డ్రన్ హోమ్‌లోనో చేర్పించి రావచ్చుగా. నీకు సోషల్ రెస్పాన్సిబిలిటీ లేదా? " అన్నాడు.

"షటప్. నాకిదే పనా. బెగ్గర్స్ అందరికీ హెల్ప్ చెయ్యటానికి సోషల్ సర్వీస్ నా హాబీకాదు" అంది.

పవన్‌కి నవ్వు వచ్చేసింది. సోషల్ సర్వీస్ అనేది షెర్నీ దృష్టిలో హాబీ అన్న మాట. డబ్బులో పుట్టి, డబ్బులో పెరిగి, డబ్బు తప్ప మరో లోకం తెలీని ఐశ్వర్యవంతురాలికి అంతకన్నా మరేం తెలుస్తుంది.

"ఎందుకూ నవ్వుతున్నావ్? నీకంత ఇదిగా ఉంటే వాళ్ళని నువ్వే ఏ ఆర్ఫనేజ్ లోనో చేర్పించవచ్చుగా" అంది షెర్నీ.

"నువ్వు సలహా ఇవ్వకపోయినా అదే చేసేవాడిని" అన్నాడు పవన్

షెర్నీ లెఖ్ఖలేనట్లు చూసి, తల ఎగరేసి, ముందుకి నడుస్తోంది.

"రేపు మీరు ఈ టైమ్‌కి ఇక్కడే ఉండాలి" పవన్ ఆ పిల్లలతో చెప్పాడు.

"ఎందుకూ? "

"మీ అమ్మానాన్నా వాళ్ళని తీసుకుని రండి"

పవన్ మళ్ళీ ఆలోచించాడు. బెగ్గర్స్‌ని లోపలకు రానివ్వరు. ఈ పిల్లలు ఎలాగో వచ్చేసి ఉంటారు. వీళ్ళ తల్లిదండ్రులంటే వాళ్ళూ బిచ్చగాళ్ళే అయి ఉంటారు. కాబట్టి వాళ్ళు లోపలకు రావటం కుదరని పని. విజయ్‌కి ఒక చిల్డ్రన్ హోమ్ తెలుసు. కొంతమంది పిల్లల్ని అక్కడ చేర్పించాడు కూడా.

వాళ్లు అక్కడ చదువూ, ఏదన్నా వృత్తి విద్యలూ నేర్పుతారు.

"ఎందుకన్నా రమ్మంటున్నావ్? " అడిగారు పిల్లలు.

"ఏమీ లేదు తమ్ముళ్ళూ. మీకు చదువుకోవాలని ఉందా? "

ఆ పిల్లల మొహాలు ఒక్క క్షణం బిత్తరపోయి, మరుక్షణం వెలిగిపోయాయి.

"ఉంది... స్కూల్లో చేర్పిస్తావా? " అన్నారు.

"అవును. మీ వాళ్ళతో మాట్లాడాలి. ఆ గేటు దగ్గర నిలబడండి" అన్నాడు పవన్.

వాళ్ళు సంతోషంగా వెళ్ళిపోయారు.

షెర్నీ ఇవేం పట్టించుకోకుండా నేరుగా చూస్తూ, గబగబా నడుస్తూ ముందుకి సాగిపోతోంది.

పవన్ షెర్నీ వెనకే నడిచాడు.

"మరీ ఇంత కాపీనం ఉండకూడదు" అన్నాడు.

"కాపీనమా? " షెర్నీకి అర్థం కాలేదు.

"ఓహో కాపీనం అంటే తెలీదా? పోనీ కాపీనం అంటే తెల్సా? " కొంటెగా అన్నాడు.

"వాట్? కౌపీనమా?" షేర్నీ ముందుకు వెళ్ళిపోతూనే అడిగింది.

"ఎస్. అంటే లంగోటీ లాంటిదన్న మాట?"

"అంటే?"

"అంటే... గోచీ లాంటిదనుకో"

షేర్నీ గిరుక్కున వెనక్కు తిరిగింది.

"ఏం కావాలసలు? ఏం మాట్లాడుతున్నావ్?" అంది.

"ఏమీలేదు. నీకు కాపీనం ఎక్కువ. అది చెపుదామనీ... కాపీనం అంటే డబ్బు మీద ప్రేమ. పైసా కూడా వదులుకోవటానికి ఇష్టపడకపోవటం."

షేర్నీ చురుగ్గా చూసింది.

"అలా ఎందుకనుకుంటున్నావ్?" అంది.

"మరి ఇంకెలా అనుకోవాలి? చాలాసార్లు చూశాను. ఎవరికన్నా పైసా ఇవ్వాలన్నా ప్రాణం పోయినట్లు ఏడుస్తావు. నీకు కాపీనం కాక మరేంటి?" అన్నాడు.

అప్పటికే ఇద్దరూ అటూ ఇటూ తిరుగుతూ పెద్దపెద్ద చెట్లు ఉన్నచోటుకి వచ్చారు.

"ఏమన్నావ్? కాపీనమా?" పవన్ వైపు చూస్తూ అడిగింది షేర్నీ.

"అవును. కాపీనం. డబ్బు కాపీనం" అన్నాడు పవన్.

షేర్నీ పవన్ వైపు చూసింది. రెప్పవాల్చకుండా చూస్తోంది. అసలు షేర్నీ ఎవరివైపన్నా చూడటం అన్నదే అరుదు. మనుషులూ, మామూలు పరిసరాలూ అమె కళ్ళకి ఆనటం అనేదే ఉండదు. మరి ఎందుకలా చూస్తోంది? పవన్‌కి ఆశ్చర్యం కలిగింది.

అప్రయత్నంగా అతనూ షేర్నీని చూస్తున్నాడు. ఎన్నిసార్లో చూశాడు కానీ ఇంత నేరుగా చూడటం, అంత దగ్గరగా చూడటం మాత్రం ఇదే మొదటి సారి. అసలు నిజం చెప్పాలంటే షేర్నీ మొహం స్పష్టంగా చూశానా లేదా అని అతనికి ఇంతవరకూ అనుమానమే.

ఇప్పుడు షేర్నీ తీరిగ్గా స్టేర్ చేస్తూ అతనివైపే చూస్తుండటంతో, పంతం వచ్చి అతనూ షేర్నీని నేరుగా, సూటిగా చూడగలిగాడు.

పార్క్‌లో అంతా ప్రశాంత వాతావరణం. అందమైన చెట్లు, పచ్చిక బయళ్ళు, చక్కటి చెరువు ఉంటుంది. వీస్తున్న గాలికి కదులుతున్న పచ్చదనం, నగరం మధ్యన నందనవనం...

ఎందుకో గానీ చుట్టూ ఎవరూ లేరు. అంతా ప్రశాంతంగా ఉంది. అతను షేర్నీని తదేకంగా చూస్తున్నాడు.

బంగారం రంగులో సిల్కులాంటి మెత్తటి శరీరం, తీర్చిదిద్దినట్లున్న ఆకారం, ఆ కళ్ళు నల్లగా, విశాలంగా ఎంతో అందంగా ఉన్నాయి. అవి బుగ్గలు కావు, గులాబీ రేకులు, సన్నటి సూదిముక్కు, ఎర్రగులాబీ మొగ్గలాంటి మూతి, అందమైన మెడ, ఎత్తైన వక్షస్థలం, సన్నటి నడుము, శిల్పాసుందరిలా ఒంపులు తిరిగిన శరీరం. ఆ శరీరాన్ని అందంగా పట్టేసిన నల్లటి స్కర్ట్, గులాబీరంగు బ్లౌజ్.

షేర్నీ భుజాన బంగారం రంగులో గొలుసులు ఉండి అత్యంత మేలైన లెదర్‌తో చేయబడ్డ బ్యాగ్ ఉంది.

మ్యూజియంలో ఉన్న అద్భుత చిత్రాన్ని ఔత్సాహిక కళాకారుడు చూసినట్లు కళ్ళార్పకుండా ఆరాధనగా ఆమెవైపే చూస్తున్నాడు పవన్.

షేర్నీ ఉన్నట్లుండి కదిలింది. బ్యాగ్ తెరిచింది. అందులో నుంచి ఏదో తీసి, పవన్ మొహం ముందు ఆడించింది.

వందరూపాయల నోట్ల కట్ట.

"నాకు కాపీనం అన్నావు కదూ? ఇప్పుడు చూడు" అంది.

షేర్నీ ఏం చేయబోతుందీ పవన్ తెలుసుకునే లోపలే షేర్నీ ఒక్క దూకులో అక్కడ చితుకులు పేర్చి పెట్టిన మంట దగ్గరకు

వెళ్ళింది. ఒకే ఒక్క క్షణం. షేర్నీ వేగంగా, మెరుపువేగంతో తన చేతిలోని నోట్లకట్టని మంటలోకి విసిరేసింది.

నోట్లకట్టకి నిప్పంటుకుంది.

పవన్ నిశ్చేష్టుడై చూస్తున్నాడు.

నోట్ల కట్ట తగలబడిపోయింది.

పవన్ నోట మాట రాలేదు. శిలా విగ్రహంలా నిలబడి చూస్తున్నాడు.

సుకుమారంగా, సౌందర్యానికి ప్రతీకలా ఉన్న షేర్నీలో ఇంత రాక్షసత్వం దాక్కుందని ఎవరన్నా ఊహించగలరా అసలు?

ఆ పదివేల రూపాయలు ఎన్ని ఇళ్ళల్లో దీపాలు వెలిగించేవి? ఎంత మంది ఆకలి తీరేది. ఎన్ని జీవితాలకు ఉపయోగపడి ఉండేవి?



ఏదో తమాషాకు అంటే పంతంగా ఇంత పని చేస్తుందా?

ఆకలితో మాడిపోతున్న పిల్లలు అన్నానికి డబ్బడిగితే కసిరికొట్టింది. ఒక్క రూపాయి ఇవ్వటానికి అరిచి గోల చేసింది. తన పంతం చూపించుకోవటానికి మాత్రం పదివేల రూపాయలు బూడిదపాలు చేసింది.

షేర్నీ అసలు మనిషేనా? కాదు రాక్షసి. ఇన్నాళ్ళూ షేర్నీ పొగరు చూసి, డబ్బున్న గర్వం కాబోలు అనుకున్నాడు. అనుక్షణం ఆమె అహం ప్రదర్శిస్తూనే ఉన్నా ఎందుకోగానీ ఆమె ఏమిటో తనకు పూర్తిగా బోధపడనట్లే అనిపించింది.

ఇప్పుడు అర్థమైంది. షేర్నీ అణువణువునా పొగరూ, గర్వమూ నింపుకున్న దురహంకారి. మూర్తీభవించిన మూర్ఖత్వం... మానవరూపం దాల్చిన రాక్షసి.

అతను షేర్నీవైపు చూశాడు.

అసలేం జరగనట్లు నిర్లక్ష్యంగా చూస్తోంది. ఇంతపని చేస్తుందని ఎంత మాత్రం ఊహించలేదు గనక అతనికి ఆమెని చూస్తే ఏదో తెలియని భయం కలిగింది. ఆమె తెగువ, మొండితనం, అణువణువునా ఎగసిపడుతున్నఅహం అతనికి భీతి కలిగించాయి. ఆమెతో మాట్లాడాలంటేనే భయం వేసింది. ఏం మాట్లాడితే ఏం విపరీతం చేస్తుందోనని బెదిరాడు.

★ ★ ★

"బాబాయ్, బాబాయ్, మన షేర్నీ ఎంత భయంకరమైన మనిషో తెల్సా?" అడిగాడు వెంకీ.

"భయంకరమైన మనిషా? కాదే? అందంగానే ఉంటుంది. డ్రాక్యులాలాగా కోరలూ అవీ ఏం లేవే?" అమాయకత్వం నటిస్తూ అన్నాడు పవన్.

వెంకీ కూడా నవ్వేశాడు.

"అది నాకూ తెలుసులే. కానీ మనిషి మిస్ యూనివర్స్‌లాగా ఉంటే సరిపోదు కదా? హృదయం కూడా అందంగా ఉండాలి. బ్యూటిఫుల్ హార్ట్ మేక్స్ ఎ గర్ల్ లుక్ మోర్ బ్యూటిఫుల్" అన్నాడు వెంకీ.

"వండర్‌ఫుల్" నవ్వేశాడు పవన్.

"భోజరాజో ఎవరో ఆయన్ని చూస్తేనే చాలు అందరికీ కవిత్వం వచ్చేసేదట. నాకు షేర్నీని చూస్తే కవిత్వం వచ్చేస్తోంది. హృదయం చూస్తే కఠోరం. అంత క్రూయల్ గర్ల్ అని నేనెప్పుడూ అనుకోలేదు. మనిషి చూస్తే ఎంత బాగుంటుంది?" అన్నాడు వెంకీ.

"అదే మనలో ఉండే లోపం. మనిషి బాగుంటే చాలు ఇంక వాళ్ళు చాలా మంచి

వాళ్లు అయి ఉంటారని అనుకుంటాం. అందమైన మనసు ఉండటానికి అందమైన రూపం ఉండక్కర్లేదు. అందానికీ గుణానికీ సంబంధం లేదు. దేనికదే. ఇంతకీ నువ్వు అంత బాధపడిపోతున్నావు ఏం జరిగింద సలు? " అన్నాడు పవన్.

"ఒక సినిమా చూశాను. అందులో ఒక మహా అందమైన అమ్మాయి ఉంటుంది. తన అందంతో మనుషుల్ని ఆకర్షించి, వాళ్ళు నమ్మి వచ్చాక పట్టుకుని పీక్కు తింటుంది. మన షెర్నీ కూడా అదే టైపా? "

"ఇంతకీ ఏం జరిగిందో చెప్పకుండా ఏమిటా సస్పెన్స్? " అన్నాడు పవన్.

వెంకీ చెప్పటం ప్రారంభించాడు.

నిన్న సాయంత్రం వెంకీ షాపింగ్‌కని షాపింగ్ ప్లెజర్‌కి వెళ్ళాడు. హైదరాబాద్‌లో షాపింగ్ ప్లెజర్ కాంప్లెక్స్ గురించి తెలియని వారుండరు. కాకపోతే అక్కడి ధరలు చుక్కల్నంటుతూ ఉంటాయి. బాగా డబ్బున్న వాళ్ళుగానీ అక్కడ అడుగు పెట్టలేరు. ఒక ప్రొడక్ట్ స్టార్టింగ్ ధర కూడా మార్కెట్లో ఎంతో ఖరీదైన అదే వస్తువు ధర ఎంత ఉంటుందో అంత ఉంటుంది. అక్కడ సెంట్ సీసాలు కనీస ధర వెయ్యి రూపాయలతో మొదలవుతాయి. సామాన్యులకి అక్కడ షాపింగ్ చెయ్యటం ఒక లగ్జరీ అయితే డబ్బున్నవాళ్ళకి సౌఖ్యంగా ఉంటుంది. పిన్ టు గన్ అన్నీ ఒకే చూరు కింద దొరుకుతాయి. ఒకసారి లోపలకు వెళ్తే కావల్సినవి అన్నీ కొనేసుకుని బయట పడవచ్చు. వెంకీ తన బర్త్‌డే కోసం అక్కడ టీషర్ట్, జీన్ ప్యాంట్ కొనటానికి డాడీ దగ్గర డబ్బు శాంక్షన్ చేయించుకుని, ఒక మిత్రుడిని తోడు తీసుకుని ఆ షాపింగ్ కాంప్లెక్స్‌కి వెళ్ళాడు. అక్కడి బ్రహ్మాండమైన ఐటమ్స్, ఎస్కలేటర్స్, కింద ఉన్న బార్ అన్నీ చూసుకుంటూ వస్తున్నారు. ఇంతలో అక్కడ షెర్నీ ఎదురయింది. ఏవేవో ఖరీదైన వస్తువులన్నీ కొనుక్కుని కారులోకి చేర్చింది.

"అందులో ఆశ్చర్యం ఏముంది. షెర్నీ లెవెల్ మనిషి షాపింగ్ ప్లెజర్‌లో కాకపోతే ఫుట్‌పాత్ మీద షాపింగ్ చెయ్యదు కదా? " అన్నాడు పవన్.

"జోక్ కాదు బాస్. చాలా సీరియస్ విషయం. ఇంతదాకా చెప్పింది ముందు మాట. అసలు కథ ఇప్పుడే స్టార్టింగ్"

"ఏమిటా కథ? "

వెంకీ మళ్లీ చెప్పటం మొదలుపెట్టాడు. షెర్నీ వెంకీని చూడలేదో, చూసి కూడా వీడినేంటి కేర్ చేసేది అని కేర్ చెయ్యలేదో తెలీదు. చూడలేదు అనే అనుకోవాలి. షెర్నీ షాపింగ్ చేసిన వాటిల్లో చాక్లెట్స్, స్వీట్స్, సెంట్స్, ప్యాంట్స్ రకాలున్నాయి. వాటిని కార్లో పెట్టి వెనక్కు తిరిగింది. ఎంత ఖరీదైన షాపింగ్ సెంటరయినా, ఎంత పోష్ లొకాలిటీ అయినా మనం ఉండేది ఇండియా కాబట్టీ, గరీబీ ఇంకా పూర్తిగా హటావో కాలేదు కాబట్టే, బెగ్గర్స్ అనేవాళ్ళు ఎక్కడికి పోయినా తయారవుతారు. అక్కడ ఒక బిచ్చగత్తె ఉంది. పాపం ఆమె చాలా ముసల్ది. తిండి తిని పదిరోజులైనట్లు ఆమె మొహం పీక్కుపోయి, కళ్ళు గుంటలు పడి, మనిషి ఎండిపోయి, చర్మం ముడతలు పడి మహా దయనీయంగా ఉంది. అంత పెద్ద వయసులో ఆమె అలా దయనీయంగా బిచ్చమెత్తటం చూస్తే ఎవరికైనా గుండె కరిగిపోతుంది.

"అన్నం తిని రెండ్రోజులైంది. ధర్మం చెయ్యి తల్లీ" అంది ఆమె.

షెర్నీ వినిపించుకోలేదు. ఆమె మళ్ళీ అడిగితే గుడ్లురిమి చూసింది. ముసలామె షెర్నీని సరిగ్గా అంచనా వేయలేకపో

---

మనకున్న కొద్దిపాటిలోనే తృప్తికరంగా జీవించడాన్ని ఆనందం అంటారు.

– లాంగ్‌ఫెలో



యింది. అందమైన అమ్మాయి కాబట్టి మంచి మనసు ఉంటుందని అనుకుందో ఏమో పాపం... "తల్లీ తల్లీ, కాస్త ధర్మం చెయ్యి" అని మళ్ళీ ప్రాధేయపడింది. షెర్నీ కేర్ చెయ్యకుండా కారు ఎక్కబోయింది. ముసల్ది చొరవగా ఆమె చేతి ముందుకు తన పళ్ళెం నెట్టింది. "పోవే" గర్జించినట్లు అంది షెర్నీ. ముసల్ది పాపం ఆశగా బిచ్చం పళ్ళెం షెర్నీ ముందు మళ్ళీ ఆడించబోయింది. ఆ ప్రాసెస్‌లో ఆ పళ్ళెం షెర్నీ చేతికి కొట్టుకుంది. అంతే. షెర్నీ ఉగ్ర నరసింహావతారం దాల్చింది.

"ఏమే ఎంత పొగరు? " అని ముసల్దాన్ని ఒక్క నెట్టు నెట్టింది. ముసల్ది దభేల్న కింద పడింది. షెర్నీ అదేం పట్టించుకోకుండా కార్లో స్పీడ్‌గా వెళ్ళిపోయింది. అక్కడున్న వాళ్ళంతా నిర్ఘాంతపోయారు.

"ఈ కాలం పిల్లలకి జాలీ దయా ఏమీ లేవు" అని ఈ తరాన్నంతా జనరలైజ్ చేసి తిట్టేశారు.

వెంకీ అంతా చెప్పి నిట్టూర్చాడు.

"షెర్నీ నుంచి అలాంటి బిహేవియర్ నేను ఎక్స్‌పెక్ట్ చెయ్యలేదు"

"ఎందుకు చెయ్యలేదు? నేను ఎప్పుడో గ్రహించాను" అన్నాడు పవన్.

"ఇంత హార్డ్ హార్టెడ్ అని నేనస్సలు అనుకోలేదు" అన్నాడు వెంకీ.

పవన్ ఆలోచిస్తూ ఉండిపోయాడు. షెర్నీ తత్వం తెలిసిపోయింది. కాబట్టి షాక్ కాలేదు గానీ మనసులో ఎందుకో బాధ మాత్రం కలిగింది. షెర్నీ అంత కఠినంగా ఎందుకుంటోంది?

ఇద్దరూ కాస్సేపు మౌనంగా ఉండిపోయి ఏదో మాట్లాడుకుంటున్నారు.

సరిగ్గా అదే సమయంలో...

వాళ్ళకి కొద్ది దూరంలో, అదే రోడ్డు మీద... వాళ్ళ క్లాస్‌మేట్స్ శ్యామ్, రఘు,

నందన్, రాజ్, వినీత్ వెళ్తున్నారు.

రెండ్రోజుల క్రితం ఒక సంఘటన జరిగింది. ఆ రోజున వాళ్ళు అయిదుగురూ కాలేజ్ బస్‌లో వెళ్తున్నారు.

ఇంతలో వాళ్ళ కాలేజ్ రూట్‌లోనే ఉన్న మరో ఇంజినీరింగ్ కాలేజ్ కాలేజ్ ఆఫ్ ఇంజినీరింగ్ విద్యార్థులు నలుగురు ఒక స్టాప్‌లో నిలబడి ఉన్నారు. వాళ్ళు వెళ్లే బస్సులో ఉన్న అమ్మాయిల్ని చూసి వెకిలిగా నవ్వుతూ ఏదో కామెంట్ చేశారు.

"మన మంతమందిమి బస్‌లో ఉండగానే మన కాలేజ్ అమ్మాయిల్ని టీజ్ చేస్తారా?" అని పౌరుషం పొడుచుకుని వచ్చింది. మెడొన్నా కాలేజ్ విద్యార్థులకి. వెంటనే బస్సు ఆపి, కిందికి దూకి వాళ్ళమీద పడి చితకతన్నారు. చుక్కయ్య కాలేజ్ విద్యార్థులు తక్కువ తినలేదు. తన్నులు తప్పించుకుంటూ ఎవరో గూండాలకి కాబోలు ఫోన్ చేయాలని ప్రయత్నం చేస్తే మెడొన్నా కాలేజ్ బాయ్స్ వెంటనే ఆ సెల్‌ఫోన్స్ లాక్కుని వాళ్ళ ఆట కట్టించారు. బాగా తన్ని, తన్ని ఆ ఫోన్లు వాళ్ళ మొహాన కొట్టి, బస్సెక్కి తుర్రుమన్నారు. అమ్మాయిల ముందు కాలరెగరేసి ఆనందించారు.

దెబ్బలు తిన్న చుక్కయ్య కాలేజ్ పిల్లలు ప్రతీకారం తీర్చుకోవటానికి ఉవ్విళ్ళూరుతున్నారు. వాళ్ళు నలుగురూ కలిసి తలా మూడువేలూ వేసుకుని ఒక గూండాకి సమర్పించారు.

"మేము కూడా ఒక చెయ్యి వేస్తాం. నువ్వు కూడా ఉంటే మోరల్ సపోర్ట్ ఉంటుంది" అన్నారు.

గూండా సరేనన్నాడు.

బచ్చాగాళ్ళేకదా అని ఆయన తేలిగ్గా పోనివ్వలేదు. అతను వృత్తికి గూండానే కానీ చాలా నీతి నియమాలూ, వృత్తిపట్ల అంకిత భావం, శ్రద్ధా ఉన్నవాడు. ఆయన ఒకసారి పని ఒప్పుకున్నాక దానికి పూర్తిన్యాయం చేకూర్చాకే నిద్రపోయేవాడు. డబ్బులు అటూ ఇటూ అయినా కూడా పట్టించుకునే వాడు కాదు. అందువల్ల మంచి పేరు దక్కించుకుని, అన్ని వర్గాలలోనూ పాపులర్ అయ్యాడు.

స్టూడెంట్సే కదా, వాళ్ళుకూడా చెయ్యివేస్తామన్నారు అని అతను ఊరుకోలేదు, భారమంతా తనమీదే వేసుకున్నాడు. శిష్యుల్ని తీసుకుని జీప్‌లో బయల్దేరాడు. స్టూడెంట్స్‌ని వెంట వేసుకుని, ఎవరికీ అనుమానం రాకుండా కాలేజీకి కాస్త దూరంలో ఆగారు.

శిష్యులు అటూ ఇటూ తిరుగుతూ, ఎవరన్నా కనిపిస్తే ఉతుకుదామని ప్లాన్ చేస్తున్నారు.

రఘు, వినీత్, శ్యామ్ తదితరులు రోడ్డు మీద అలా నడుచుకుంటూ వెళ్తున్నారు. ఆ కాలేజ్ ఊరికి చాలా దూరంలో ఉంది. రోడ్డుమీద ఎప్పుడో ఒకసారి కార్లు వెళ్తుంటాయి. నిర్జనంగా ఉంటుందనే చెప్పాలి. అక్కడ వాళ్ళు అయిదుగురూ నడుచుకుంటూ వెళ్ళటం గమనించిన ఒకడు వెంటనే ఆ సంగతి సెల్‌లో గూండాకి చెప్పేశారు. వెంటనే జీప్ దగ్గరకి వెళ్ళారు అంతా. జీప్‌ని రయ్యిమని రోడ్డుమీదికి పోనిచ్చారు.

రఘు గ్యాంగ్‌ని చూపిస్తూ "వీళ్ళల్లో మీకు కావల్సినవాళ్ళున్నారా?" అని అడిగాడు గూండా.

చుక్కయ్య కాలేజ్ స్టూడెంట్స్ ఎగిరి గంతేశారు. "వీళ్ళే వీళ్ళే" ఉత్సాహంగా అరిచారు.

ఆ కేకలు విని అటుచూసిన రఘు బృందానికి వెంటనే సీన్ అర్థమైపోయింది.

రఘు, వినీత్ వాళ్లని చూడగానే గూండా గారూ, ఆయన అనుచరులూ, 'హే' అనీ "హోయ్" అనీ భయంకరంగా ఆఫ్రికా అడవి విజాతి మనుషులు ఈటెలు పట్టుకుని వేటకి దూకి అరిచినట్లు అరుచుకుంటూ జీప్ దూకారు.

ఆ అరుపులకే గుండె దద్దరిల్లిపోయేట ట్లుంది. వాళ్లు అరిచిన అరుపులు అక్కడికి అరమైలు దూరంలో ఉన్న పవన్‌కీ, వెంకీకీ కూడా వినిపించాయి. ఏదో జరగబోతోం దని వాళ్లకి తెలిసిపోయింది.

ఇక రఘు, వినీత్ వాళ్లకైతే గుండెలు అవిసిపోయాయి. ఒక్కసారిగా రాక్షసుల్లా దూకిన గూండా ఆయన అనుచరులూ, ఆపైన చుక్కయ్య ఇంజినీరింగ్ కాలేజ్ విద్యార్థుల్నీ చూడగానే సంగతి అర్థమైపో యింది.

తప్పించుకుని పారిపోదామన్న పిరికి యత్నం మాత్రం వాళ్లు చెయ్యలేదు. ధైర్యంగా ఎదుర్కొందామనే చూశారు. గూండాలకి అహం దెబ్బతిన్నట్లు అయింది. తమని చూడగానే మహామహా వాళ్లకే సంగతి అర్థమై పారిపోతారు. వీళ్లేంటి ఆఫ్ట రాల్ బచ్చాగాళ్లు మనల్ని ధైర్యంగా ఎదు ర్కొని నిలబడటమా అని వాళ్లకి కారం రాసినట్లయింది. వెంటనే రంగంలోకి దిగి వాళ్లని చితకబాదటం మొదలుపెట్టారు.

ఎంత ధైర్యంగా ఉన్నా, ఏమైనా, రఘు వాళ్లు మామూలు మనుషులు. అవతల ప్రొఫెషనల్ గూండాలూ, వాళ్లకి సాయంగా చుక్కయ్య కాలేజ్ విద్యార్థులు కొందరు, రఘు గ్యాంగ్ వాళ్లని ఎదుర్కొందామని ఎంత ప్రయత్నించినా లాభం లేకపో యింది. వాళ్లు నిమిషాల్లో అందర్నీ చితక బాదేశారు.

ముక్కులు చితికి, మొహాలు వాచి రక్తం కారుతూ భయంకరంగా తయారయ్యాయి. వాళ్ల ఆకారాలు. ఆ ప్రదేశం అంతా అరు పులూ, కేకల్తో నిండిపోయింది.

"ఏదో జరుగుతోంది. ఆ వైపు నుంచీ కేకలు వినిపిస్తున్నాయి. పద వెళ్దాం' అన్నాడు పవన్. ఇద్దరూ పరుగెత్తి ఆ ప్రదే శానికి చేరుకున్నారు. అప్పటికే తనివితీరా బాదేసి, చితక్కొట్టిన గూండాగారి బృందం జీప్‌లో ఉడాయించేసింది.

రఘుకీ, వినీత్‌కీ తీవ్ర గాయాలయ్యాయి. వాళ్లు లేవలేకపోతున్నారు. తప్పకుండా కాలి ఎముకలు విరిగే ఉంటాయి. లేచి నిలబడ దామని చూసి నెప్పి భరించలేక కిందపడి పోయారు. మిగతా వాళ్లకి కూడా బాగా గాయాలయ్యాయి. వాళ్లు కిందపడి మూలు గుతున్నారు. ఎవరూ లేచే స్థితిలో లేరు.

పవన్, వెంకీ వాళ్ల ముందు ప్రత్యక్షం కాగానే వాళ్లకి అంత బాధలోనూ ప్రాణం లేచి వచ్చినంత హాయి కలిగింది.

"ఏం జరిగిందిరా? ఎవరు కొట్టారు?" వెంకీ అడిగాడు.

వాళ్లు చెప్పే ఓపికలేక మూలుగుతు న్నారు. "తర్వాత తీరిగ్గా పలకరిద్దాం. ముందు వీళ్ల సంగతి చూడాలి" అన్నాడు పవన్.

వాళ్లని లేపటానికి ప్రయత్నించాడు. సాధ్యంకాలేదు. వాళ్లంతా రోడ్డుమీద పడి ఉన్నారు. రోడ్డు నిర్మానుష్యంగానే ఉన్నా ఒక్కోసారి లారీలూ, కార్లూ స్పీడ్‌గా పోతుం టాయి. ట్రాఫిక్ రద్దీ లేదు కాబట్టి నూరు మైళ్ల స్పీడ్‌లో ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు వెళ్తుంటారు. మనుషులు రోడ్డుమీద పడి ఉంటే చూడకుండా అలాగే డ్రైవ్‌చేస్తూ, మీదినుంచి నడిపినా నడిపేస్తారు.

"ముందు వీళ్లని రోడ్డుమీదికి చేర్చాలి" అన్నాడు పవన్. ఇద్దరూ అతికష్టం మీద వాళ్లను రోడ్డుకి ఒకవైపు తీసుకెళ్లి కూర్చోబె ట్టారు. వాళ్లంతా నెప్పి భరించలేక గట్టిగా మూలుగుతున్నారు.

ఏదన్నా కారు వస్తుందేమోనని ఆత్రంగా ఎదురుచూస్తున్నారు వాళ్లు. ఆదుర్దాతో ఇద్ద రికీ అసలు ఏమీ తోచటంలేదు. తమ చూపులన్నీ రోడ్డుమీదికి ఫిక్స్‌చేసి, ఏకారో, లారీనో వస్తుందేమోనని ఆతృతగా ఎదురు చూస్తున్నారు.

రెండు నిమిషాల్లో వాళ్ల నిరీక్షణ ఫలిం చింది. ఒక కారు వేగంగా వస్తోంది.

"అమ్మయ్యా. ఏదో కారు వస్తోంది. మన

కష్టాలు తీరినట్లే" అన్నాడు వెంకీ.

ఆ కారు వేగంగా, అతివేగంగా వచ్చేస్తోంది. దగ్గర పడుతున్న దాన్ని చూడగానే పవన్ కనుబొమ్మలు ముడుచుకున్నాయి.

"షెర్నీ కారులా ఉంది" అన్నాడు. "ఉండటం కాదు. అది షెర్నీ కారే." అన్నాడు వెంకీ. షెర్నీ కార్లన్నీ పవన్‌లాంటి వాళ్లకి సుపరిచితమే.

ఇద్దరూ రోడ్డుకి అడ్డంగా పరుగెత్తి కారుని ఆపమన్నట్లు చేతులూపుతున్నారు.

కారు చాలా స్పీడ్‌గా వస్తోంది. వాళ్లని చూసి, ఆపటానికి ఇష్టంలేనట్లు వాళ్లను తప్పుకుని వెళ్లిపోవాలని డ్రైవర్ చేస్తున్న వ్యర్థ ప్రయత్నం తెలిసిపోతోంది.

పవన్, వెంకీ మొండిగా ఆ కారుకి అడ్డంగా నిలబడ్డారు. ఇక గత్యంతరంలేక ఆగింది కారు.

నల్లటి అద్దాలున్న నల్లటి కారు. షెర్నీ లోపల ఉంది. కానీ దిగలేదు. డ్రైవర్ కారు దిగాడు.

"ఏమిటి? లిఫ్టా? కుదరదు" అన్నాడు బట్టీపట్టినట్లు.

"మాకు లిఫ్ట్ కాదు. అదుగో అక్కడ మా ఫ్రెండ్స్‌కి చాలా దెబ్బలు తగిలాయి. వెంటనే హాస్పటల్‌కి తీసుకెళ్లాలి. కార్లో ఎక్కనివ్వు" అన్నాడు.

"మా కార్లో ఇంతమంది పట్టరు" అన్నాడు డ్రైవర్. "మామూలు కార్లో పట్టరేమో. మీ కారు ఏరోప్లేన్ అంత ఉంది. సర్దుకుని కూర్చుంటాం ఫర్వాలేదు" అన్నాడు వెంకీ.

డ్రైవర్ నీళ్లు నమిలాడు.

"అమ్మాయి గారు తిడతారు" అన్నాడు.

"ఆవిడ కూడా మా కాలేజీలోనే చదువుతున్నారు. తోటి స్టూడెంట్స్ ప్రాణాపాయ స్థితిలో ఉంటే రక్షించరా? " అన్నాడు పవన్.

"లేదండీ. తిడతారు. కుదరదు" అన్నాడు డ్రైవర్. ఇంత జరుగుతున్నా షెర్నీ లోపల నిమ్మకు నీరెత్తినట్లు కూర్చుంది.

పవన్ ముందుకు వెళ్ళి అద్దం మీద తట్టాడు. ఇంగ్లీషు తిట్లతో అద్దం కిందకి దిగింది. లోపల ఉన్నది షెర్నీనే... నో డౌట్.

"ఏం కావాలి? " అంది విసుగ్గా.

"లిఫ్ట్ కావాలి"

"నో" నిష్కర్షగా, నిర్మొహమాటంగా అంది షెర్నీ.

"మా కోసం కాదు. అదుగో అటు చూడు మన క్లాస్‌మేట్స్ రఘు, వినీత్. వాళ్ళందరికీ దెబ్బలు తగిలాయి. వెంటనే వాళ్ళకి ట్రీట్‌మెంట్ ఇప్పించకపోతే డేంజర్".

"ఏం జరిగింది? యాక్సిడెంటా? "

"ఏదైతే ఏం? దెబ్బలు తగిలాయి"

"ఏదైనా కుదరదు. డ్రైవర్... కారు పోనీ" అంది షెర్నీ

డ్రైవర్ ఇబ్బందిగా చూస్తున్నాడు.

"చెపితే నీక్కాదూ? లోపలకు నడు" అంది షెర్నీ. ఆ మాటకి రాజశాసనం అమలు చేస్తున్న సామాన్య మానవుడిలా వెంటనే తలుపుతీసి కూర్చోబోయాడు డ్రైవర్.

"ఆగు, నువ్వసలు మనిషివేనా? దెబ్బలు తగిలి ప్రాణాపాయంలో ఉన్న మనిషికి కనీస సాయం చేయాలన్న మానవత్వం కూడా లేదా? " కోపంగా అరుస్తూ అన్నాడు పవన్.

షెర్నీ నిర్లక్ష్యంగా చూస్తూ, తల ఎగరేసింది. "మానవత్వం, మంచితనం? ఏం అవి నాకొక్కదానికే ఉండాలా? ఎన్నో కార్లు వెళ్తుంటాయి. అవి ఆపి అడుక్కో. ఏం? ఎవడో ఎవడితోనే కుక్క ఫైటింగ్స్ చేసి, దెబ్బలు తిని మూలుగుతుంటే, నేను వాళ్ళని హాస్పటల్‌కి తీసుకెళ్ళాలా? " అంది తనూ గర్జిస్తూ.

"హూ... నీకసలు..."

"నోర్ముయ్. ఇదేం ఆర్టీసీ బస్సు కాదు, అడ్డమైన వాళ్ళనీ ఎక్కించుకోవటానికి" షెర్నీ ఉరుముతూ ఉంది.

## పులుపు విరిగేనా.. ధర తరిగేనా?




**ఓ** షావుకారు తనకొడుకును ఐదోతరగతి ఎందుకు పాస్ చేయలేదంటూ వచ్చి టీచర్‌తో గొడవ పెట్టుకున్నాడు. ఆయన్ను శాంతింప చేయడానికి టీచర్ నానా తంటాలు పడుతూ

'అయ్యా.. మీవాడు రేపు తప్పులు లేకుండా పద్దులు రాయలా? వద్దా?.. చింతపండు రాయమంటే శింతపండని రాశాడు.. ఇలాగైతే రేపు మీ లెక్కలేంకాను? అందుకే వాడిని తప్పించాను..' అన్నాడు సమయస్ఫూర్తిగా.

వెంటనే షావుకారు 'ఓర్నీ ఇదంటయ్యా మావోడు తప్పురాసింది.. చింతపండంటే ఏంటి? శింతపండంటే ఏంటి? దాని పులుపు విరిగేనా? రేటు తరిగేనా? దానికే తప్పిస్తావా? ఎంటనే ఆరోక్లాసులోఏసి లెక్కా డొక్కా నేర్పు సరిపోద్ది' అంటూ చరచర వెళ్లిపోయాడు.

“డ్రైవర్, కారు పోనీ” అంది

వెంకీకి ఒక ఐడియా వచ్చింది.

“పోనీ... మీ సెల్ ఇవ్వండి. కాలేజ్‌కి ఫోన్ చేసి చెప్తే ఎవరన్నా కారు తీసుకుని వస్తారు” అన్నాడు.

“షిట్. నా ఫోన్ యూజ్ చెయ్యటానికి వీల్లేదు” అంది షెర్లీ.

“రాక్షసీ. నిన్ను అలా పోనివ్వను. కార్లో ఎక్కించుకుని తీరాల్సిందే. ప్రమాదంలో ఉన్నవాళ్లని రక్షించాల్సిన బాధ్యత నీకుంది” పవన్ కరుగ్గా అన్నాడు.

అంతే. షెర్లీ సింహంలా దూకింది. ఏం జరుగుతుందో తెలిసే లోపలే ఆమె చెయ్యి బలంగా పవన్ చెంపను తాకింది.

“ఏమన్నావురా, రాక్షసినా?” ఆడ సింహంలా గర్జించి, క్షణంలో మెరుపులా వెనక్కు తిరిగింది.

కారు స్టార్ట్ చెయ్యమన్నట్లు డ్రైవర్ వైపు తీక్షణంగా చూసింది. డ్రైవర్ భయంగా చూస్తున్నాడు.

“ఏం ఉద్యోగం అక్కర్లేదా? చెప్పు. వెంటనే కారు పోనీ లేకపోతే దిగిపో. ఈ క్షణంలోనే నిన్ను డిస్మిస్ చేసి పారేస్తాను.” అంది షెర్లీ.

ఆ మాట రామబాణంలా పనిచేసింది.

డ్రైవర్ ఒక్క దూకున కారును ముందుకి ఉరికించాడు.

వెంకీ, పవన్ నిస్పృహాయంగా చూస్తూ నిలబడిపోయారు. వాళ్ళ కళ్ళల్లో దుమ్ము రేపుతూ, కారు క్షణాల్లో మాయమైంది.

“ఛీ అదసలు మనిషి కాదు. నేను ఇందాక కోపంలో రాక్షసి అన్నాను కానీ అది నిజంగా రాక్షసి... పిశాచి” అన్నాడు పవన్ కోపంగా.

“అసలు దాని సంగతి తెలిసీ మనం ఆ కారు ఎందుకు ఆపినట్లు. సరే ఏదో అయిపోయింది కానీ ఇక దాని గురించి ఆలోచించి టైమ్ వేస్ట్ చేసుకోవద్దు. అదుగో ఇంకో కారు వస్తోంది ఆపుదాం” అన్నాడు వెంకీ.

ఇద్దరూ ఆ కారుకి అడ్డంపడి దాన్ని ఆపారు. అదృష్టవశాత్తూ ఆ కారు కూడా

వాళ్ల కాలేజ్ స్టూడెంట్‌దే. అతను వెంటనే అందర్నీ ఎక్కించుకుని హాస్పిటల్‌కి తీసుకెళ్ళాడు.

హాస్పిటల్‌లో వెంటనే అడ్మిట్ చేసుకున్నారు. రఘుకీ, వినీత్‌కీ కాలి ఎముకలు విరిగాయి. మిగతా వాళ్ళకి ఎముకలు విరగకపోయినా బాగా గాయాలయ్యాయి. అందరి ఇళ్ళకూ ఫోన్ చేసి చెప్పారు. వాళ్ళ పేరెంట్స్ వచ్చేశారు.

"మమ్మీ, డాడీ" అంటూ ఒక్కొక్కళ్ళూ వాళ్ళ పేరెంట్స్‌ని చిన్నపిల్లల్లా పట్టేసుకుని మాట్లాడుతున్నారు. పేరెంట్స్ గట్టిగా ఏడ్చేస్తూ, తమ పిల్లల వీపు నిమురుతూ, ముద్దు చేస్తూ లాలిస్తున్నారు.

వెంకీ, పవన్ అదంతా చూస్తూ నిలబడ్డారు. "ఇక వెళ్దామా" అన్నాడు వెంకీ పవన్ భుజం తట్టి.

ఇద్దరూ అందరి దగ్గరా శెలవు తీసుకుని బయటకు వచ్చారు.

వాళ్ళ పేరెంట్స్ ఆప్యాయతని చూస్తే మనసు మెలి పడినట్లు అనిపిస్తోంది పవన్. అసూయకాదు అదోమాదిరి బాధ.

తనకెవరూ లేరు.

ఆ మధ్య తనకి ఒకసారి చెయ్యి విరిగింది. పాపం విజయ్ ఎంతో హెల్ప్ చేశాడు. ఎంతో ఆప్యాయంగా చూసుకున్నాడు. విజయ్‌కీ అతని కుటుంబానికీ తను ఎంతో ఋణపడి ఉన్నాడు. విజయ్ లేకపోతే తను ఏమైపోయి ఉండేవాడు?

"ఏమిటిలా అయిపోయావు. వాళ్ళ గురించి ఆలోచిస్తున్నావుగా. డాక్టర్లు ఏం భయం లేదని అన్నారుగా? " అన్నాడు వెంకీ.

"వాళ్ల గురించి కాదు" అన్నాడు పవన్.

"మరి దేనికీ? "

దేని గురించి? మాతృప్రేమ గురించి. తల్లి ఆప్యాయత, తండ్రి లాలన కరువైన తన బతుకు గురించి. అమ్మానాన్న తోబుట్టువుల ఆప్యాయత గురించి తను ఇదివరకు ఇంత బాధపడలేదు. తనకి ఎవరూ లేకపోయినా అందరూ తనవాళ్ళే అన్నట్లు ఉండేవాడు. షెర్నీని చూశాకే తన మనసులో ఉన్న శూన్యం గురించి తనకు తెలిసింది. ఆ శూన్యాన్ని షెర్నీ రాక నింపినట్లు తనకి అనిపించేది. ఆమెని చూస్తే చాలు ఎంతో తృప్తిగా, సంతోషంగా అనిపించేది. దాన్నే ప్రేమ అంటారా? ఏమో? ఏది ఏమైనా తను షెర్నీని తీవ్రంగా అభిమానించింది మాత్రం నిజం. కానీ షెర్నీ... ఆ రాక్షసి ఎంత పని చేసింది? మానవత్వం, మంచితనం లేకుంటే ఎంత అందగత్తెలైనా ఎంత ఐశ్వర్యం ఉన్నా ఏం ప్రయోజనం? యక్షిణులూ, రాక్షసులూ ఎంత అందంగా ఉంటారు. వాళ్ళని ప్రేమించటం ఎంత మూర్ఖం. మర్చిపోవాలి. షెర్నీ రాక్షసి. ఆ రాక్షసిని మర్చిపోవాలి.

గట్టి నిర్ణయం తీసుకున్నాడు పవన్.

విజయ్, పవన్ ఇద్దరూ ఇందిరా పార్కులో చెరువు దగ్గర సిమెంట్ సోఫాల్లో కూర్చుని ఉన్నారు. చెరువులో తిరుగుతున్న బోట్‌ని చూస్తున్నాడు పవన్.

"నువ్వీ మధ్య అదోలా ఉంటున్నావు? " విజయ్ అడిగాడు. "ప్రేమలో పడ్డావా ఏంటి? " అన్నాడు.

పవన్ గతుక్కుమన్నాడు. ఇన్నాళ్ళూ తన ప్రేమని ఎవరికీ తెలియకుండా జాగ్రత్తగా దాచుకుంటున్నాననుకుంటున్నాడు. విజయ్ ఎట్లా కనిపెట్టాడోనని ఆశ్చర్యం వేసింది.

"నీకెలా తెలిసింది? " అడిగాడు.

దూరాన కొన్ని జంటలు ఒకళ్ళమీద ఒకళ్ళు వాలిపోతూ, ఒకళ్ళ కళ్ళలోకి మరొకరు చూసుకుంటూ ఒకరినొకరు హత్తుకుని తిరుగుతున్నారు. తనూ, షెర్నీ అట్లా ఉండాలని వెర్రికోరిక కలిగింది.

బాగా ఆలోచించి, బాగా పనిని చేయడం అన్నదే అన్నిటి కంటే వివేకమైనది, ఉత్తమమైనది. – మార్కటి. హెండర్సన్

ఈ కోరిక తీరేదేనా? నింగికీ, నేలకీ ఎలా పొత్తు కుదురుతుంది? జరగని వాటి గురించి ఎంత చింతించి ఏం లాభం? తన వెర్రి ఆశ తల్చుకుని తనమీద తనకే జాలి కలిగింది.

"ఆ పరధ్యానం... ఎటో చూస్తూ ఉండి పోవడం, ఉండుండి చిరునవ్వు మొల వటం... హఠాత్తుగా దిగులు" విజయ్ నవ్వే శాడు.

పవన్ నవ్వుదామని ప్రయత్నించాడు కానీ, నవ్వు రాలేదు. మనసు నిండా షెర్నీ నిలిచిపోయింది.

గుండెని కోత కోస్తోంది. జగత్తంతా శూన్యంగా అనిపిస్తోంది. నిస్సత్తువగా ఉంది. ఏదో పెద్ద జబ్బు చేసినట్లనిపి స్తోంది. ఈ జబ్బుకి మందు ఏది?

"దర్ద్ దిల్ కీ దవా సిర్ఫ్ దిల్‌దార్ హై" దూరంగా పాట వినిపిస్తోంది.

బాధపడుతున్న హృదయానికి మందు ప్రియురాలే. కానీ తనకి మాత్రం ఆ మందు దొరకదు. తను ఆ జబ్బుతోనే కృంగి కృశించి, నశించిపోవాల్సిందే.

"అసలు ప్రేమంటే ఏమిటి? " పవన్ మళ్ళీ ప్రశ్నించాడు. విజయ్ సమాధానం చెప్పటా నికి తడుముకుంటాడనుకున్నాడు. కానీ విజయ్ ఠపీమని సమాధానం ఇచ్చేశాడు.

"ప్రేమంటే ఆ వ్యక్తినే తల్చుకుంటూ ఉండిపోవటం, ఆ వ్యక్తిని చూడగానే వెర్రి ఆనందం, ఉత్సాహం, వాళ్ళు కనబడకపోతే అంతులేని దుఃఖం, భరింపరాని నిరాశ. ఆ వ్యక్తి కోసం ఏ త్యాగం అయినా చేయగల గటం..."

తన మనసుని చదివేసినట్లు చెప్తున్న విజ య్‌ని చూసి నవ్వు వచ్చేసింది పవన్‌కి.

"పవన్" విజయ్ ప్రేమగా పిలిచాడు.

"ఏమిటి? "

"నువ్వు నిస్సందేహంగా ప్రేమలో పడ్డావు. నా దగ్గర దాచటం దేనికి? నన్ను నీ ట్రూ ఫ్రెండ్‌గా భావించటంలేదా? "

పవన్ బాధగా చూశాడు.

"విజయ్ ఈ ప్రపంచంలో నీకన్నా నాకె వరున్నారు? " అన్నాడు.

"మరి నీ లవ్ గురించి చెప్పటానికేం? "

"ఏం లేదు. చెప్పి లాభం లేదు"

"ఎందుకని? "

"అది వన్ వే కాబట్టి"

"అలా ఎందుకనుకుంటున్నావు? "

"ఆ అమ్మాయికీ నాకూ మధ్య దాటలేని అగాధం ఉంది. వేలమైళ్ల దూరం ఉంది"

"ప్రేమకు ఇవేవీ అడ్డురావనుకుంటానే!"

"విజయ్. లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటారు. అలాటిది ఉందని నువ్వు నమ్ము తావా? "

విజయ్ గట్టిగా నవ్వేశాడు.

"లేకపోతే ఇంతమంది దాన్ని గురించి ఎందుకు మొత్తుకుంటారు? " అన్నాడు.

"సరే. ఓ.కే. మొదటి చూపులోనే ప్రేమ. దేన్ని చూసి ప్రేమిస్తారు? "

"మొదటగా ఎవరన్నా చూసేది లుక్స్ మాత్రమే. అందంగా ఉంటే ఆకర్షింపబడ తారు"

"ఎగ్జాక్ట్‌లీ నా విషయంలో కూడా అదే జరిగింది"

"వండర్‌ఫుల్. నీ ప్రేమ సఫలం కావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను" విజయ్ లేచి సంతోషంగా షేక్‌హేండ్ కోసం చేయి చాపాడు.

పవన్ నీరసంగా చేతిని అందించాడు.

విజయ్... అందర్నీ అర్థం చేసుకుని ప్రేమించే విజయ్... నిష్కల్మషంగా చూస్తూ అందరికీ సాయపడాలనీ, అందరూ బాగుండాలనీ ఆరాటపడే విజయ్ అందిం చిన అభినందన ఊరికే పోతుందా? అత నికి దిగులుగా అనిపించింది.

"పవన్, పాజిటివ్ థింకింగ్ గురించి నాన్నగారు చెప్పింది గుర్తులేదూ? " అన్నాడు విజయ్.

పవన్ తల ఊపాడు.

కీడెంచి మేలెంచటం పాతకాలం పద్ధతి. ఏ పనైనా ప్రారంభించినప్పుడు అది తప్పకుండా విజయవంతం అవుతుందనే అనుకోవాలి. మన వల్ల కాదులే, ఆ... మనవల్లేం జరుగుతుందిలే అనుకునే రోజులు పోయాయి. ఈ రోజుల్లో చవటల్లా చచ్చుబడి కూర్చుంటే లాభం లేదు. ఇది స్పీడ్ యుగం. చూస్తాలే, చేస్తానేమో ఇలాంటి మాటలు కాదు. చేస్తాను, చెయ్యగలను అనుకోవాలి. గట్టిగా ప్రయత్నిస్తే ఏ పనైనా ఎందుకు కాదు అనేవాళ్ళు జ్ఞానానందంగారు. ఆ మాటలు తనలో ఉత్సాహాన్ని నింపేవి. పల్లెటూరు నుంచి వచ్చి, పదేళ్ల వయసు దాటాక అఆలు నేర్చుకున్న తను ఈనాడు ఇంగ్లీషులో గడగడా మాట్లాడుతూ, ఏ విషయం గురించి అయినా తడుముకోకుండా చర్చించగలుగుతున్నాడంటే ఆత్మవిశ్వాసమే కారణం. నేను చెయ్యాలి, చెయ్యగలను అన్న దృఢ సంకల్పంతోనే ముందుకి పోగలుగుతున్నాడు.

కానీ... మన మటుకు మనం ఏదన్నా చేయగలగటం వేరు. ఇంకో మనిషితో, ఇంకొక మనసుతో ముడిపడ్డ వ్యవహారం ఇది. ఇందులో ఎంత ఆత్మవిశ్వాసం ఉండి మాత్రం ఏం లాభం?

ఆడపులిలాంటి షేర్నీని అరసెంటీమీటరు అయినా కదిలించగలడా తను? షేర్నీది ఇనుముతో చేసిన గుండె. క్రూరత్వం, కఠినత్వం రంగరించి పోతపోసిన గుండె. అది గుండె కాదు. రాతిబండ. షేర్నీ నుంచి ప్రేమని ఆశించటం అంటే ఎండమావిలో నీరు ఆశించటం....

"విజయ్. నువ్వు చెప్పింది కరెక్ట్. ఎవరైనా లుక్స్‌తోనే మొదట ఆకర్షింపబడతారు. నేనూ అలాగే ఒకమ్మాయి వైపు బలంగా ఆకర్షింపబడ్డాను. కానీ తర్వాత గమనిస్తే ఆ అమ్మాయి ఒక రాతిబండ, రాక్షసి. సరే, ఆమె స్వభావానికి నేను ఏం చేయలేను. కానీ ఎందుకో ఆమెని మర్చిపోలేకుండా ఉన్నాను. ఈ పరిస్థితిలో ఏం చేయాలో తెలీక సతమతమవుతున్నాను." పవన్ మెల్లగా చెప్పాడు. బాధతో, దిగులుతో అతని గుండె కొట్టుకుంటోంది.

విజయ్ పవన్ చేతిని మెల్లిగా నొక్కాడు.

"పవన్, ఆ అమ్మాయిని ఒకసారి చూపించు"

"చూసి ఏం చేస్తావు?"

"నాకెందుకో ఆ అమ్మాయిని ఒకసారి చూడాలనిపిస్తోంది. నిన్ను ఆకర్షించిందంటే ఆ అమ్మాయి మామూలు మనిషి అయి ఉండదు. ఆమె పేరేంటి?"

"షేర్నీ. అంటే సివంగి. ఆడ సింహం" విజయ్ పొట్ట పట్టుకుని నవ్వేశాడు.

"అయ్యబాబోయ్. అదేం పేరు"

"పేరు చూస్తేనే భయం వేస్తోంది కదూ? మనిషిని చూస్తే చాలు మూర్ఛపోతాం. ప్రవర్తన చూసి వణికిపోతాం"

"తమాషాగా ఉంది. నువ్వు చెపుతుంటే ఇంకా క్యూరియాసిటీ పెరిగిపోతోంది. నాకా అమ్మాయిని చూపించు. ప్లీజ్"

పవన్ విజయ్ మొహంలోకి చూశాడు. విజయ్ కళ్ళు నిష్కల్మషంగా మెరుస్తున్నాయి. ఆ మొహంలో ఆత్మీయత, పెదవులపై స్నేహపూర్వకమైన చిరునవ్వు.

"విజయ్. రేపు మా కాలేజ్‌కి వస్తావా?"

"ఓ. కే."

విజయ్ ఎటో చూస్తూ ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"పవన్. అసలు ఆ అమ్మాయి గురించి ఎందుకు అలా అనుకుంటున్నావు?" అడిగాడు విజయ్.

పవన్ నిట్టూర్చాడు.

"ఊరికే అలా కామెంట్స్ చేయను. బలమైన కారణాలున్నాయి. నేను ప్రత్యక్షంగా చూసిన సంఘటనవల్లే అలా అంటున్నాను" అన్నాడు పవన్. షేర్నీతో తనకు అనుభవం అయిన ఒక్కొక్క సంఘటనా వివరించి చెప్పాడు పవన్.

"చాలా వింతగా ఉందే. ఒక టీనేజ్ గర్ల్‌లో అంత కఠినత్వం..."

"అదే కదా నేనూ చెప్పేది. ఇంత చెప్తున్నానా. ఆమెని చూడాలని నా గుండె కొట్టుకుంటోంది. ఆమెని చూడకుండా ఉండలేను. అదోమాదిరి భయంకర ఆకర్షణ ఉంది ఆ అమ్మాయిలో"

"ఏంటో ఆ విచిత్రం మరి? సరే... రేపు మార్నింగ్ పదకొండు గంటలకంతా మీ కాలేజ్ గార్డెన్‌లో వెయిట్ చెయ్యి. నేను వచ్చి ఆ అమ్మాయిని ఒక్కసారి చూస్తాను. నాకెందుకో నీ ప్రేమ సక్సెస్ అవుతుందనే అనిపిస్తోంది".

"నీది మంచి మనసు కాబట్టి అలా అనిపిస్తోంది" పవన్ నవ్వేశాడు.

★ ★ ★

ఉదయం పదకొండు గంటల సమయం.

మెడొన్నా కాలేజ్ మొత్తం కోలాహలంగా ఉంది. లేట్ కమర్స్, అప్పుడప్పుడూ వచ్చిపోతుండే వాళ్ళూ కూడా ఆ రోజు టైమ్‌కి వచ్చేశారు. రంగురంగుల డ్రెస్సుల్లో కళకళలాడుతూ తిరుగుతున్నారు.

పవన్, విజయ్ ఒక బెంచీలో కూర్చుని ఉన్నారు. పవన్ షెర్నీ ఎక్కడుందా అని అటూ ఇటూ తిరిగి చూసి వచ్చాడు.

గార్డెన్లో సోఫాలో కూర్చుని షెర్నీ కోసం ఇంకా ఎంత వెతకాలో అని ఆలోచిస్తున్నాడు. వెతకబోయిన తీగె కాలికి తగిలినట్లు షెర్నీ కనిపించింది. ఎవరితోనో మాట్లాడుతోంది. మనిషిలో అహం, కదలికల్లో నిర్లక్ష్యం, లెక్కలేనితనం ఇక్కడికి కూడా కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. విజయ్ కూడా పవన్ చూస్తున్నవైపే చూస్తున్నాడు. అంతే! అటే చూస్తుండిపోయాడు.



అతను అటే స్టేర్ చేసి చూడటం షెర్నీ గనక చూసిందంటే ఏం కొంపలు మునుగుతాయో అని భయం వేసింది పవన్‌కి.

"ష్... అటు చూడకు" అన్నాడు మెల్లగా హెచ్చరిస్తున్నట్లు.

విజయ్ అర్థం కానట్లు చూశాడు.

నోటమాట రావటంలేదు అతనికి.

షెర్నీని చూసిన వాళ్ళెవరైనా సరే ఇట్లా మైమరచి పోవటం అతి మామూలు విషయం. కానీ విజయ్‌ని షెర్నీ ఏమన్నా అంటే మాత్రం తను భరించలేడు. ఆ పరిస్థితి రాకుండా చూడాలి.

"బాగుండదు. అలా చూడకు. అసలే డేంజరస్ మనిషి" గొణిగాడు.

విజయ్ అసలు వినిపించుకోనే లేదు.

ట్రాన్స్‌లో ఉన్నట్లున్నాడు. అతని పెదవులు అస్పష్టంగా ఏదో ఉచ్చరిస్తున్నాయి. కళ్ళల్లో ఆశ్చర్యం, ఆనందం కనిపిస్తున్నాయి. పోగొట్టుకున్న పెన్నిధిని తిరిగి చూసినట్లు షెర్నీ వైపే చూస్తున్నాడు. మంత్ర ముగ్ధుడిలా కనిపిస్తున్నాడు.

"హుష్. చూడకు. కళ్ళు తిప్పుకో, అటు చూడకు" గొణుగుతూ మళ్ళీ హెచ్చరించాడు పవన్.

షెర్నీ ఇటే వస్తోంది.

విజయ్ ఉత్సాహంగా లేచి నిలబడ్డాడు.

"హరిణీ" విజయ్ ఆప్యాయంగా, ప్రేమగా పిలిచాడు.

షెర్నీ పలకలేదు. తనను కాదన్నట్లు నిర్ల

క్ష్యంగా వెళ్ళిపోతోంది.

విజయ్ ఊరుకోలేదు. ముందుకి నడిచి ఆమె దారికి అడ్డు నిలబడ్డాడు.

"హరిణీ బాగున్నావా?" ఆప్యాయంగా, వాత్సల్యంతో అడిగాడు విజయ్.

షేర్నీ కళ్ళల్లో నిప్పులు కురిశాయి.

"ఎవర్రా నువ్వు? నన్ను హరిణి అనటమే కాకుండా నువ్వు అని పలకరిస్తావా?" నిప్పులు కురిపిస్తున్న కళ్ళతో మాటల్ని తూటాల్లా వదిలింది.

"హరిణీ" విజయ్ నిర్ఘాంతపోతూ అన్నాడు.

"షటప్. నా పేరు షేర్నీ."

విజయ్ మరింత నిర్ఘాంతపోయాడు.

"మీది నారాయణపురం కాదా?" అయోమయంగా చూస్తూ అడిగాడు.

"గో టు హెల్. మాది ఏ పురమో చెప్పాల్సిన అవసరం నాకు లేదు. నువ్వు ఇంకా ఎక్కువ మాట్లాడితే, ఈవ్ టీజింగ్ కింద కేస్ బుక్ చేస్తాను" క్రూరంగా చూస్తూ అంది షేర్నీ.

విజయ్ అయోమయంగా చూస్తూ నిలబడిపోయాడు. అతని ట్రాన్స్ అంతా ఒక్కసారిగా వదిలి పోయినట్లయింది. షేర్నీ నిప్పులు కక్కుతూ చూస్తోంది.

"హరిణీ" అన్నాడు అయోమయంగా.

అంతే షేర్నీ ఆడసింహంలా ఒక్క దూకు దూకింది.

"ఏరా, చెపితే అర్థం కాదా?" సింహంలా గర్జిస్తూ అంది. మెరుపు మెరిసినట్లు అమె చెయ్యి పైకిలేచింది. ఏం జరుగుతోందో తెలిసే లోపలే విజయ్ చెంప ఛెళ్ళుమంది.

చుట్టుపక్కల అంతా నిర్ఘాంతపోయారు.

విజయ్ అయోమయంగా చూస్తూ బెంచీ మీద కూలబడ్డాడు.

"నేను చెపితే వినలేదు నువ్వు" అన్నాడు పవన్. విజయ్ వీపు రాస్తూ.

"అది నెంబర్‌వన్ రౌడీ. ఆడగూండా. ఆ పేరు చూడు. షేర్నీట షేర్నీ. ఏమన్నా బాగుందా? పోతే పోనీ. బాధపడకు. మనిషిని పోలిన మనుషులుంటారు" అన్నాడు.

విజయ్ అంటే ఉన్న అభిమానం వల్ల అతను షేర్నీ చేతిలో భంగపడటం పవన్‌కి బాధగా ఉంది. అది డెలికేట్ సిట్యుయేషన్. ఎక్కువ మాట్లాడి, ఓదార్చినా బాగుండదు. ఒక అమ్మాయి తనని అవమానిస్తే ఆ అబ్బాయి ఎంత హర్ట్ అవుతాడో షేర్నీ దయవల్ల ప్రాక్టికల్‌గా తెలిసింది. విజయ్ లాంటి మంచివాడిని ఈసడించి, అవమానించిన షేర్నీ మీద పట్టరాని కోపం వచ్చింది.

"అంత పొగరు ఎందుకు? డబ్బున్న వాళ్ళు ఎంతమంది లేరు. ఈమెకున్న టెక్కు ఎవరికీ లేదు. మనుషుల్ని మరీ పురుగుల్ని చూసినట్లు చూస్తుంది. ఏమనుకుంటుందో ఏమిటో?" కోపంగా అన్నాడు పవన్.

విజయ్ మొహంలో బాధ కనిపించింది.

"వద్దు పవన్! హరిణిని ఏమీ అనకు" అన్నాడు ఆరాధనగా చూస్తూ.

"ఏమీ అనకూడదా? అసలు అది మనిషేనా? దయ్యం. పిశాచి, డెవిల్" అరిచేశాడు పవన్.

మరుక్షణం అతని కళ్ళముందు నక్షత్రాలు కదిలాయి. బలమైన చెంపదెబ్బ.

"విజయ్" నిర్ఘాంతపోతూ అన్నాడు పవన్.

"ఎంతమాట అన్నావురా. హరిణి రాక్షసా? కాదు. హరిణి దేవత. అసలు నువ్వీనాడు ఈ స్థితిలో ఉన్నావంటే కారణం ఎవరు? హరిణి" అన్నాడు విజయ్.

"ఆఁ" పవన్ ఆశ్చర్యపోయాడు.

"అవును పవన్. ఆ రోజు నాన్నగారు నిన్ను రంగయ్య దగ్గర్నుంచి విడిపించి తీసుకొచ్చినప్పుడు ఏమన్నావు. డబ్బు కట్టి ఆ రాక్షసుడి నుంచి తప్పించారు. మీకు జన్మజన్మలకూ ఋణపడి ఉంటాను అన్నావు. అప్పుడు నాన్నగారేమన్నారు ఆ చల్లని పాప వల్ల బాబూ, నేను ఈ డబ్బు తేగలిగింది

అన్నారు, గుర్తుందా? నీ సంగతి విని, కరిగిపోయి, అప్పటికప్పుడు డబ్బు ఇచ్చి, నిన్ను విడిపించుకు రమ్మని కళ్ళనీళ్ళతో చెప్పిన బంగారుతల్లి హరిణిని నువ్వు రాక్షసి అంటావా?" ఆవేశంగా అన్నాడు విజయ్

"విజయ్. ఆమె హరిణి. కానీ ఈమె హరిణి కాదు. షేర్నీ"

"షేర్నీనే హరిణి. ఆ కళ్ళూ, ఆ ముక్కూ అన్నీ నాకు బాగా గుర్తు" అన్నాడు విజయ్.

"కాదూ కాదూ కాదు. హరిణిని నేను గౌరవిస్తాను. ఆమెకంత మంచి మనసు ఇచ్చినందుకు దేవుడికి సాష్టాంగం చేస్తాను. కానీ నువ్వు షేర్నీని హరిణి అనటం మాత్రం నాకు కష్టంగా ఉంది."

విజయ్ పవన్‌వైపు చూశాడు. పవన్ అతణ్ని చూసి చలించిపోయాడు. విజయ్ కళ్ళల్లో నీళ్ళు. అతని మొహంలో దిగులు, ఆత్మీయత, బాధ అన్నీ కలగలిసిన అదోమాదిరి భావం.

"విజయ్" అస్పష్టంగా అన్నాడు పవన్.

"పవన్, మనం వికారాబాద్ వెళ్దాం. రా" అన్నాడు విజయ్.

"దేనికీ?"

"నాన్నగారి దగ్గర హరిణి ఫొటో ఉంది, చూపిస్తాను"

విజయ్ పవన్‌కి ఊపిరి తీసుకునే వ్యవధి కూడా ఇవ్వలేదు. వెంటనే నడిపించుకుంటూ కాలేజ్ బయటకు తీసుకెళ్ళాడు. ఆ కాలేజ్ వికారాబాద్ వెళ్ళే దారిలోనే ఉంది. అక్కడ్నుంచి బోలెడన్ని బస్సులున్నాయి.

వాళ్ళు బస్ ఎక్కి జ్ఞానానందం గారి ఇంటికి చేరుకున్నారు.

హఠాత్తుగా వచ్చిన వాళ్ళని చూసి జ్ఞానానందం గారు ఆశ్చర్యపోయారు

"ఏంటిది? ఉరుములేని పిడుగుల్లా ఊడిపడ్డారు" నవ్వుతూ పలకరించారు.

"చిన్న పనుండి..." నవ్వుతూ చెప్పాడు విజయ్.

"రండి... పాపం ఎండలో వచ్చారేంటి? సాయంత్రం బస్‌లో రాకపోయారా?" జ్ఞానానందంగారి భార్య అంది

"ఏంలేదు. మన పవన్‌కి నా చిన్నప్పటి ఫొటోలు చూపించాలి..." చెప్పాడు విజయ్.

ఇద్దరూ లోపలకు వెళ్ళి మొహం, కాళ్ళూ కడుక్కుని వచ్చి కుర్చీల్లో కూలబడ్డారు.

టీ తాగారు. జ్ఞానానందం గారి భార్య వంట ప్రయత్నాలు చేస్తోంది.

"రా, ఫొటోలు చూద్దాం" అంటూ పవన్ చేయి పట్టుకుని లోపలి గదిలోకి తీసుకెళ్ళాడు విజయ్. బీరువాలో ఆల్బమ్‌లూ, విడి ఫొటోలూ వెతుకుతూ, చివరికి ఒక ఫొటో బయటకు తీశాడు.

"హరిణి ఫోటో ఇదే" అన్నాడు.

పవన్ ఆతృతగా అందుకుని చూశాడు.

ఫోటోలో పదేళ్ళ అమ్మాయి. పట్టులంగా, జాకెట్టు, చక్కగా అల్లిన రెండు జడలు, జడలో పువ్వులు, ఆ అమ్మాయి మొహం చంద్రబింబంలా ఉంది. కళ్ళు వెన్నెల రేఖల్లా ఉన్నాయి. పెదవుల మీద చల్లటి చిరునవ్వు... ప్రశాంతతకీ, సౌమ్యతకీ, మృదుత్వానికీ మారుపేరు ఆ పాప. ఆ పాప మొహం చూస్తేచాలు, చూసేవాళ్ళకూ మనసు ప్రశాంతంగా మారి, హాయిగా జోల పాడినట్లు నిద్రవస్తుంది. ఆరోగ్య దేవత, ఐశ్వర్యదేవతలు ఉన్నట్లుగా, సౌమ్యతకీ ప్రశాంతతకీ కూడా ఒక దేవత ఉండి ఉంటే, ఆ దేవత చిన్నపాప ఆకారం దాల్చి వస్తే, అచ్చం ఇలాగే ఉంటుందేమో అనిపిస్తోంది ఆ ఫోటో చూస్తుంటే.

ఆ కళ్ళు... ఆ ముక్కు... ఆ నోరు అన్నీ షేర్నీవే. ఆ పాపకి షేర్నీ వయసు వస్తే అచ్చం షేర్నీలాగే ఉంటుంది.

"నేను ముమ్మాటికీ చెపుతున్నాను. నో డౌట్. షేర్నీనే హరిణి. నాన్నగారితో నేనూ ఒకసారి వెళ్ళి హరిణిని చూశాను. ఆ కళ్ళు, ఆ ముక్కు అన్నీ నాకు బాగా గుర్తున్నాయి. నేను హరిణిని మర్చిపోలేను. ఆ రోజు అడి

గితే తనే ఫోటో ఇచ్చింది" అన్నాడు విజయ్.

పవన్ విజయ్ చేతిలోని ఫోటోని చూస్తూ ఉండిపోయాడు. చిన్నారి హరిణి చిరునవ్వు లాలికిస్తోంది. ఆ పాపను చూస్తే ఎవరికైనా లేడి కూనలూ, మంచులో తడిసిన మల్లెలూ గుర్తువస్తాయి. అదే షేర్నీని చూస్తే ఆడసింహాలూ, రక్తంలో ముంచి తీసిన గులాబీలూ గుర్తువస్తాయి.

ఏమిటిది? అసలు ఏమిటీ మాయ? ఏంటీ చిక్కుముడి? ఎలా ఈ మిస్టరీని ఛేదించాలి?

"అవునూ... మనం కాలేజ్ రికార్డ్స్‌లో హరిణి డాడీ పేరు చూస్తే సరిపోదూ?" అన్నాడు విజయ్.

"బ్రహ్మాండంగా ఉంటుంది. రేపే ఆ పని మీద ఉంటాను" అన్నాడు పవన్.

మర్నాడు ఆఫీసులో క్లర్క్‌ని బతిమాలి షేర్నీ వివరాలు చూశాడు.

షేర్నీ...

డాటరాఫ్ రామ్‌కుమార్.

అంటే షేర్నీ కృష్ణప్రసాద్ కూతురు హరిణి కాదు.

అతను తన గదికి చేరేసరికి నాలుగైంది. విజయ్ అప్పటికే ఇంటికి వచ్చేసి ఉన్నాడు.

"వచ్చావా? వాళ్ళ డాడీ పేరు కనుక్కున్నావా?" అడిగాడు వెంటనే.

"కనుక్కున్నాను. కృష్ణప్రసాద్ కాదు. షేర్నీ వాళ్ళనాన్న పేరు రామ్‌కుమార్."

అది విని కూడా విజయ్ నమ్మకం సడలిపోలేదు.

"ఎక్కడో ఏదో జరిగింది" అన్నాడు.

"హరిణికి ట్విన్ సిస్టర్ ఎవరైనా ఉందా?"

"ఎవరూ లేరు. హరిణి ఒక్కత్తే."

"మరి ఏం జరిగింది?"

ఆమె హరిణి కాదనుకోవటానికి విజయ్ మనసు అంగీకరించటం లేదు. ఆమె హరిణి అయిఉంటే, తన ఐడెంటిటీని కూడా ఎందుకు పోగొట్టుకుంటోంది?" విజయ్ ఆలోచిస్తూ ఉండిపోయాడు.

పవన్‌కి కూడా ఆమె హరిణి అని తెలిశాక మనసు ఊరుకోవటం లేదు. అసలేం జరిగింది? హరిణి ఎందుకు షేర్నీ అని వ్యవహరిస్తోంది? ఎలాగైనా ఈ మిస్టరీని ఛేదించి, అసలు సంగతి తెలుసుకోవాలి. ఇంతా చేసి ఆమె నిజంగా షేర్నీనే అయితే?

"ఏం చేద్దాం?" అడిగాడు పవన్.

"నాకైతే ఏమాత్రం సందేహం లేదు. ఆమె హరిణే."

"మరి ఏం చేద్దాం" అడిగాడు పవన్.

"ఏముంది? షేర్నీ వివరాలు సేకరించాలి" అన్నాడు విజయ్.

"అది అంత తేలికేం కాదు. గొప్పవాళ్ళే అసలు ఐసోలేటెడ్‌గా బతుకుతుంటారు. అందులో షేర్నీ ఇంకా ఇంకా మనుషులకి దూరంగా ఉంటుంది. ఎవర్నీ ఏ మాత్రం దగ్గరికి రానివ్వదు. మానసికంగా ఆమెకి చేరువయ్యి, ఆమె సంగతులు తెలుసుకునేంత చనువు ఎవరికీ ఇవ్వదు. కాలేజీలో లాభం లేదు" అన్నాడు పవన్.

"సరే. ఇంటి దగ్గర ప్రయత్నిద్దాం."

"అదే, ఎలా అని?"

ఇద్దరూ దగ్గర్లో ఉన్న రెస్టారెంట్‌లో టీ తాగుతూ ఆలోచించారు.

"ఇంటి అడ్రస్ ఉందా?" అడిగాడు విజయ్.

"ఉంది. కాలేజ్‌లో అన్నీ ఒకేసారి నోట్ చేసుకున్నాను. మళ్ళీ మళ్ళీ అడిగితే ఇవ్వరు. దీనికే బోలెడంత బతిమాలించుకుని ఇచ్చాడు" అన్నాడు పవన్.

జేబులోంచి కాగితం తీసి విజయ్‌కి ఇచ్చాడు. విజయ్ అడ్రస్ తీసుకుని చదివాడు.

అపజయం వల్ల నిరాశకు గురి కావచ్చు. కానీ మళ్లీ ప్రయత్నం చేయకపోతే పతనం తప్పదు. – బెవర్లీ సిల్స్

"అబ్బో. బంజారాహిల్స్. మనం బస్సు లోనో ఆటోలోనో ఈ ఇల్లు వెతకటానికి వెళితే ఇక ఇంతే. మా ఫ్రెండ్ నడిగి స్కూటర్ తెస్తాను" అన్నాడు.

"ఓ. కే."

పది నిమిషాల్లో ఇద్దరూ బంజారాహిల్స్ రోడ్డుమీద ఉన్నారు.

వెతికి, వెతికి చివరకి షెర్నీ ఇల్లు పట్టుకో గలిగారు.

అది ఇల్లు కాదు. అసలు అదేంటో బోధ పడలేదు. ముందు పెద్ద గేటు ఉంది. మూసి ఉన్న ఆ గేటులోంచి ఏమీ కనబ డటం లేదు. ఒక పక్క ఇంకో చిన్న గేటు. దాని ముందు ఒక గూర్ఖా కూర్చుని ఉన్నాడు. అతని దగ్గర సెల్ ఫోన్ ఉంది. ఆ గేటులోంచి చూస్తే లోపల ఏముందో కాస్త కనిపిస్తోంది. లోపలంతా పెద్దపెద్ద చెట్లతో అడవిలా ఉంది. ఆ చెట్ల మధ్య ఒక రోడ్డు. ఆ రోడ్డు మీదనుంచి వెళితే దూరాన ఎక్కడో అలవైకుంఠపురములో అన్నట్లు ఒక మేడ అస్పష్టంగా కనిపిస్తోంది. లోపల మిల మిలా మెరుస్తున్న కార్లు. అదంతా చూసి ఇద్దరూ ఆశ్చర్యంగా నోరుతెరిచేశారు.

"హైదరాబాద్ నగరంలో పాష్ లోకాలి టీలో ఇంత స్థలమూ, అంత పెద్ద మేడా. మనం అనుకున్న దానికన్నా వీళ్లకి పెద్దసీనే ఉన్నట్లుంది" అన్నాడు పవన్.

"ఇట్లాంటివి వాళ్లకి ఎన్ని ఉన్నాయో" అన్నాడు విజయ్.

పవన్ ఒక్కసారిగా నిలువునా నీరైపో యాడు. తనకీ, షెర్నీకీ మధ్య ఉన్న అంతరం పెద్ద భూతంలా భయపెట్టింది. షెర్నీ ఇన్ని అంతస్తులు దిగివచ్చి తనను ప్రేమిస్తుందా?

అంతలోనే ఆ మైకంలోంచి బయటప డ్డాడు. షెర్నీ తనను ప్రేమించాలని తను కోరుకోవటంలేదు, తన ప్రేమ ఫలించనీ, ఫలించకపోనీ...

మరి ఎందుకిన్ని తంటాలు పడుతు న్నట్లు? ఎందుకంటే తను షెర్నీని చాలా గాఢంగా, అత్యంత గాఢంగా ప్రేమిస్తున్నాడు కాబట్టి. ఆ ప్రేమవల్ల సహజంగానే ఆమె గురించి అన్నీ తెలుసుకోవాలన్న ఆసక్తి ఉంటుంది. అందుకే వచ్చాడు.

మరొక విషయం కూడా అతడ్ని బాధి స్తోంది. షెర్నీ ఎప్పుడూ నిప్పుతొక్కిన కోతిలా, చిందులు తొక్కుతుంటుంది. చిరాగ్గా ఉంటుంది. అదే ఆమె గొప్ప అను కుంటుందేమో తెలీదు గానీ, ఎన్నడూ అసలు హాయిగా నవ్వినట్లు కూడా కనిపిం చదు. నవ్వటం ఒక భాగ్యం అన్నారు. షెర్నీ తనేదో భోగభాగ్యాలు అనుభవించేస్తు న్నాననుకుంటోంది. కానీ, అసలైన భోగం నవ్వుని పోగొట్టుకుందని ఆమెకి తెలీదు. ఎందుకిలా ఉంది? ఆమె వివరాలు తెలుసు కుని, సాధ్యమైతే ఆమెకి తెలియజెప్పి, ఆమెని మార్చేయాలి. ఇదీ అతని ఉద్దేశం.

ఇద్దరూ స్కూటర్ ఆపి చూడటం గమ నించిన గూర్ఖా గేట్లోంచే "క్యా హోనా?" అని అరిచాడు. అతని అరుపులకి ఎక్క డ్నుంచో భయంకరమైన కుక్కలు వచ్చి అర వటం మొదలుపెట్టాయి.

గూర్ఖాకి ఏం చెప్పాలో ఇద్దరికీ తెలియ లేదు. ఇంకాస్త సేపుంటే అతను అనుమాన పడి పోలీసులకి ఫోన్ చేసినా చేస్తాడు. పోనీ, ఆ షెర్నీ తెలుసని చెపుదామన్నా, అతను వెంటనే షెర్నీకి ఫోన్ చేసి చెపితే, అసలే పిచ్చికోతిలాంటి షెర్నీ సీన్‌ని ఏవి ధంగా టర్న్ చేస్తుందో తెలీదు.

"కుఛ్‌నై..." అనేసి వెంటనే అక్కడ్నుంచి తుర్రుమన్నారు.

మర్నాడు రామ్‌కుమార్‌కి ఉన్న ఫాక్టరీకి వెళ్లి, ఎంక్వైరీ చేశారు. ఎక్కడా చిన్నమెత్తు సమాచారం కూడా దొరకలేదు.

"అమ్మ బాబోయ్. అసలు వీళ్లేం మను షులు? ఇంత సీక్రెసీ ఎలా మెయిన్‌టైన్ చేస్తున్నారు"

పవన్ ఆశ్చర్యపోయాడు.



"సీక్రెసీ కాదు. పబ్లిక్ మెమొరీ ఈజ్ షార్ట్ అన్నారు. మనం హరిణి షేర్నీ అవునా కాదా అని కదా తెలుసుకోవాలను కుంటున్నాం. అది తెలియాలంటే పదేళ్ల క్రితం సంగతులు తెలిసినవాళ్ళుండాలి. ఆ విషయాలు తెలిసినవాళ్ళు ఇంకా అక్కడ పని చేస్తూ ఉండాలి. వాళ్ళు మనకు కోప రేట్ చేసి చెప్పాలి. ఇవన్నీ ఒక్క రోజులో తెలిసిపోవాలంటే కుదరదు. అలాంటివాళ్ళు లేకపోతే, అసలే సాధ్యపడదు కూడా" అన్నాడు విజయ్.

ఇద్దరూ మౌనంగా ఆలోచిస్తూ ఉండిపో యారు. హఠాత్తుగా విజయ్‌కి ఒక ఆలోచన వచ్చింది. ఎలాంటి మనుషులైనా ఇంట్లో తమ వాళ్ల జ్ఞాపకాల్ని ఉంచుకోక మానరు. షేర్నీయే హరిణి అయి ఉంటే తన చిన్న నాటి ఫొటోలో, లేకపోతే తన తండ్రి ఫొటోనో ఉంచుకోక మానదు. ఒక్కసారి ఆమె ఇంటికి వెళ్లగలిగితే చాలు. ఇల్లంతా తిరిగి చూస్తే, ఏదో ఒక ఆధారం దొర కకపోదు.

తన ఆలోచన పవన్‌కి చెప్పాడు.

"రాత్రిపూట గూర్ఖాకి తెలీకుండా గోడ దూకితే?" అన్నాడు పవన్.

"అదేమన్నా పిట్టగోడా, దూకి వెళ్ళటానికి. కోటగోడలా ఉంది. అంతెత్తు గోడకి గాజు పెంకులూ, సోడా సీసా ముక్కలూ ఏవేవో అతికించారు. ఆ పైన కుక్కలు, పదో పన్నెండో ఉన్నట్లున్నాయి. వెంట పడ్డా యంటే, మనం హూ లెట్ ది డాగ్స్ ఔట్ పాటలోలాగా పరుగెట్టుతూ, పాడుతూ, పారిపోవాల్సిందే. ఇవేవీ నన్ను భయపెట్ట వులే కానీ మన ప్లాన్ ఫలించదని స్పష్టంగా తెలిసిపోతుంటే ఇంకా ప్రయత్నించటం దేని కని. అంతే" అన్నాడు విజయ్.

"సాహసం నా ఊపిరి. నేను ఈ రాత్రికే షేర్నీ ఇంటిగోడ దూకి తీరుతాను" అన్నాడు

పవన్.

"అక్కడ షెర్నీ రెడీగా ఉండి, రీమాసేన్ లాగా 'పిట్టగోడ దూకి నువ్వు రావయ్యా' అని పాడదు. జాగ్రత్తగా కాపలా కాసే గూర్ఖా, మీద పడి కరిచే కుక్కలు..."

'అవన్నీ నేను ఆలోచించదల్చుకోలేదు. నీకు భయమైతే నువ్వు రాకు. నేను ఒక్కడినే వెళ్తాను" అన్నాడు పవన్.

నిజంగానే అతనేమీ ఆలోచించే స్థితిలో లేడని విజయ్‌కి అర్థమైపోయింది.

"వద్దు పవన్. వద్దు. అవి కుక్కలు కావు. సింహాలు. చీల్చిపారేస్తాయి. నేనింకో ఉపాయం చెపుతాను. విను"

"ఏంటది? "

విజయ్ చెప్పిన ఉపాయం విని పవన్ ఎగిరి గంతేశాడు.

"ఇది కూడా రిస్క్‌తో కూడినదే. కానీ నువ్వు అస్సలు మాట వినేట్లు లేవని ఇలా చెయ్యాల్సి వస్తోంది. ఏమాత్రం తేడా వచ్చినా ఇద్దరికీ డేంజర్" అన్నాడు.

"లేదు. నాకిది చాలా నచ్చింది" అన్నాడు పవన్.

★ ★ ★

షెర్నీకి కార్లు ఉన్నట్లే, డ్రైవర్లూ ముగ్గురున్నారు. లక్కీగా ఆరోజు వచ్చిన డ్రైవర్ కాస్త అమాయకుడే. కొత్తగా వచ్చాడు కాబట్టి షెర్నీ అంటే ఇంకా పూర్తి భయం ఏర్పడినట్లు లేదు. షెర్నీ వచ్చేలోపల డోర్ తెరిచి బయట నిలబడి పేపర్ చదువుకుంటున్నాడు. అది ఊరి బయట కాలేజ్ కాబట్టి గాలి చాలా బ్రహ్మాండంగా వీస్తూనే ఉంటుంది. గాలికి పేపర్ ఎగిరిపోయింది. అతను దాన్ని పట్టుకోవటానికి పరుగెత్తాడు. అదునుచూసి పవన్, విజయ్ ఇద్దరూ డిక్కీలో దూరారు. డిక్కీ విశాలంగా ఉంది.

అయిదు నిమిషాలు అయ్యాయో లేదో షెర్నీ డ్రైవర్ మీద తిట్ల వర్షం కురిపిస్తూ కారు ఎక్కడం వినిపించింది. కారు స్టార్ట్ అయి ముందుకి సాగిపోయింది.

కారు షెర్నీ ఇంట్లోకి ప్రవేశించటం తెలుస్తూనే ఉంది వాళ్ళకి.

కారు పోర్టికో దాకా వచ్చింది. ఇద్దరూ చల్లగా డిక్కీ పైకెత్తి, కిందకు దిగిపోయారు. పోర్టికో పక్కనున్న గుబురులోకి జారుకున్నారు. ఎక్కడ్నుంచో కుక్కలు అరుచుకుంటూ రావటం వినిపించింది. ఇద్దరికీ గుండె గుభేల్‌మంది.

"ఏయ్. నిక్కీ, టామీ, రిక్కీ... ఎందుకలా అరుస్తారు? రండి, రండి" అంది షెర్నీ.

కుక్కలు ఇంకా మొరుగుతూనే ఉన్నాయి. భయంకరంగా అరుస్తూ పొదవైపుకి రాబోయాయి.

ఇంతలో...

"నిక్కీ... టామీ... హుష్. సైలెన్స్... సైలెన్స్ గో గో" అన్న స్వరం వినిపించింది.

కుక్కలు మంత్ర ముగ్ధల్లా ఆ గొంతు వినిపించిన వైపు చూశాయి.

పవన్, విజయ్ కూడా అటు చూశారు. అక్కడ ఒక స్త్రీ నిల్చుని ఉంది. నలభైల్లో ఉన్న స్త్రీ. ఒకప్పుడు మహా అందగత్తె అయి ఉండాలి. ఆ ఛాయలు ఆమెని ఇంకా వీడి పోలేదు. అందంకన్నా అహంకారం, దర్పం ఆమె మొహంలో కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. షెర్నీ పోలికలు బాగా ఉన్నాయి. ఆమె కట్టుకున్న చీరె, పెట్టుకున్న నగలు, ఆఖరికి ఇంట్లో వేసుకున్న చెప్పులు కూడా ఆమె ఠీవికీ, దర్పానికీ ప్రతీకల్లా ఉన్నాయి.

"మమ్మీ" షెర్నీ ఆమెని చేతుల్తో చుట్టేసింది. "నా తల్లి. నా షెర్నీ... నా రాణి. నా షెర్నీ" అంది ఆ స్త్రీ షెర్నీని ఇంకాస్త దగ్గరకి తీసుకుంటూ.

మొట్టమొదటిసారిగా షెర్నీలో కనిపిస్తున్న ఆప్యాయత అనురాగం... పవన్ ఆశ్చర్యంగా చూశాడు.

కుక్కలు మళ్ళీ మొరిగాయి. "మమ్మీ. వీటికేదో అయింది ఇవాళ. లాభంలేదు. కట్టేయాలి" అంది షెర్నీ.

"రంగన్నా... రాజేశ్వర్..." షెర్నీ మమ్మీ పిలిచింది. అది పిలవటం కాదు, ఉరమటం.

ఇద్దరు నౌకర్లు చాలా బలిష్టంగా ఉన్న వాళ్లు పరుగెత్తుకుంటూ వచ్చారు.

"వీటిని కట్టేయండి" ఆజ్ఞాపించింది ఆ స్త్రీ.

మౌనంగా, వినయంగా తల ఊపారు వాళ్లు. వాటిని తీసుకుని వెళ్లారు.

ఏం చేయాలో తెలీక ఆ పొద చాటునే దాక్కున్నారు పవన్, విజయ్. అప్పుడప్పుడూ నౌకర్లు అటూ ఇటూ తిరుగుతూనే ఉన్నారు. షెర్నీ స్నానం చేసి, నైటీ వేసుకుని, గార్డెన్లో చక్కర్లు కొట్టింది.

రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో మళ్లీ లోపలకు ఒక కారు వచ్చింది. అందులోంచి అందంగా ఉన్న యాభై ఏళ్ల వ్యక్తి దిగాడు.

"ఆయనేనా కృష్ణప్రసాద్" గుసగుసగా అడిగాడు పవన్.

"కాదు" చిన్నగా చెప్పాడు విజయ్. మరి కృష్ణప్రసాద్ ఎక్కడున్నాడు?

ఆయన లోపలికి వెళ్లిపోయాడు. నౌకర్లు ఆయన వెంట నడిచారు.

అప్పటికి ఇంట్లో సర్వెంట్ క్వార్టర్స్‌లో ఉన్న తోటమాలీ, వాచ్‌మాన్, వంటమనిషీ, వాళ్ల ఫ్యామిలీలంతా భోజనం చేసేసి నిద్రకి సిద్ధంగా ఉన్నారు.

షెర్నీ ఇంట్లో అంతా భోజనాలు చేసి పడుకునేసరికి రాత్రి పదకొండు దాటింది. లైట్లు ఒక్కొక్కటే ఆరిపోతున్నాయి.

అదే అదను అనిపించింది పవన్, విజయ్ లకి. వెంటనే మెల్లగా ఇంట్లోకి వచ్చేశారు.

పెద్ద పెద్ద అద్దాల తలుపులు దాటాక హాల్. పెద్ద హాల్ నిండా సోఫాలు నిండుగా ఉన్నాయి. మరోవైపు డైనింగ్ హాల్. మధ్యలో పైకి వెళ్లటానికి మెట్లు. అంతా ఖరీదైన పాలరాయి, మేలిరకం టేకు పనితనం...

ఎవరో వస్తున్న అలికిడి...

ఇద్దరూ గభాల్న ఒక మూలకి తప్పుకున్నారు. ఆ మూల కిందికి వెళ్లేందుకు మెట్లు ఉన్నాయి.

"ఎక్కడ వెతుకుదాం? " అన్నాడు.

"ముందు షెర్నీ గది"

హాల్‌లోని షోకేస్‌లాంటిదేదీ లేదు. ప్రతి మూలా ఒక సింహం బొమ్మ ఉంది. ఆ సింహం బొమ్మలు ఎంత సజీవంగా ఉన్నాయంటే, నిజం సింహాలే కూర్చున్నట్లు ఉన్నాయి. వాటిని చూడగానే గుండె ఝల్లుమంటోంది.

ఒకమూల పెద్ద ఈగిల్ బొమ్మ ఉంది. దాని రాక్షస పంజాలో చిక్కిన పావురం మెడలోంచి రక్తం కారుతోంది. ఆ గరుడపక్షి మొహంలో క్రూరత్వం, పావురం మొహంలో దీనత్వం. ఆ బొమ్మ చేసిన శిల్పి చక్కగా మలిచాడు.

చిరుతపులి, హైనా, సింహం పాములు, రాక్షసి బల్లులు... ఇంటినిండా అనేక రకాల క్రూర జంతువుల బొమ్మలు. కొన్ని ఎంత జుగుప్స కలిగిస్తున్నాయంటే, వాటిని చూస్తే వాంతి వచ్చేస్తోంది.

"లాభం లేదు. వీళ్లెవరో శాడిస్టులలాగా ఉన్నారు" అన్నారు పవన్.

భూచరాలూ, జలచరాలూ, ఉభయచరాలూ, పక్షులూ... అన్నిటిలోనూ కేవలం క్రూరజంతువుల బొమ్మలు మాత్రమే అక్కడున్నాయి.

ఏంతో వింతమనుషులు..

కిటికీలోంచి గార్డెన్ వ్యూ కనిపిస్తోంది. గార్డెన్లో అక్కడక్కడా దీపాలు. వాటి వెలుగులో గార్డెన్లో ఉన్న చెట్లు, మధ్య మధ్య బొమ్మలూ కనిపిస్తున్నాయి. ఆ బొమ్మలు కూడా సాధారణంగా గార్డెన్లలో కనిపించే నీళ్లు పోసే బొమ్మలూ, పిల్లల బొమ్మలూ కావు. ఊటెపట్టుకున్న మనిషీ, బల్లెం పట్టుకున్న వీరుడూ, కత్తి ధరించిన శూరుడూ లాంటివే. ఇంటిలోపల అమర్చిన డెకొరేషన్ ప్లాంట్స్ కూడా అన్నీ ఎడారిమొక్కలే. బ్రహ్మజెముడూ, నాగజెముడూ ఇంకా

పేర్లేవో తెలీని ముళ్లపొదలు.

రంగన్న దీపాలన్నీ ఆర్పేశాడు. అంతా చీకటి నిశ్శబ్దం. అసలే ఒకదానికొకటి సంబంధం లేని ఇళ్లు. అందులోనూ షెర్నీది చాలా పెద్ద స్థలం ఉన్న ఇల్లు. నిశ్శబ్దం... చీకటి... భూతగృహం లాంటి ఆ కొంప... వింత మనస్తత్వపు మనుషులు.

ఒక్కొక్క గదినే మెల్లగా చూసుకుంటూ పిల్లుల్లా అడుగులు వేస్తూ వస్తున్నారు. ఎంత చూసినా ఆ ఇల్లు తరగటంలేదు. ఎగుడు దిగుడుగా కట్టిన ఇల్లు. ఒక గది పైకి, ఉంటే, మరో గది కిందికి ఉంది.

వింత పిల్లుల్లా అడుగులు వేస్తూ వస్తున్నా జరిగే ప్రమాదం జరగనే జరిగింది.

ఒక హాల్‌లోకి వచ్చేసరికి అక్కడ ఒక పెద్ద కొండచిలువ బొమ్మ ఉంది. అది ఎంత సహజంగా, భయంకరంగా ఉందంటే, విజయ్ దాన్ని చూసి నిజం పాము అనుకున్నాడు. గుహలాంటి నోరు భయంకరంగా తెరిచి, అమాంతం మింగేద్దామా అన్నట్లు చూస్తున్న ఆ కొండచిలువని చూడగానే ఒక్కసారిగా అదిరిపడి, పక్కనున్న స్టూల్‌కి తగిలాడు.

అంతే ఖణేళ్‌మన్న శబ్దం.

నిక్కీని వదిలేశారులా ఉంది.

భౌ, భౌమని అరుపు

కుక్క వేగంగా దూకుతూ ఇటే వస్తున్న శబ్దం.

"అయిపోయాంరా" అన్నాడు విజయ్. నిక్కీ వేగంగా సింహంలా దూకి, దూకి వచ్చేస్తుంది. పవన్ కూడా తమపని అయిపోయిందనే అనుకున్నాడు.

కానీ అదృష్టం.

అంతలోనే నిక్కీ అని వారిస్తున్న స్వరం...

ఆ గొంతు షెర్నీదే.

ఏమిటీ షెర్నీ? పన్నెండయినా నిద్రపోదా? "నిక్కీ, కమాన్. హరియప్" షెర్నీ స్వరానికి మంత్రముగ్ధ అయిన సర్పంలా తలవంచుకుని వెళ్ళి ఆమెని అనుసరించి నడుస్తోంది నిక్కీ.

"బతికాం" అన్నాడు విజయ్.

"అంతే. జాగ్రత్త. చూసుకొని అడుగులు వెయ్యి" అన్నాడు పవన్ గుసగుసగా.

"ఏం వేస్తాం? ఇది చూస్తే దెయ్యాల బంగ్లాలా ఉంది. ముగ్గురు మనుషులకి ఇంత ఇల్లా? అయినా ఇదేం ఇల్లు?" అన్నాడు విజయ్.

ఇల్లంతా తిరిగినా ఒక్క ఫొటోగానీ, చిత్రపటంలాంటిది కానీ కనిపించలేదు. మనుషులవి కానీ, దేవుళ్ళవి కానీ, పూలలాంటివి గానీ ఫొటోలూ, పెయింటింగ్స్ ఏవీ లేవు. వాళ్ళకి జీవులంటే తామూ, క్రూరజంతువులూ తప్ప మరోటి ఉన్నట్లు ఆలోచన లేదనిపించింది.

"వీళ్ళకి కూడా పెద్దవాళ్ళంటూ ఎవరో ఒకరు ఉండే ఉంటారు కదా. కనీసం వాళ్ళ ఫొటోలు కూడా లేవు" అన్నాడు విజయ్.

"ఫొటో ఆల్బమ్‌ల లాంటివి బీరువాల్లో దాచుకున్నారేమో" అన్నాడు పవన్.

"అంతే అయ్యుండాలి".

ఇద్దరికీ నిరాశగా ఉంది. దుర్భేద్యమైన కోటలాంటి ఆ ఇంట్లోకి రావటమే కష్టం. ఎలాగో ఒకలా వచ్చిపడ్డాక కూడా ఏ ఆధారాలూ దొరకక నీరసంగా అనిపించింది. ఇంత శ్రమా వృధాయేనా! ఏం చేయ్యాలి?

డైనింగ్ హాల్‌లో ఒక షోకేస్ ఉంది. టీసెట్లూ, డిన్నర్ సెట్లతో పాటు రకరకాల కత్తులూ, చాకులూ కఠార్లూ ఉన్నాయి. ఆధునికంగా ఉన్న కిచెన్‌కి ఆనుకొని మరో గది ఉంది. అందులో వేటకత్తులూ, విచ్చుకత్తులూ, కొడవలీ లాంటివి ఉన్నాయి.

"వీళ్ళ దగ్గర పిస్టల్ లైసెన్స్ కూడా ఉండే ఉంటుంది. అసలే పిచ్చి వాలకంగా ఉన్నారు. తిక్కలేచి మనల్ని పేల్చినా పేల్చి పారేస్తారు. పోదాం పద" అన్నాడు విజయ్.

"అన్నిటికీ తొందరేనా? ఇంత కష్ట పడి వచ్చింది పేల్చేస్తారని భయపడి పారిపోవటానికా? మన అన్వేషణ ఇంకా ఫలించనేలేదు"

అన్నాడు పవన్.

ఇద్దరూ మెల్లగా ఆ చీకట్లోనే కన బడ్డ చోటల్లా చూస్తున్నారు. తిరిగి తిరిగి మళ్ళీ హాల్‌లోకి వచ్చారు.

ఇంతలో మేడమీద అలికిడి. ఇద్దరూ భయంగా ఒక మూలకి తప్పు కున్నారు.

అంతటా నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ మేడమీద అడుగుల చప్పుడు.

షేర్నీ మమ్మీ మెట్లు దిగి వస్తోంది.

ఆమె తెల్లటి నైటీ ధరించి ఉంది. జుట్టు విరబోసుకుని ఉంది. దగ్గర పడ్డప్పుడు ఆమె మొహం ఆ చిరుచీ కట్లో అస్పష్టంగా కనిపిస్తోంది. ఆ మొహంలో క్రౌర్యంతో పాటు కోపం కూడా కనిపిస్తోంది. ఏదో భావాన్ని బలవంతంగా అదిమిపెట్టినట్లు ఆమె మొహం కొద్దిగా ఉబ్బి, ఇంకాస్త క్రౌర్యంగా కనిపిస్తోంది. చీకట్లో నడికి వస్తున్న ఆమె పిశాచంలా అనిపి స్తోంది. ఎందుకో ఆమెను చూడగానే విజయ్‌కి భయంవేసింది.

ఆమె చరచరా భూగృహం లోకి నడిచి వెళ్ళిపోతోంది.

అప్రయత్నంగా ఆమెని అనుసరిం చారు ఇద్దరూ. ఆమె లోపలికి నడి చింది. అక్కడ భూగృహంలో ఒక పెద్ద గది ఉంది. ఆ గదిలో ఏమీలేవు. నాలుగు వైపులా గోడలు మాత్రం ఉన్నాయి. ఆమె ఒక గోడదగ్గర ఆగింది. ఏదో స్విచ్‌ని నొక్క గానే ఒక బోర్డు ప్రత్యక్షమైంది. ఆ బోర్డు మీద నెంబర్లున్నాయి. ఆమె ఏవో నెంబర్లు నొక్కగానే గోడ తెరుచుకుంది.

పవన్ విజయ్ ఇద్దరూ ఆశ్చర్యపోయి చూస్తున్నారు.

## మర్యాద



మునిమాణిక్యం ఓ సాయంత్రం సైకిలు నడిపించుకుపోతుంటే కానిస్టేబుల్ సైకిలుకు లైటేదంటూ నిలదీశాడు.

'లైటులేదనే నడిపిస్తున్నాను.. లేకుంటే ఎక్కేపోతానుగా' అన్నారు మునిమాణిక్యం.

'కాదు నన్నుచూసి నడిపిస్తున్నావ్! నేనలా పోగానే సైకిలెక్కి తుర్రుమంటావ్' అన్నాడు కానిస్టేబుల్. అయితే చివరి పదానికి బూతుమాట జోడించి మరీ అనడం మునిమా ణిక్యాన్ని బాధించింది.

'పెద్దాళ్లతో మాట్లాడే తీరిదేనా? పద.. ఎస్సైకి చెబుతా నీగురించి' అని అతన్ని వెంట పెట్టుకుని స్టేషన్‌కు వెళ్లి ఎస్సైతో విషయ మంతా చెప్పారు. ఎస్సై మునిమాణిక్యం మాజీ శిష్యుడే. జరిగిందానికి అతను నొచ్చు కుంటూ 'పెద్దోళ్లతో మర్యాదగా ఉండాల్రా ..కొడుకుల్లారా? అని ఎన్నిసార్లు ఈ ..కొడు కిలికి చెప్పినా అర్థంకాదండీ' అంటూ పంచాంగం విప్పేసరికి మునిమాణిక్యం చెవులు మూసుకున్నారు.

లోపల ఏముంది? ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ళకి కనబడకుండా దాచిన నిధినిక్షేపాలా? లేక తాతల నుంచి సంక్రమించిన మణిమాణి

క్యాలా? ఏమున్నాయి అందులో? సినిమాల్లో చూపించినట్లు కళ్ళు మిరుమిట్లుకొలిపే కాంతితో మణులూ, బంగారు కడ్డీలూ కనిపిస్తాయా? లేకపోతే ఏ మాదక ద్రవ్యాలో స్మగ్లింగ్ చేస్తున్నారా? అసలు ఏముంది అందులో?

ఇద్దరూ కళ్ళు చిట్లించే పెద్దవిచేసి చూశారు.

అక్కడ ఏమీలేదు. ఒక నిలువెత్తు పటం మాత్రం ఉంది. అది ఎవరితో ఏమిటో ఏమాత్రం కనబడటంలేదు ఇక్కడికి.

దగ్గరకి వెళ్తే ఆమె పసికడుతుందని భయం. ఇంతకీ ఆమె ఇక్కడ ఏం చేయబోతోంది?

"మనిద్దరినీ చంపేసి ఇక్కడ పారేసినా కనుక్కునే దిక్కులేదు" అన్నాడు విజయ్ గుసగుసగా.

"ఊరుకో. అలా ఏం జరగదు" అన్నాడు పవన్. ఆమె ఏం చేస్తుందోనని ఇద్దరికీ ఆతృతగా ఉంది.

అపరాత్రివేళ ఇలా భూగృహంలోకి రావటం, ఏదో పటం ముందు నిలబడటం... ఇదంతా ఏమిటి? ఏదన్నా క్షుద్ర పూజ గానీ నిర్వహించబోవటం లేదు కదా?

ఇద్దరూ అలా కళ్ళు వెళ్ళబెట్టుకుని చూస్తూండగానే...

ఆమె ఉన్నట్లుండి నేలమీద కూలిపోయింది. ఆమె ఒళ్ళు కంపించిపోతోంది.

ఇద్దరూ ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు. ఇంతలోనే ఆమె లేచి నిలబడింది. మళ్ళీ నెంబర్లు నొక్కగానే పటం మూసుకుపోయింది.

ఆమె వెళ్ళిపోతోంది. ఇప్పుడు ఆమె నడకలో ఆ వేగం, విసురూ లేవు. మెల్లగా వెళ్ళిపోయింది.

ఆమె వస్తుంటే ఇద్దరూ మళ్ళీ తప్పుకుని, హాల్లో దాక్కున్నారు. ఆమె కనుమరుగు అయిందాకా చూసి ఇద్దరూ భూగృహంలోకి పరుగెత్తారు. పిచ్చిగా మీట నొక్కారు. ఊహకి వచ్చిన నెంబర్లన్నీ నొక్కారు.

గోడ తెరుచుకోలేదు.

నొక్కి నొక్కి ఇద్దరికీ అలుపు వచ్చేసింది.

" ఇక నా వల్ల కాదు బాబూ" అన్నాడు విజయ్ కిందకి వాలిపోయి. ఇక లేవలేక అలాగే కూర్చుండిపోయాడు.

పవన్‌కి కూడా తమ శ్రమ అంతా వృథాప్రయాసే అనిపించింది. అయినా ఏదో ఆశతో ఇంకాస్సేపు గడిపారు.

"ఇందులోనే ఏదో రహస్యం ఉంది" అన్నాడు పవన్.

"ఏమో బాబూ. వీళ్ళని చూస్తే నాకు ఏ క్షుద్రపూజలో చేసేరకాల్లా కనిపిస్తున్నారు. ఈమె హరిణి కాదు. హరిణి ఇలా ఎందుకుంటుంది? నా భ్రమ" అన్నాడు విజయ్.

"నేనేదో కథలో చదివాను. యాక్సిడెంట్ అయి మొహం అంతా నుజ్జునుజ్జు అయిపోతే, వేరే మనిషి మొహం తెచ్చిపెడతారు. ఆ మనిషి మొత్తం ఆ మొహం తాలూకు మనిషిలాగే ఉంటాడు. అలాటి స్టోరీ ఏమో ఇది" అన్నాడు పవన్.

"ఏమో. లేకుంటే ఏ క్షుద్రదేవతనో ఆరాధించి, అలాటి మొహాలు తెచ్చుకున్నారో ఏంటో? వీళ్ళయితే మామూలు మనుషులు కారు. అసలు మనుషులేనా? లేకపోతే ఏ యక్షులో, రాక్షసులో సరదాకి మనిషి వేషంలో తిరుగుతున్నారా? "

ఇద్దరూ మాటల్లో పడి, పొంచి ఉన్న ప్రమాదం అసలు గమనించలేదు.

నిక్కీ భయంకరంగా మొరగటం మళ్ళీ వినిపించింది.

"ఏమైంది? " షెర్నీ మమ్మీ అడుగుతోంది.

"ఏమో. దీనికివాళ ఏమైందో ఏంటో?

ప్రపంచమే నాదేశం - మంచితనమే నా మతం. – థామస్ పేన్

ఊరికే అరుస్తోంది"

"కుక్క ఊరికే ఎందుకరుస్తుంది. ఎవ రన్నా దొంగ రాలేదు కదా? పోనీ నిక్కీని వదిలేద్దాం" అన్న మాటలు విన్పించాయి.

"చచ్చాంరా నాయనా. ఇక్కడ చూస్తే ఏ ఆధారాలూ దొరకలేదు. అక్కడ చూస్తే కుక్కని వదిలేస్తున్నారు. అది పీకిందంటే అంతే. పద, పద. దానికి చిక్కకముందే పారిపోదాం" తొందరపెట్టాడు విజయ్.

పవన్‌కి కూడా అదే మంచిదనిపించింది. ఇక్కడ ఎంత వెతికినా ఏమీ లాభం లేకుండా ఉంది. ఇక ఇక్కడ ఉండటం అన వసరం

"మిగతా కుక్కల్ని వదిలేసినా ఈ నిక్కీ మాత్రం ఇల్లంతా తిరుగుతోంది. ఈ ఇంట్లో దానికి స్పెషల్ ట్రీట్‌మెంట్‌లా ఉంది" అన్నాడు విజయ్.

ఈ ఇంట్లో దాని పొజిషన్ ఏంటో, పవర్ ఏంటో మనకనవసరం. ఇప్పుడు మన ముందు ఉన్న టాస్క్, దానికి దొరకకుండా పారిపోవటం అంతే" అన్నాడు పవన్.

మెల్లగా లేచి, కుక్క ఎక్కడుందా అని చూసుకుంటూ నడుస్తున్నారు.

పిల్లుల్లా నడుస్తూ కాంపౌండ్ వాల్ దాకా వచ్చారు.

వాచ్‌మాన్ లోపల ఉన్నట్లున్నాడు. గేటు దగ్గర ఎవరూ లేరు.

విజయ్ బయటకి దూకేశాడు. పవన్ సరిగ్గా గేటు ఎక్కి దూకపోతుండగా.... ఎక్కడి నుంచి వచ్చిందో గానీ, నిక్కీ వచ్చేసి, అమాంతం అతని షర్ట్ పట్టేసింది.

పవన్‌కి ఏంచెయ్యాలో తెలియలేదు. మొత్తం మతిపోయినట్లు మహా తికమకగా ఉంది. ఎట్లాగో తెలివి తెచ్చుకుని, షర్ట్‌ని ఊడదీసేసి ఒక్క ఎగురు ఎగిరి గేటుమీద నుంచి రోడ్డు మీదికి ఒక్క దూకు దూకాడు. కిందపడి, మళ్లీ అరక్షణంలో లేచి, ఒంట్లోని శక్తి మొత్తం కాళ్లల్లోకి తెచ్చుకుని ఒక్క పరుగు తీశారు. మెయిన్ రోడ్డు మీదికి ఎలా వచ్చిపడ్డారో వాళ్లకే తెలీయదు. అవ సరం అన్నీ నేర్పుతుందేమో అనిపించింది పవన్‌కి. లేకుంటే తనేంటి, అంత సాహ సంగా ఆ ఇంట్లోకి వెళ్లటమేంటి, ఆ తర్వాత నిర్భయంగా ఆ ఇల్లంతా తిరగటం ఏమిటి? అంతేకాకుండా ఆ భయంకరమైన కుక్కల్ని తప్పించుకుని, పారిపోయి రావటం ఏమిటి?

విజయ్‌కి కూడా అదే అనిపించినట్లుంది. పవన్‌వైపే చూస్తున్నాడు.

వాళ్లు అప్పటికే పరుగెత్తి, పరుగెత్తి, చాలా దూరం వచ్చేశారు. షెర్నీ ఇంటి నుంచి ఎవరూ వాళ్లని అనుసరించి వచ్చిన ఛాయలు లేవు. ఇంట్లోకి ఎవరో అపరిచి తులు ప్రవేశించినట్లు నిస్సందేహంగా వాళ్లకి తెలిసిపోయి ఉంటుంది. అయినా ఎందుకు పట్టించుకోలేదు? పట్టుకునే ప్రయత్నాలు ఎందుకు చేయలేదు?

షెర్నీ అసలు ఎవరు? ఆలోచిస్తున్నాడు పవన్. విజయ్ పవన్ వంక చూస్తున్నాడు. అతనిలో ఏవేవో దర్శించగలుగుతున్నాడు.

చిన్న బాబు... కాలికి గొలుసులు - బందీగా జీవితం గడుపుతూ, యజమానికి వెట్టిచాకిరీ చేస్తున్న బాలుడు.... ఆ తర్వాత అందులోంచి బయటపడి జీవితం అంటే తెలుసుకున్న జ్ఞాని, విద్యా, విజ్ఞాన ఖని. ఇన్నాళ్లూ అతనిలో ఒక తాత్వికుడినీ, జ్ఞానినీ మాత్రమే చూసిన విజయ్‌కి ఇప్పుడు పవన్‌లో అద్భుత ప్రేమికుడు కనిపిస్తు న్నాడు. ప్రేయసి కోసం ఏ సాహసానికైనా సిద్ధం అయిన అపూర్వ ప్రేమికుడిని అత నిలో చూడగలిగాడు విజయ్.

ఇద్దరూ రొప్పుతూ నిలబడ్డారు.

"అసలు అదేం ఇల్లు. బంజారాహిల్స్‌లో ఎన్నో ఇళ్లున్నాయి. లేటెస్ట్ డిజైన్లవీ, పాత కాలం మేడలూ అన్నీ ఉన్నాయి. కానీ ఇదేంటి. ఏదో మాయామహల్‌లా ఉంది" అన్నాడు విజయ్.



అతనికి తను చదివిన 'మొగల్ దర్బార్ కుట్రలు' అనే పుస్తకం గుర్తుకు వచ్చింది. అందులో అంతఃపురం స్త్రీలు మగవాళ్లని పిలిపించుకుని, చంపి, పక్కనే ఉన్న కందకంలో పడేస్తుంటారు. అక్కడంతా మాయలూ, మంత్రాలూ ఉన్నాయనుకుంటారు గానీ, చివరకు అవన్నీ ఆ సౌధాలు కట్టిన శిల్పులు రకరకాల సొరంగాలూ, రహస్య మార్గాలూ ఏర్పరచటంవల్ల ఏవీ బయటకు రాలేదని తెలుస్తుంది.

షెర్నీ కూడా అదే కోవ మనిషా?

"ఏంటి ఆలోచిస్తున్నావు? " అడిగాడు పవన్.

"నా పిచ్చిగానీ పూలు పదునైన రాళ్ళవుతాయా? కావుగాక కావు. షెర్నీ హరిణి ఎలా అవుతుంది? అంతా నా పిచ్చి. అనవసరంగా సందేహపడుతున్నామేమో అనిపిస్తోంది" అన్నాడు విజయ్.

"నాకు మాత్రం ఇప్పుడు నిజంగా షెర్నీనే హరిణి అని అనుమానం కలుగుతోంది"

ఆ ఇల్లు చూశావా? అది చూస్తేనే అందులో నివసిస్తున్న వాళ్ళ క్రౌర్యం అర్థమవుతుంది. అక్కడ పెరిగితే నువ్వూ, నేనూ కూడా అలాగే అవుతాం" అన్నాడు పవన్.

ఇద్దరూ ఇంటికి వచ్చారు.

"ఏం చేద్దాం? " అన్నాడు విజయ్.

"ఒకసారి నిర్ణయం తీసుకున్నాక ఇంక వెనక్కిపోను. ఈ షెర్నీ ఎవరో కనుక్కుని తీరుతాను" అన్నాడు పవన్ మొండిగా.

"ఓ. కే. కానీ ఎలాగ? "

"ఇటు నుంచి లాభం లేదుగానీ, అటు నుంచి నరుక్కు రావాలి" అన్నాడు పవన్.

"ఎటు నుంచి? "

"నారాయణపురం నుంచి" అన్నాడు పవన్.

"నీ మొహంలా ఉంది. నారాయణపురం ఉంటే నేను వెంటనే అక్కడికే పోయేవాడి

నిగా. ఇక్కడ ఈ భూత్‌బంగ్లాకి మనం వెళ్ళి అర్థరాత్రి గోడదూకే అవసరం ఏం ఉంది? " అన్నాడు విజయ్.

"ఆ? అంటే నారాయణపురం అనే ఊరే లేదా? ఫిక్షిషియస్ ఊరా? అసలు ఈ హరిణి అనబడే కారెక్టర్ అయినా ఉందా? లేకపోతే అదీ నువ్వు కల్పించిన పాత్రేనా? " పవన్ ఆశ్చర్యపోతూ అడిగాడు.

విజయ్ పగలబడి నవ్వాడు.

"ఆహా. ఏం ఇంటర్‌ప్రెటేషన్? నారాయణపురం అనే ఊరే లేదంటే, అది కల్పితమైన ఊరని కాదు నేను చెప్పేది. నారాయణపురం అనే ఊరు ఉండేది. కానీ ప్రస్తుతం లేదు. అదేదో ప్రాజెక్ట్ కింద ఆ గ్రామం మొత్తం జలమయం అయింది. ప్రస్తుతం ఆ ఊరు లేదు. అక్కడ వాళ్ళంతా ఎటు పోయారో ఏమో? ప్రభుత్వం వాళ్ళకి వేరే ఊళ్ళో స్థలాలిచ్చింది. కానీ అదంతా పదేళ్ళ క్రితం. ఇప్పుడు ఎవరన్నా తెలిసిన వాళ్ళున్నారా, ఎక్కడున్నారు అని కనుక్కోవాలి, కనుక్కుంటాను" అన్నాడు విజయ్.

★ ★ ★

విజయ్ అన్వేషణ ఫలించింది.

నారాయణపురం నిర్వాసితులకి ప్రభుత్వం కల్పించిన గ్రామంలో విజయ్‌కి తెలిసినవాళ్ళు కొందరు ఇంకా అక్కడే ఉన్నారుట.

"నేను వెళ్ళి కనుక్కుని వస్తాను" అన్నాడు విజయ్

"నేనూ వస్తాను" అన్నాడు పవన్.

"వద్దు. నువ్వు ఇక్కడే ఉండు. ఎన్నిచోట్ల తిరగాలో ఏమో? నీకు ఇంటర్నల్ పరీక్షలు కూడా ఉన్నాయి కదా. నేను వెళ్ళి అన్నీ ఎంక్వైరీ చేసి వస్తాను. అంతగా అవసరం అయితే నువ్వు అప్పుడు రావచ్చు" అన్నాడు విజయ్.

"సరే" అన్నాడు పవన్.

అసలు షేర్నీని చూడకుండా తను ఉండలేడు. షేర్నీని చూడకుండా బతకటం తన తరమా? అది కనిపెట్టే విజయ్ తనే వెళ్ళి వస్తానన్నాడా అని అనుమానం వచ్చింది కూడా.

"పవన్. ఇంకేం ఆలోచించకు. నువ్వు హాయిగా చదువుకో. పరీక్షలు బాగారాయి". పవన్ చేతిని నొక్కి బయల్దేరాడు విజయ్.

★ ★ ★

పదిరోజులు గడిచిపోయినా విజయ్ రాలేదు. ఆరోజు కాలేజ్ నుంచి రాగానే విజయ్‌ని చూసి ఆశ్చర్యపోయాడు పవన్.

"విజయ్. అదేంటి అలా ఉన్నావు? అసలెప్పుడొచ్చావు? హరిణి గురించి తెలిసిందా? అడిగాడు ఆత్రంగా.

విజయ్ నిర్లిప్తంగా చూసి "లేదు" అన్నాడు. పవన్ ఒక్కసారిగా నిరుత్సాహపడిపోయాడు.

"పవన్. ఈ షేర్నీ హరిణి కాదు. ఎవరో మరి. అన్నీ మర్చిపో" అన్నాడు విజయ్.

విజయ్‌కేసి సూటిగా చూశాడు పవన్. విజయ్ తడబడి మొహం తిప్పుకున్నాడు.

"అబద్ధాలు ఆడటం నీకు రాదుగానీ అసలేం జరిగింది? ఏం తెలుసుకున్నావు" అడిగాడు పవన్.

"విని తట్టుకోలేవు".

"ఫర్వాలేదు"

"అయితే పద. ఎక్కడన్నా పార్క్‌లో కూర్చుని చెపుతాను. విన్నాక నువ్వు హరిణి గురించి మర్చిపోవాలి" అన్నాడు విజయ్.

"ముందు అసలు ఏం జరిగిందో, ఏమేం తెలుసుకున్నావో చెప్పు" అన్నాడు పవన్.

పార్కులో కూర్చున్నాక...

విజయ్ చెప్పటం మొదలుపెట్టాడు. అది చాలా పెద్ద కథ.

ఆ కథ ఏంటంటే...

★ ★ ★

చిరుచీకట్లు కమ్ముకుంటున్నాయి.

హైదరాబాద్ నగరానికి చాలా దూరంగా ఉన్న గ్రామం అది. ఎత్తైన కొండ. చుట్టూ

పచ్చటి భూములు. పళ్లతోటలు. కొండమీద చక్కటి భవంతి. భవనం మొత్తం తెలుపు వర్ణమే. గోడలకీ తలుపులకీ అన్నింటికీ తెల్లటి రంగు. అద్దాల కిటికీలలో ఆ భవంతి స్వచ్ఛంగా మెరిసిపోతోంది.

కోట గుమ్మంలా ఉన్న ఎత్తయిన తెల్లటి గేట్లు దాటాక భవంతి లోపలకు వెళ్లటానికి తారురోడ్డు ఉంది. నల్లటి జడకి రెండు పక్కలా అమర్చిన మల్లెతీగల్లా దానికి రెండు వైపులా, మల్లె, మాలతో లిల్లీచెట్లు విరబూసి సువాసనలు గుబాళిస్తున్నాయి. ఆ దారి నేరుగా భవనం పోర్టికోలోకి దారి తీస్తుంది. పోర్టికో దాటి లోపలకు వెళ్లగానే తెల్లటి పాలరాతి మెట్లతో, మెట్లపైన విర బూసిన పూలతో నింపివున్న పూలకుండీలు, ఆ భవనం శాంతికి ప్రతిరూపంలా కనిపి స్తుంది.

అన్నిటికన్నా అక్కడ అందరినీ ఆకర్షించే విషయం ఏమిటంటే అక్కడ వాలే పక్షులూ, అప్పుడప్పుడూ పలకరించటానికి వచ్చినట్లు కనిపించే వన్యప్రాణులూ. చుట్టూ తోటలూ, ఆపైన అటవీప్రాంతం ఉండటం వల్ల రకర కాల పక్షులు వచ్చి వాలతాయి. ఆ భవం తిలో ఎక్కడ పడితే అక్కడ రంగురంగుల పక్షులూ పావురాలూ యథేచ్ఛగా తిరుగు తుంటాయి. వాటికి కావల్సిన గింజలూ, పళ్ల ముక్కలూ భవనం వెనుక భాగంలో విరజి మ్మబడి ఉంటాయి. ఆ పిట్టలు రెక్కలు టపటపలాడిస్తూ ఎగురుతూ, వాలుతూ, గింజలు తింటూ చూసేవాళ్లని ముగ్ధుల్ని చేస్తాయి.

అందమైన ఈ సాయంత్రాన, అందమైన ఆ భవంతిలో, ఇంకా అందంగా మెరిసిపో తున్న కృష్ణప్రసాద్ పోర్టికోలో నిలబడి తదే కంగా గేటువైపే చూస్తూ ఎవరికోసమో ఎదురుచూస్తున్నాడు. అతని మొహంనిండా ఆందోళన. కళ్లు అశాంతిగా, దిగులుగా ఉన్నాయి.

హాల్లో ఫోన్ మోగింది. కృష్ణప్రసాద్ వెంటనే వెళ్లి రిసీవర్ అందుకున్నాడు. 'హలో' అన్నాడు.

"హలో కృష్ణా. సారీ... కాస్త లేటైంది కానీ వచ్చేస్తున్నా. మీ విలేజ్‌కి దగ్గర్లో ఉన్న రామాపురం నుంచి ఫోన్ చేస్తున్నాను. ఇంకో గంటలో మీ ఇంటి ముందుంటాం" అన్నాడు డాక్టర్ రాఘవ.

"అలాగే" అనేసి ఫోన్ పెట్టేశాడు కృష్ణప్ర సాద్. అశాంతిగా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. "బాబుగారూ... టిఫిన్ ఏదన్నా తింటారా? పొద్దున్న ఎప్పుడో తిన్న భోజనం తప్ప మరేం తినలేదు" వంటమ నిషి రంగమ్మ అడిగింది.

"వద్దమ్మా, రాఘవ వచ్చాక ఒకేసారి వాడితో భోజనం చేసేస్తాను. మా కోసం ఎదురుచూడకండి" అన్నాడు కృష్ణప్రసాద్.

"పాపకి మందు టైమ్ అవుతోంది" కృష్ణ ప్రసాద్ గబగబా పక్కగది వైపు నడిచాడు. అక్కడ తెల్లటి పక్కమీద, తెల్లటి గౌనులో శాంతి కపోతంలా చల్లగా నిద్రపోతోంది కృష్ణప్రసాద్ కూతురు హరిణి. కళ్ళకింద గుంటలు, పీక్కుపోయిన మొహం, చిక్కిపో యిన శరీరం... హరిణిని చూసి కృష్ణప్ర సాద్ గుండె ద్రవించిపోయింది.

"హరిణీ. అమ్మా హరిణీ" ఆయన పాప పక్కన చేరి మృదువుగా పిలిచాడు.

హరిణి కళ్ళు తెరిచి చూసింది. తండ్రిని చూడగానే హరిణి కళ్ళు అంత నీరసం లోనూ వెలిగాయి.

కృష్ణప్రసాద్ పాపని మెల్లగా లేపి కూర్చో బెట్టి, టాబ్లెట్ తీసి ఇచ్చి మంచినీళ్ళు తాగిం చాడు.

హరిణి తండ్రి మెడచుట్టూ చేతులు వేసి, ఆయన గుండెల్లో తలదాచుకుని మళ్ళీ నిద్రకి ఉపక్రమించింది. తండ్రిని చూస్తే హరిణికి బోలెడంత బలం వస్తుంది. ఆయన చేతుల్లో నిద్రిస్తుంటే బోలెడంత నిశ్చింత. హరిణికి ప్రపంచంలో ఏదీ అక్క ర్లేదు. తన తండ్రి, కేవలం తండ్రి సమక్షం

ఉంటే చాలనిపిస్తుంది. తండ్రి అంటే హరిణికి పిచ్చి ప్రేమ, ఆరాధన. ఆమెకి తండ్రి అంటే ఉన్న భావం వర్ణించటానికి ఏ భాషా, ఏ పదాలూ చాలవు. కృష్ణప్రసాద్ ఆమెకి తండ్రి మాత్రమే కాదు, గురువూ, దైవం, మార్గదర్శీ అన్నీ ఆయనే.

నాలుగేళ్ళ వయసులో హరిణి తల్లిని పోగొట్టుకుంది. అప్పుడు కృష్ణప్రసాద్ వయసు కేవలం ముప్పై ఏళ్లు మాత్రమే. మళ్ళీ పెళ్ళి చేసుకోమని ఎంతమంది పోరినా కృష్ణప్రసాద్ మాత్రం పెళ్ళి చేసుకోలేదు. తనే తల్లీతండ్రీ అయి ఆమెని పెంచాడు. దురదృష్టంకొద్దీ హరిణికి గుండె జబ్బు వచ్చింది.

"పాపకి గుండెజబ్బు వచ్చి పడింది. ఎన్నాళ్ళు బతుకుతుందో కూడా చెప్పలేమంటున్నారు. ఇప్పటికన్నా పెళ్ళి చేసుకో. ఆరిపోయే దీపాన్ని పట్టుకుని ఎన్నాళ్ళు వేళ్లాడతావు? ఏమిటీ మూర్ఖత్వం..." అన్నారు బంధువులు.

"ప్లీజ్. ఇంకెప్పుడూ అలా అడగకండి. హరిణి తప్ప నాకు మరో లోకం లేదు"

"కానీ అది కూడా ఉంటుందని గ్యారంటీ లేదంటున్నారు కదా?' నిర్మొహమాటంగా అడిగారు బంధువులు.

"అది మన చేతిలో లేదు. పాప నా సర్వస్వం. పాప ఉన్నన్నాళ్ళూ దాన్ని ఆనందంగా ఉంచడమే నా బాధ్యత. ఆ తర్వాత నా దురదృష్టం వల్ల పాప చచ్చిపోతే... పాప జ్ఞాపకాలు చాలు నాకు ఒక జీవితకాలం తల్చుకుంటూ గడిపేయటానికి.

"చేతులారా పచ్చటి జీవితం పాడుచేసుకుంటున్నావు" బంధుమిత్రులు హెచ్చరించారు.

గుండెజబ్బు హరిణికి రకరకాల వైద్యం చేయిస్తూ ఆమెకి నయమవుతుందనే ఆశతో జీవిస్తున్నాడు కృష్ణప్రసాద్. ఈమధ్య పాప ఆరోగ్యం బాగా క్షీణించింది.

హరిణికి తన కోసం డాడీ ఎన్నెన్ని త్యాగాలు చేశాడో అర్థమవుతూనే ఉంది. అన్ని ఐశ్వర్యాలతోపాటు కృష్ణప్రసాద్‌కి అందమైన హృదయం కూడా ఉంది. చీమకైనా హాని చెయ్యడు. దానధర్మాలకే ఆస్థి చాలా భాగం హరించుకుపోయింది. డబ్బు సద్వినియోగం అయిందని అతను సంతోషిస్తుంటాడు. తండ్రి మంచితనం చూసి మురిసిపోతుంటుంది హరిణి.

పాప బతికే ఆశ లేదని చాలా మంది తేల్చి చెప్పారు. కృష్ణప్రసాద్ స్నేహితుడు డాక్టర్ రాఘవ అమెరికాలో ఉంటున్నాడు. అతను తన స్నేహితుడు డాక్టర్ శివరాం ఇట్లాంటి జబ్బులకి ఆపరేషన్ చేసి తగ్గించాడని కృష్ణప్రసాద్‌కి చెప్పాడు. డాక్టర్ శివరాం ఇండియాకి వచ్చాడు. అతన్ని వెంటబెట్టుకుని వస్తాననీ, ఇక్కడే అన్ని రిపోర్ట్‌లూ చూసి ఏ సంగతీ చెపుతాడనీ రాఘవ అన్నాడు.

వాళ్ళకోసమే కృష్ణప్రసాద్ ఎదురు చూస్తున్నాడు. ఒకసారి పాప వైపు చూశాడు. పాపకేదైనా జరిగితే తను తట్టుకోగలడా? అసలు ఏ తండ్రి అయినా కూతురి మరణాన్ని చూసి భరించగలడా? ఆ గుండె పగిలిపోదూ?

మూసిన అతని కనురెప్పల నుంచీ నీళ్ళు జారాయి. "భగవంతుడా" అతని హృదయం ఆక్రోశించింది. ఇక అక్కడ కూర్చోలేకపోయాడు. వెంటనే లేచి పూజా మందిరం వైపు నడిచాడు. మందిరంలో మోకాళ్ల మీద కూలబడి పోయాడు.

"భగవంతుడా. నీకు తెలుసు. నేను ఈనాటి వరకూ నీతిగా, ధర్మబద్ధంగా బతికాను. ఎంత డబ్బు ఉన్నా దాన్ని దానధర్మాలకీ, పేదవాళ్ళని ఆదుకునేందుకూ మాత్రమే ఉపయోగించాను గానీ సొంత

తక్కువ వాగ్దానాలు చేసే వ్యక్తికే ఓటు వెయ్యాలి. ఎందుకంటే అతను మనల్ని ఎక్కువ నిరుత్సాహపరచడు. – బెర్నార్డ్ బరూచ్

సరదాల కోసం ఉపయోగించలేదు. ప్రతి జీవిలో నిన్ను చూశాను. అందర్నీ ప్రేమించాను. నువ్వు నా భార్యను నాకు దూరం చేసినా నా ఖర్మ ఇంతే అని సరిపెట్టుకున్నాను. కానీ పాప చావు కళ్ళారా చూసి తట్టుకునే బలం మాత్రం నాకు లేదు. దయతో నన్ను రక్షించు. పాపను కాపాడు". కృష్ణప్రసాద్ కళ్లల్లోంచి నీళ్లు జలజలా రాలాయి.

కారుతున్న కన్నీటిని కూడా తుడుచుకోలేనంత నిస్సత్తువ అతన్ని ఆవరించింది.

భవనం అంతా నిశ్శబ్దం. భయంకరమైన నిశ్శబ్దం... సృష్టి చాలించి, ఈ జగాన్ని అంతం చేసి, బ్రహ్మ యోగనిద్రకు ఉపక్రమించినప్పుడు ఉన్నట్లు అంతటా నిశ్శబ్దం.

హఠాత్తుగా ఆ నిశ్శబ్దంలో సర్రుసర్రుమని శబ్దం. వేగంగా వీస్తున్న గాలిని ఒక కరవాలం ఛేదిస్తున్నట్లు సర్రుమని శబ్దం.

ఎవరో కృష్ణప్రసాద్ వైపు వస్తున్నారు. అతని భుజం మీద ఒక చెయ్యి పడింది.

కృష్ణప్రసాద్ తల ఎత్తి చూశాడు.

ఆమె రాణీ పద్మిని. కృష్ణప్రసాద్ చెల్లెలు. అందంలో అన్నకు దీటైన మనిషి. అయిదడుగుల ఆరంగుళాల ఎత్తు, పచ్చటి రంగు, చక్కటి కనుముక్కు తీరు, శిల్పంలాంటి శరీరం. కానీ ఆమె కృష్ణప్రసాద్ కనిపించినంత అందంగా కనిపించదు. కారణం, అతని మొహంలో ఉన్న సౌమ్యత, సరళత్వం, ఆయన కళ్ళల్లో ప్రతిబింబించే ఆ సహృదయం ఏవీ ఆమెలో మచ్చుకైనా కనిపించవు. కృష్ణప్రసాద్ చల్లటి తటాకం అయితే ఆమె అగ్నిపర్వతం. ఇద్దరికీ తూర్పు పడమరకున్నంత వ్యత్యాసం ఉంది.

ఆమె హైదరాబాద్‌లో ఉంటుంది. హరిణిని చూడటానికి ఎవరో గొప్ప డాక్టర్ వస్తున్నాడని తెలిసివచ్చింది.

"అన్నయ్యా. ఏమిటీ బేలతనం?" అందామె మందలిస్తున్నట్లు. ఆమె కంఠం కరుగ్గా ఉంటుంది. మాట పెళుసు. మనిషి దురుసు.

రాణీ పద్మిని ముందుకి వంగి కృష్ణప్రసాద్ కన్నీటిని కర్చీఫ్‌తో తుడిచింది.

ఒక్క నిమిషం గడిచింది. కృష్ణప్రసాద్ తెప్పరిల్లాడు.

"ఏంటో. మీ ఇంట్లో అంతా విచిత్రంగా ఉంటుంది" అంది రాణీ పద్మిని.

కృష్ణప్రసాద్ ఏమిటన్నట్లు చూశాడు.

"మనం తినకముందే పనివాళ్లు తినేస్తున్నారు" అంది రాణీ పద్మిని కంప్లెయింట్ చేస్తున్నట్లు.

"నేనే తినేయమన్నాను. ఆలస్యం అయిపోతోంది"

"వాళ్ళు టిఫిన్ తిన్నారు. మనం అది కూడా తినలేదు. ఇప్పుడు అన్నం కూడా తినేస్తున్నారు. సరే వాళ్లు తినగా మిగిలిందే తిందాం" అంది రాణీ పద్మిని చిరుకోపంగా.

కృష్ణప్రసాద్ బదులు చెప్పలేదు.

"అదెవరూ? ఇంకా ఇంటికి పోలేదు. హరిణితోనే ఆడుకుంటోంది."

"విజ్జీనా. పాపం ఆ పాప తల్లిదండ్రులు చాలా బీదవాళ్లు. కూలీ చేసుకుని బతుకుతారు"

"అర్థమైంది. అందుకని దానికి తిండీ బట్టా చదువు అన్నీ మనింట్లోనే అన్నమాట. పడి మేస్తూ పోతులా తయారైంది. ఆ బట్టలూ, షోకులూ పనివాళ్ల పిల్లలా లేదు. మన బంధువేమో అనుకున్నాను".

"బంధుత్వాలదేం ఉంది పద్మినీ. మనుషులందరూ మన బంధువులే".

"బాగానే ఉంది. ఇట్లా సాయాలు చేసుకుంటూపోతే కొండలైనా కరిగిపోతాయి. నీకు డబ్బు విలువ తెలియటంలేదు".

"డబ్బు మనం సృష్టించుకున్నదే కదా పద్మినీ. మనుషులుంటే చాలు. మనిషిగా పుట్టినందుకు నాకు తోచిన సాయం చేస్తున్నాను. విజ్జీతో ఎలాంటి ప్రోబ్లమ్ లేదు. హరిణికి కొన్నప్పుడే విజ్జీకీ బట్టలు కొంటుం

టాను. మనతోనే ఉంటుంది. తింటుంది. హరిణికి చదువు చెప్పటానికి డాక్టర్లు ఇంటికే వస్తారు కదా. అప్పుడే విజ్జీకీ చదువు చెపుతారు. ఇంకాస్త ఫీజు ఇస్తాం. అంతే".

"అంతేలే. అయినా ఇదొక్కటేనా. ఎవరికి పెళ్లి కావాలన్నా, చదువుకోవాలన్నా ఆఖరికి ఆస్తులు కొనుక్కోవాలన్నా నీ దగ్గరకే వస్తున్నారు. చేసి చేసి నువ్వు వీధిలో పడతావేమోనని నా బాధ".

"ఇంతమంది మనుషులున్నారు నాకు. ఆ తృప్తి చాలు".

కృష్ణప్రసాద్ మొహంలోకి చూసి రాణీ పద్మిని ఏం మాట్లాడలేక పోయింది.

రాణీ పద్మిని జీవితంలో ఎవర్నీ నమ్మదు. కృష్ణప్రసాద్ అందర్నీ నమ్ముతాడు.

ఒక అరగంట గడిచింది.

డాక్టర్ రాఘవ తన స్నేహితుడు డాక్టర్ శివరాంని తీసుకుని వచ్చేశాడు.

హరిణి రిపోర్టులూ, పరిస్థితీ అన్నీ పరిశీలించాడు శివరాం. హాల్ లోకి వచ్చారు.

"ఆపరేషన్ చేస్తే బాగవుతుంది" అన్నాడు అన్నీ చూశాక.

కృష్ణప్రసాద్ మొహం వెలిగిపోయింది. అంతలోనే ఆ సంతోషం ఆరిపోయేట్లు శివరాం తన మాటలు పొడిగించాడు.

"కానీ మీరు అన్నిటికీ ప్రిపేర్ అవ్వాలి మరి. ఫిఫ్టీ ఫిఫ్టీ ఛాన్సెస్ ఉంటాయి. ఆపరేషన్ సక్సెస్ కాకపోతే ఏం చెయ్యలేం. మీరు సిద్ధపడి ఓ.కే. అంటే నేను డేట్ ఫిక్స్ చేస్తాను. మళ్ళీ నేను అమెరికా వెళ్ళిపోవాలి. మీరు ఆలోచించుకుని రాఘవకి చెప్పండి" అన్నాడతను.

★ ★ ★

రాణీ పద్మిని కృష్ణప్రసాద్ గదిలోకి ప్రవేశించింది. అది చాలా విశాలమైన గది. పాతకాలం కట్టడం కాబట్టి చల్లగా హాయిగా ఉంది. ఒక పక్కన బీరువాలో కృష్ణప్రసాద్ అభిరుచిని చాటే పుస్తకాలు ఉన్నాయి. మరో పక్కన రైటింగ్ టేబుల్ ఉంది. ఒక మూలగా సోఫా సెట్ కుర్చీలు ఉన్నాయి. మరోమూల శ్రీకృష్ణుడి నిలువెత్తు విగ్రహం ఉంది. దానిముందు ఉంచిన అగరు బత్తీల స్టాండులో శాండల్ ఉడ్ అగరుబత్తులు ఏకదీక్షగా వెలుగుతున్నాయి. శ్రీకృష్ణుడి విగ్రహానికి వేసిన పూలదండలో పూలు తాజాగా సువాసనలొలుకుతున్నాయి.

"ఏమిటో మీ ఇంట్లో ఏ గదిలో కెళ్ళినా గుళ్ళో కెళ్ళిన ఫీలింగ్ వస్తుంది" నవ్వుతూ అంది రాణీ పద్మిని.

"మంచిదేగా!"

"అవునుగానీ ఏం డిసైడ్ చేశావు?" అడిగింది రాణీ పద్మిని.

కృష్ణప్రసాద్ సమాధానం చెప్పలేదు. అతనికి లోలోపల భయంగా ఉంది. ఒకవేళ ఆపరేషన్ సక్సెస్ కాకపోతే? హరిణికి ఏమన్నా జరిగితే తను తట్టుకోగలడా? భగవంతుడా! నాకేది దారి? అతను కళ్ళు మూసుకుని ప్రార్థిస్తున్నాడు.

అతని ఆలోచనలన్నీ రాణీ పద్మినికి అర్థమైపోయాయి. "అన్నయ్యా, అంతా మంచే జరుగుతుంది. భయపడకు. ధైర్యంగా రండి" అంది.

కృష్ణప్రసాద్ తల ఊపాడు. "సరే వస్తున్నామని రాఘవకి చెపుతాను" అన్నాడు.

రాణీ పద్మిని ఇంతవరకూ ఎప్పుడైన వచ్చిపోతూ ఉండటమే తప్ప రెండ్రోజులన్నా స్థిరంగా ఉండి హరిణితో మాట్లాడింది లేదు. ఇప్పుడు వారం రోజుల నుంచి ఇక్కడే ఉంటూ ఉండటంవల్ల ఆమెకు హరిణితో చనువు ఏర్పడంది. హరిణి ముద్దు మొహం, ఆప్యాయంగా ఉండే ప్రవర్తనా బహుశా రాణీ పద్మినిలోని మాతృ హృదయాన్ని తట్టి ఉంటాయి. రాణీ పద్మినికి పిల్లలు లేరు. లేరన్న బాధ కూడా లేదు. ఏదీ లెఖ్ఖలేనట్లూ, ఎవరూ తనకు అఖ్ఖర్లేదన్నట్లూ, నిర్లక్ష్యంగా ఉండే రాణీపద్మినికి ఈ వారం రోజుల్లో హరిణి బాగా అలవాటైపోయి, చెదరని మమకారం ఏర్పడిపోయింది. ఎన్నడూ ఎవర్నీ, ఆఖరికి దేవుణ్ని కూడా ఏమీ కోరని అహంభావి రాణీపద్మిని కూడా ఇక్కడికి వచ్చాక హరిణికి గుండె జబ్బు నయమైపోవాలని భగవంతుణ్ని కోరుకోవటం మొదలుపెట్టింది.

"హరిణీ. డాడీ ఆపరేషన్‌కి ఒప్పుకున్నారు" ఆనందంగా చెప్పింది రాణీ పద్మిని.

హరిణి అత్త మెడ చుట్టూ చేతులు వేసింది.

"అత్తా, నాకు తగ్గిపోయాక మనం ఇద్దరం హైదరాబాద్ చూద్దామా" అంది.

"ఓ" అంది రాణీ పద్మిని.

అక్కడే ఉన్న విజ్జీ ఆ మాటల్ని కళ్ళు పెద్దవిచేసి ఆసక్తిగా వింటోంది.

"హైదరాబాద్‌లో జూ చూపిస్తాను. సింహాలూ, చిరుతపులులూ, పులులూ, జింకలూ ఎన్నో ఎన్నో ఉంటాయి" జూ గురించి చెప్పింది రాణీపద్మిని.

"బిర్లామందిర్, గోల్కొండ, ట్యాంక్‌బండ్... అన్నీ చూపిస్తాను. ఎగ్జిబిషన్ ఉంది. ఇపుడు ఎంత బాగుంటుందో" చెప్పింది రాణీపద్మిని. హరిణి ఎప్పుడన్నా హైదరాబాద్ వెళ్ళినా డాక్టర్‌కి చూపించటానికే తప్ప ఎన్నడూ ఊరు చూస్తూ ఎంజాయ్ చేసింది లేదు. ఇప్పుడు ఆపరేషన్ జరిగి ఆరోగ్యం కుదుటపడితే కొన్నాళ్ళయ్యాక మెల్లగా అన్నీ చూపించాలని పద్మిని ఆశ.

"ఎగ్జిబిషన్ అంటే..." విజ్జీ అడిగింది.

"అంటే మీ ఊళ్ళో సంతలాంటిది. కానీ ఎంత పెద్దగా ఉంటుందో తెలుసా? ఎన్నో రకాల షాపులుంటాయి..."

"అమ్మగారూ. అందులో రంగులరాట్నాలుంటాయా? " విజ్జీ మళ్ళీ అడిగింది.

ఇంతలో కృష్ణప్రసాద్ అక్కడికి వచ్చాడు.

"ఓ. ఉంటాయి. మనకు కనబడే చిన్నచిన్నవి కావు. సినిమాల్లో చూస్తావు చూడు. ఆకాశమంత ఎత్తున తిరుగుతుంది. జెయింట్ వీల్ అంటారు. ఇంకా రైలూ, ఉయ్యాలలూ... రంగురంగుల లైట్లూ ఉంటాయి" కృష్ణప్రసాద్ చెప్పాడు.

ఏమేం ఏర్పాట్లు చేసుకోవాలో మాట్లాడుకుంటూ ఇద్దరూ హాల్‌లోకి వెళ్ళారు.

వాళ్ళిద్దరూ వెళ్ళగానే విజ్జీ హరిణివైపు తిరిగింది.

"హరిణీ.. నాకవన్నీ చూడాలనుంది. చూపించవా ప్లీజ్..."

హరిణికి ఈ కొద్ది రోజుల్లోనే రాణీపద్మిని తత్వం అర్థమైపోయింది. విజ్జీ వస్తానంటే పద్మిని ఒప్పుకోదని తెలుసు. ఒక ఉపాయం తట్టింది హరిణికి.

"విజ్జీ, ఇలా చేస్తే..." విజ్జీకి మెల్లగా ఏవో చెప్పింది హరిణి. విజ్జీ సంతోషంగా తల ఊపింది.

★ ★ ★

డాక్టర్ రాఘవ ఫోన్ చేశాడు.

"ఎప్పుడు వస్తున్నారు? ఆపరేషన్‌కి డేట్ ఫిక్స్ చేసేశారు."

"మరి ఎక్కడ ఉండాలి..."

"అదేంటి. మీ సిస్టర్ వాళ్ళ ఇల్లు..."

"ఎవరికీ ట్రబుల్ ఇవ్వటం నాకు ఇష్టం లేదు. ఏదన్నా ఇల్లు తీసుకుని ఉందామను

కుంటున్నాను. కొన్ని నెలలు ఉండాల్సి వస్తుంది కదా."

"నువ్వు మరీ మొహమాటస్థుడివి సరే నాకు తెలిసిన ఎక్సలెంట్ ఫ్లాట్ ఒకటి ఉంది. మూడు బెడ్‌రూమ్‌లూ, హాలూ, ఫర్నిష్డ్ ఫ్లాట్. అందులో ఉండొచ్చు మాట్లాడమంటావా? "

"వెంటనే మాట్లాడు. నువ్వు రమ్మనగానే మేం వచ్చేస్తాం." అన్నాడు కృష్ణప్రసాద్.

★ ★ ★

కృష్ణప్రసాద్ వేరే ఫ్లాట్‌లో ఉండటానికి ఏర్పాట్లు చేసుకున్నాడని రాణీపద్మినికి తెలిసిపోయింది. అతనికి చెప్పి లాభం లేదని ఆమెకి తెలుసు. నిజం చెప్పాలంటే కృష్ణప్రసాద్ ఎన్నడూ ఆమె ఇంట్లో పట్టుమని రెండు రోజులు కూడా ఉన్నది లేదు. ఆ ఇల్లు రాణీపద్మిని అభిరుచులకి నిలయం. అక్కడ కృష్ణప్రసాద్ ఇమడలేడు.

పోనీలే, ఎక్కడ ఉంటే ఏం, హరిణికి బాగవుతే చాలు అనుకుని ఊరుకుంది పద్మిని.

★ ★ ★

సుధా నిలయం ముందు ఆగిన కార్లు బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నాయి.

హరిణీ, కృష్ణప్రసాద్ ఇద్దరికీ మనసు మనసులో లేదు. తాను తిరిగి సుధా నిలయంకి వస్తానా అన్న సందేహంలో చిన్నారి హరిణి కళ్ళల్లో నీళ్ళతో సుధానిలయం వైపు అవే ఆఖరుచూపు అన్నట్లు చూసుకుంటోంది. హరిణి కళ్ళల్లో నీళ్ళు చూసి, కృష్ణప్రసాద్ గుండె తరుక్కుపోయింది. హరిణి చేతిని తన చేతిలోకి తీసుకుని, రెండో చేత్తో వీపుమీద చిన్నగా తట్టాడు. అతని కళ్ళు కూడా చెమర్చి ఉన్నాయి. సుదీర్ఘంగా ఒకసారి సుధానిలయం వైపు చూసి, మెల్లగా తన దృష్టిని కిందగా కనిపిస్తున్న నారాయపురం ఊరువైపు నిలిపాడు. చెమరింపుతో మసకబారిన అతని కళ్ళకు ఎవరో ఇద్దరు సుధానిలయంవైపు పరుగెత్తుకు వస్తూ కనిపించారు. ఆ ఆకారాలు శరవేగంతో పరుగెత్తి, క్షణాల్లో అతని ముందు నిలిచాయి.

విజ్జీ, ఆమె తండ్రీ. విజ్జీ తండ్రి గణేష్ చేతిలో చిన్న సంచీ ఉంది.

"అయ్యా" గణేష్ వగరుస్తూ అన్నాడు. బయల్దేరకుండా వీళ్ళేంటి మధ్యలో అన్నట్లు రాణీపద్మిని చిరాగ్గా చూస్తోంది. విజ్జీ వెళ్ళి హరిణి చెయ్యి పట్టుకుంది.

"ఏంటి గణేష్? " కృష్ణ ప్రసాద్ అడిగాడు.

"అయ్యగారూ... విజ్జీకి హైదరాబాద్ చూడాలని ఉందిట. నన్ను ఒకటే సతాయిస్తోంది. దాన్ని కూడా తీసుకెళ్ళరూ-" గణేష్ బతిమాలుతున్నట్లు అన్నాడు.

రాణీ పద్మినికి ఒళ్ళు మండిపోయింది.

"ఇంకా నయం. మేం వెళ్లేది పాపకి ఆపరేషన్ చేయించటానికి. విజ్జీకి ఊరు చూపించటానికి టైమ్ ఎక్కడుంటుంది మాకు" చిరాగ్గా అంది.

విజ్జీ హరిణి వైపు చూసింది.

"డాడీ. రానివ్వండి ప్లీజ్. ఎలాగో ఒక లాగ చూపిద్దాం-" అంది.

"ఊరు చూపించకపోయినా ఆ ఊరుకి వెళ్తే చాలు." అంది విజ్జీ.

కృష్ణప్రసాద్ విజ్జీ తండ్రి వైపు తిరిగాడు.

"గణేష్, విజ్జీకి అన్నీ తిప్పి చూపించాలనే ఉంది నాకు, కానీ మేం వెళ్లగానే హరిణికి ఆపరేషన్ చేయించాలి. ఆ తర్వాత కొన్నాళ్ళు పూర్తి రెస్ట్. జాగ్రత్తగా చూసుకోవాలి. మాకు హరిణితోటే సరిపోతుంది. ఒక నెల రోజుల పాటు ఏదీ కుదరదు. పోనీ నెలయ్యాక మళ్లీ వచ్చి విజ్జీని తీసుకెళ్తాను" అన్నాడు.

విజ్జీకి ఈ ప్రతిపాదన నచ్చలేదు. అయిష్టంగా చూస్తోంది.

"నేను ఇందాకే దానికి చెప్పాను అయ్యా, అది వినటం లేదు. దానికి ఇక్కడ ఉండాలని లేదు. మేం దానికి తిండి కూడా పెట్టలేం. మీతో తీసుకెళ్లండి. కనీసం సరి

అయిన తిండి అయినా తింటుంది" అన్నాడు గణేష్ తండ్రి కళ్ల నీళ్లతో.

"డబ్బు తీసుకో" అంది రాణి పద్మిణి.

"మీతో అలవాటై పోయిందమ్మా దానికి. నేను దానికి నచ్చచెప్పలేను" అన్నాడు గణేష్.

"కానీ మేం హాస్పటల్‌కి వెళ్తే విజ్జీ ఒక్కత్తే ఉండాలి." అన్నాడు కృష్ణ ప్రసాద్.

"ఫర్వాలేదు, టి.వి. చూస్తాను" అంది విజ్జీ.

విజ్జీ కళ్లల్లో హైదరాబాద్ చూడాలన్న పట్టుదల స్పష్టంగా కనిపిస్తోంది. చిన్న పిల్లలకు ఉండే సహజమైన ఆసక్తిని కృష్ణప్రసాద్ తండ్రి హృదయం అర్థం చేసుకుంది.

"రాత్రిపూట భయపడతావు" అన్నాడు.

"ఒక్కదాన్నీ ఉండటం నాకలవాటే" అంది విజ్జి.

రాణీ పద్మిని విరుచుకు పడింది. కోపంగా ఉన్నప్పుడు పేరు పెట్టి పరిశీలిస్తుంది రాణీ పద్మిని.

"కృష్ణా. నీకేమన్నా మతి పోయిందా? దాన్ని మనతో తీసుకెళ్లటం ఏమిటి?" అంది.

"రాణీ అత్తా, పాపం విజ్జీకి ఇక్కడ ఫుడ్ కూడా సరిగ్గా ఉండదు. అక్కడ నాతో ఉండి అన్నీ నేర్చుకుంటుంది. ఈ సంవత్సరం గనక ఎలాగో అయిపోయిందంటే, ఆతర్వాత హాస్టల్‌లో ఉండి చదువుకుంటుంది" అంది హరిణి జాలిగా.

"నాకైతే అస్సలు ఇష్టంలేదు. రామేశ్వరం వెళ్ళినా శనేశ్వరం తప్పనట్లు, స్వర్గానికి వెళ్ళినా సవతిపోరు తప్పనట్లు, పెళ్ళికి వెళుతూ పిల్లిని చంకనపెట్టుకుని వెళ్ళినట్లు..."

ఆ సామెతల వర్షానికి కృష్ణప్రసాద్‌కీ, హరిణికీ, విజ్జీకీ నవ్వు వచ్చేసింది.

విజ్జీ కృష్ణప్రసాద్ వైపు గోముగా చూసింది.

"పెదనాన్నా" అంది ముద్దుగా

"విజ్జీ, నువ్వురా" అన్నాడు కృష్ణప్రసాద్.

"కృష్ణా, మరీ ఓవర్‌గా ఉంది" అంది రాణీ పద్మిని.

"పద్మినీ, నాకు ఇంకో కూతురు ఉంటే ఏం చేసేవాడిని? తీసుకెళ్ళి ఎలాగో ఒకలా అడ్జస్ట్ అయేవాళ్ళమే కదా" అన్నాడు కృష్ణప్రసాద్.

"మీ ఇష్టం" అనేసి మొహం తిప్పుకుని కారెక్కి కూర్చుంది రాణీ పద్మిని.

మహా ఆనందంతో మొహం వెలిగిపోతుంటే నవ్వుతూ కారు ఎక్కేసింది విజ్జీ. హరిణీ, విజ్జీ నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. మధ్య మధ్యలో సక్సెస్ అన్నట్లు రహస్యంగా సైగలు చేసుకుంటున్నారు. అవి కృష్ణప్రసాద్ కంటపడ్డాయి.

"ఇలా చెయ్యాలని ముందే ప్లాన్ వేసుకున్నారా?" నవ్వుతూ అడిగాడు.

"అవును డాడీ. వెళ్ళేటప్పుడయితే ఇంక ఎవరూ వద్దనరనీ..." హరిణి సంతోషంగా చెప్పింది.

విజ్జీ, హరిణి సంతోషంగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

కార్లు నేరుగా వచ్చి ఎపార్ట్‌మెంట్స్ ముందు ఆగాయి.

ఖరీదైన ఏరియాలో ఉన్న ఖరీదైన ఫ్లాట్స్ అవి. ఏడంతస్థుల మేడ అద్దాల కిటికీలు, చక్కటి నిర్మాణంలో చూసేవాళ్ళ కళ్ళు చెదిరిపోయేట్లు ఉన్నాయి ఆ ఫ్లాట్స్. గేటు దాటగానే అందమైన గార్డెన్, కింద పార్కింగ్‌కీ, పిల్లలు ఆడుకునే గార్డెన్‌కీ వదిలారు.

గ్లాస్ లిఫ్ట్‌లు రెండు హడావిడిగా కిందికీ పైకీ తిరుగుతున్నాయి. వాటిల్లోంచి బొమ్మల్లా కనిపిస్తున్న మనుషులూ, పాలరాతి మెట్లూ, ఆ వాతావరణం అంతా ఖరీదైన హోటల్‌లా కనిపిస్తోంది.

విజ్జీ కళ్ళు పెద్దవిచేసి సంతోషంగా చూస్తోంది. కారు దిగగానే లిఫ్ట్ దగ్గరికి పరుగెత్తింది. అవన్నీ చూస్తే కడుపు నిండిపోయినట్లు అనిపిస్తోంది.

వాచ్‌మాన్ వచ్చాడు. అతనితోపాటు డాక్టర్ రాఘవ పంపిన మనిషి కూడా ఉన్నాడు. వెంటనే జేబులోంచి ఫ్లాట్ తాళాలు తీసి ఇచ్చాడు.

సామాన్లన్నీ అందుకుని, ముందుకి నడిచాడు. లిఫ్ట్‌లో అన్నీ పెట్టి, అంతా ఎక్కగానే నెంబర్ బటన్ నొక్కాడు. లిఫ్ట్ రివ్వున ఎగిరిపోయింది. విజ్జీ సంతోషంగా చప్పట్లు కొట్టింది. హరిణి కిలకిల నవ్వింది. ఆ చిన్నారి పాపల నవ్వు మొహాలు చూసి కృష్ణప్రసాద్‌కి మనశ్శాంతిగా అనిపించింది.

ఆరవ అంతస్థులో లిఫ్ట్ ఆగింది. వాచ్‌మాన్ తాళం తీశాడు. అంతా లోపలకు వెళ్ళారు. ఆటోమాటిక్ లాక్ ఉన్న తలుపు వేయగానే ధడాల్న మూసుకుపోయింది.

చక్కటి పాలరాయి ఫ్లోరింగ్, నున్నటి గోడలు, మంచి పనితనం ఉన్న టేకు తలుపులు, అద్దాల కిటికీలు, విశాలమైన మూడు బెడ్‌రూమ్‌లూ, అటాచ్డ్ టాయిలెట్స్ అన్నీ చూశారు. ఇంతలో రాఘవ కూడా వచ్చేశాడు.

"వచ్చేశారా? ఏదో నాకు చేతనైనవన్నీ సర్దించాను" అన్నాడు. "ఇంకా నయం, మొత్తం సంసారానికి కావల్సిన వన్నీ ఏర్పరచావు. రోజురోజుకీ నీకు మరీ మరీ ఋణపడి పోతున్నాను" అన్నాడు కృష్ణప్రసాద్.

రాఘవ నిజంగానే అన్నీ అద్భుతంగా సర్దించాడు. అది ఫర్నిష్డ్ ఫ్లాట్ కావడంవల్ల ఫర్నిచర్ కొనుక్కోవలసిన పనేలేదు. వంటింట్లోకి కావల్సినవన్నీ రాఘవ తెప్పించి సర్దించేశాడు. ఇంటీరియర్ డెకరేటర్స్ ఫర్నిష్ చేసిన ఫ్లాట్ కాబట్టి ఫ్లవర్ వేజ్‌లతో సహా అన్నీ ఎక్కడ ఉండాల్సినవి అక్కడ ఉన్నాయి.

"ఫ్లాట్ చాలా బాగుంది" అన్నాడు కృష్ణప్రసాద్.

"అవును. ఇంటాయన ఆఫ్రికాలో ఉంటాడు" అన్నాడు రాఘవ.

ఆ తర్వాత ఏది ఎట్లా వాడాలో రాణీపద్మిని చూపించింది.

"విజ్జీ, నువ్వు ఆ గదిలో పడుకో. హరిణీ ఇది నీ గది. అన్నయ్యా, నువ్వు ఈ బెడ్‌రూమ్ వాడుకో" అంటూ విజ్జీకీ, హరిణికీ, కృష్ణప్రసాద్‌కీ వాళ్ల బెడ్‌రూములు ఎలాట్ చేసింది. "రేపు పొద్దున్న తొమ్మిది గంటలకల్లా హాస్పిటల్‌కి రండి" అన్నాడు రాఘవ.

"మరి భోజనం సంగతి? ఎవరన్నా కుక్ దొరుకుతాడా? " కృష్ణప్రసాద్ అడిగాడు.

"దగ్గరల్లో మంచి రెస్టారెంట్ ఉంది. కాఫీ, టిఫిన్, మీల్స్ అన్నీ బాగుంటాయి. వాచ్‌మన్‌కి చెపితే మీకు కావాల్సినవి తెప్పించి పెడతాడు. అతని కింద ఒక మనిషి ఉన్నాడు. అతనికి మీరు ఏదో ఒకటి పే చేసేయండి".

కృష్ణప్రసాద్ సరేనన్నాడు.

రోజూ పొద్దున్నే ఇడ్లీ, కాఫీ, పాలు, ఆ తర్వాత లంచ్‌లో విజ్జీ ఒక్కత్తే ఇంట్లో ఉంటుంది కాబట్టి ఆమెకి లంచ్, సాయంత్రం మళ్లీ స్నాక్స్, టీ ఆ తర్వాత మళ్లీ రాత్రికి భోజనం తెచ్చేటట్లు ఒప్పందం జరిగింది.

రాఘవ వెళ్లిపోయాడు.

రాణీ పద్మిని గీజర్ ఆన్ చేసి వచ్చింది. హరిణీ, విజ్జీ వాళ్ల వాళ్ల టాయిలెట్స్‌కి వెళ్లి స్నానాలు చేస్తున్నారు.

"నీదంతా పిచ్చి అన్నయ్యా. వద్దంటే ఆ విజ్జీని తీసుకొచ్చావు. ఇప్పుడు చూడు హరిణిని హాస్పిటల్లో చేర్పించాక మీరు అక్కడే ఉండిపోతారు. ఆ విజ్జీకి మాత్రం కారియర్లు మోయించుకుని రావాలి. దండగ ఖర్చు" అంది రాణీ పద్మిని.

కృష్ణప్రసాద్ నవ్వేశాడు.

"అన్నీ డబ్బుతో కొలవకూడదు పద్మినీ. ఆ పాప కళ్లల్లో సంతోషం చూడు. తృప్తిగా

---

ఆలోచనల్లో విశ్వాసం, కార్యాలలో ధైర్యం, మాటలలో వివేకం, జీవితంలో సేవాభావం ఎప్పుడూ కలిగి ఉండండి. — లెనిన్

అనిపించటంలేదూ? ఆ తృప్తికి ఏ డబ్బుతో విలువ కట్టగలం? " అన్నాడు.

"ఎవరి పిచ్చి వారికానందం అని ఇందుకే కాబోలు అన్నారు" అంది రాణీపద్మిని.

హరిణి స్నానం చేసి వచ్చి వణుకుతూ నిలబడింది. కృష్ణప్రసాద్ పరుగెత్తుకెళ్లి టవల్‌తో ఒళ్లు తుడిచి గౌన్ వేశాడు. పౌడర్ రాసి బొట్టు పెట్టాడు.

విజ్జీ స్నానం కూడా అయింది. కృష్ణప్రసాద్ కూడా స్నానం చేసి వచ్చాడు.

బెడ్‌రూంలోకి వెళ్లి సూట్‌కేస్‌లోంచి సుధ ఫొటో తీసి టేబుల్ మీద పెట్టాడు. ఫొటోలో సుధ మెడలో ఒక లాకెట్ గొలుసు ఉంది. మధ్యలో అమూల్యమైన వజ్రం చుట్టూ పచ్చలూ కెంపులూ పొదిగిన ఆ లాకెట్ విలువ లక్షల్లో ఉంటుంది. పెళ్లికి ముందూ ఆ తర్వాతా కూడా కృష్ణప్రసాద్ సుధతో గడిపిన మధురక్షణాలకు ఆ లాకెట్ సాక్షి. ఆ లాకెట్ గొలుసంటే కృష్ణప్రసాద్‌కి ప్రాణం. దాన్ని ఒక్కసారైనా తాకనిదే, సుధ ఫొటో ముందు నిలబడనిదే అతనికి రోజు గడవదు. తన కష్టాలన్నీ సుధకి చెప్పుకున్నట్లు ఉండదు.

భోజనాలు చేశాక మర్నాడు పొద్దున్న మళ్లీ వస్తానని వెళ్లిపోయింది రాణీపద్మిని.

అపార్ట్‌మెంట్స్ గురించి అంతవరకూ వినటమే తప్ప కృష్ణప్రసాద్‌కి ప్రత్యక్షానుభవం లేదు.

వీళ్ళు కొద్దిపాటి సామానుతో దిగటం చూసిన వాళ్ళు కూడా ఎవరూ పన్నెత్తి పలకరించలేదు, కన్నెత్తి చూడలేదు. అసలు ఎవరూ ఎవరితో మాట్లాడుకుంటున్నట్లే లేదు. ఒకే హోటల్‌లో బస చేసిన వ్యక్తుల మధ్య ఉన్న సంబంధం లాంటి సంబంధం తప్ప ఇంక ఏ ఇతర స్నేహబంధాలూ వాళ్ళెవరి మధ్యా లేవు. మామూలు జనతా ఫ్లాట్స్ ఎలా ఉంటాయోగానీ ఇవి సూపర్ డీలక్స్ ఫ్లాట్స్ కావటంవల్ల ఉన్నవాళ్ళంతా ఎగువ మధ్య తరగతికి చెందినవాళ్ళే ఉన్నారు. భేషజం, బెట్టూ తప్ప ఆప్యాయతా ఆదరణా లేవు. ఎవరి మధ్యా పరిచయాలూ, పలకరింపులూ లేవు. స్నేహం అన్నది అసలే లేదు. ఎవరి దారి వాళ్ళది. ఎవరి లోకం వాళ్ళది.

పూర్తిగా ఆ ఫ్లాట్స్ గురించి తెలుసుకోకుండా విజ్జీని కూడా ఇక్కడ తెచ్చి పడేసి తప్పుచేశానా అనిపించింది కృష్ణప్రసాద్‌కి. హాస్పటల్‌కి తీసుకువెళ్ళటం అతనికి ఇష్టం లేదు. హరిణి అయితే పేషంట్ కాబట్టి తప్పనిసరి, కానీ విజ్జీలాంటి చిన్న పిల్లని అన్ని రోజులు అక్కడ తిప్పటం మంచిది కాదు. వాళ్ళ రూల్స్ కూడా ఒప్పుకోవు. తామంతా వెళ్ళిపోయాక విజ్జీ ఒక్కత్తే ఉంటే మరి సురక్షితంగా ఉంటుందా?

అదే ప్రశ్న విజ్జీని అడిగితే నవ్వేసింది.

"భయం లేదు పెదనాన్నా. ఇందులోంచి చూసిగానీ తలుపు తీయను." అంది డోర్ ఐని చూపించి. "ఏదన్నా భయం అనిపిస్తే, ఈ బెల్ కొడితే చాలు, వాచ్‌మాన్‌కి వినబడి పరుగెత్తుకొస్తాడు." అంది రాణీపద్మిని.

అప్పటికి బ్రేక్‌ఫాస్ట్ చేసేసి, పిల్లలిద్దరూ పాలు తాగేశారు. రాణీ పద్మిని కృష్ణప్రసాద్ కాఫీ తాగారు.

'భయం అయితే మాతో రా విజ్జీ. కార్లో కూర్చోవచ్చు" అన్నాడు కృష్ణప్రసాద్.

"వద్దు పెదనాన్నా. నాకేం భయంలేదు. ఉంటాను." అంది విజ్జీ.

టీ.వీ., మ్యూజిక్ సిస్టమ్ అన్నీ ఎలా వాడాలో విజ్జీకి తెలుసుకాబట్టి బోర్ కొడుతుందన్న భయం లేదు.

వాచ్‌మ్యాన్ వచ్చాడు

"ఏమన్నా కావాలా సార్? " అన్నాడు.

"ఇప్పటికి ఏం వద్దు. ఈ పాపకి మధ్యాహ్నం భోజనం పంపించు. పాప ఒక్కత్తే ఉంటుంది జాగ్రత్త. ఎవర్నీ రానివ్వకు. కాస్త కనిపెట్టుకుని ఉండు." అన్నాడు కృష్ణప్రసాద్ అతనికి డబ్బు

ఇస్తూ.

"నాకు తెలీదా సార్." అన్నాడు వాచ్ మ్యాన్ నర్సయ్య ఆ డబ్బు అందుకుంటూ.

రాత్రిళ్ళు విజ్జీకి తోడుగా తమ పాపని కూడా ఉంచుతానన్నాడు నర్సయ్య. విజ్జీకి నర్సయ్య తమ పాపని తీసుకొచ్చి చూపించాడు. విజ్జీ, నర్సయ్య కూతురూ ఫ్రెండ్సయిపోయారు. విజ్జీ గురించి కృష్ణప్రసాద్‌కి ఇక ఏ చింతా లేదు. రిలీఫ్‌గా ఫీలయ్యాడు.

హాస్పటల్‌కి వెళ్లారు.

డాక్టర్లు మళ్లీ ఒకసారి హరితని పరీక్షచేసి, అప్పటికప్పుడు అడ్మిట్ చేసేశారు.

★ ★ ★

ఆపరేషన్ టైమ్‌లో తండ్రి కళ్లల్లో కనబడుతున్న ఆందోళన, తనెక్కడ అధైర్య పడుతుందోనని దాన్ని బలవంతాన తొక్కి పట్టి, ధైర్యంగా ఉన్నట్లు ప్రవర్తించటం... తన చేతిని నొక్కి పట్టిన ఆయన చేతిలోంచి తన చేతిలోకి ప్రవహిస్తున్న ధైర్యం, ఓదార్పు ఏవీ హరిణి కళ్లను దాటిపోలేదు. ఆపరేషన్‌కి హరిణి మెంటల్‌గా ప్రిపేర్ అయిపోయింది. కాబట్టి భయం అనిపించలేదు. కానీ తనకు తగ్గాలనీ, తను మామూలు మనిషి కావాలనీ మాత్రం గట్టిగా భగవంతుడిని ప్రార్థించింది. ఆ ప్రార్థన ఆమె కోసం కాదు. తండ్రి కోసం.

"భగవంతుడా. నేను పుట్టాక డాడీని ఎన్నడూ సంతోష పెట్టలేదు. నా కోసం డాడీ సుఖాలన్నీ వదులుకుని బతుకుతున్నారు. ఆయనకి నా గుండె జబ్బు మూలంగా తీరని బాధని కలిగిస్తున్నాను. నాకు తగ్గిపోతే డాడీ చాలా సంతోషిస్తారు. ప్లీజ్ దేవుడా. డాడీ సంతోషం నాకు కావాలి. నా ఆపరేషన్ సక్సెస్ అయ్యేట్లు చేయి." డాడీ ఆనందం కోసం భగవంతుడిని మనసారా ప్రార్థించింది హరిణి.

★ ★ ★

ఆపరేషన్ జరిగిపోయింది. వారం రోజుల దాకా ఉండి మిగతా డాక్టర్లకి అన్నీ వివరించి, తిరిగి అమెరికా వెళ్ళిపోయారు డాక్టర్ రాఘవ.

★ ★ ★

వాచ్‌మెన్ నర్సయ్య విజ్జీని చూసి మొదట చూసినప్పుడు కృష్ణప్రసాద్ కూతురేమో అనుకున్నాడు. ఆ తర్వాత విజ్జీ పెద నాన్నా అని పిలవటం చూసి ఆయన తమ్ముడి కూతురేమో అనుకున్నాడు. విజ్జీని అడిగి వివరాలన్నీ తెలుసుకున్నాక అతనికి ఆశ్చర్యం వేసింది.

కావల్సినవన్నీ తెచ్చి ఇస్తూ, మాట్లాడుతూ ఉంటడం వల్ల విజ్జీతో అతనికి చనువు పెరిగింది. కృష్ణప్రసాద్ ఇంటికి వచ్చి వెళ్లే సమయం తక్కువ. హాస్పటల్‌లో ఒక గెస్ట్ రూం తీసుకుని ఉంటున్నాడు. మధ్య మధ్యలో డబ్బు కావల్సివచ్చినప్పుడూ, విజ్జీని పలకరించి పోవటానికీ మాత్రం ఇంటికి వస్తున్నాడు.

"ఆపరేషన్ సక్సెస్" డాక్టర్లు చెప్పినప్పుడు కృష్ణప్రసాద్‌కీ, రాణీ పద్మినికీ పట్టలేనంత సంతోషం కలిగింది.

"ఆపరేషన్ సక్సెస్... ఆపరేషన్ సక్సెస్". ఏ దేవుడో వరమిచ్చి ఆశీర్వాదాల వర్షం కురిపిస్తున్నట్లూ, ఆయన చల్లని దీవెనలు తన చెవుల్లో మార్మోగుతున్నట్లు ఉంది కృష్ణప్రసాద్‌కి. ఆ సంతోషంలో అతనికి ఆ మాటలే చెవుల్లో గింగుర్లుమంటూ తిరుగుతున్నాయి. మనసు నిండా దేవుడి మీద కృతజ్ఞతాభావం... కళ్ళల్లో నీళ్లు, ఏదో తెలియని మత్తు. అతను ఒక్కసారిగా నేలమీద వాలిపోయి గట్టిగా ఏడ్చేశాడు.

రాణీపద్మిని అతని భుజాన్ని పట్టి పైకి లేవదీసింది. "మరీ అంత ఎమోషనల్‌గా ఉండకూడదు" అంది మందలింపుగా.

"ఇంకొన్ని రోజులు ఇక్కడే ఉండాలి" అని చెప్పారు డాక్టర్లు.

ఒక సూట్‌కేస్‌లో నిండా నోట్లు పెట్టి ఉంచాడు కృష్ణప్రసాద్. ఎప్పుడన్నా కావ

లిస్తే అందులోంచి తీసుకుంటున్నాడు.

డబ్బు లెక్క చూసుకోవడం అతనికి ఎన్నడూ అలవాటు లేదు. కావల్సినది తీసుకుని వాడుకోవటం, చేతికందినంత తీసి అడిగిన వాడికి అడిగినంత ఇవ్వటం తప్ప ఎంత ఖర్చయిందన్నది చూసుకోవటం అతని జీవితంలో లేదు.

ఇప్పుడు మరీ గాభరాలో ఉండటం, హడావిడిగా ఏవో తీసుకువెళ్లటం జరుగుతోంది. అందువల్ల అస్సలు పట్టించుకోవటం లేదు. కానీ రాణీపద్మిని పైసా పైసా లెక్క చూసుకోకపోయినా చూపులతోనే అన్నీ లెక్క వేయగల అసాధ్యురాలు. కృష్ణప్రసాద్ ఎంత డబ్బు తెచ్చిందీ, దానిలో దాదాపు ఎంత ఖర్చు అయి ఉంటుందీ ఆమె మనసులోనే లెక్కలు కట్టగల సమర్థురాలు.

హాస్పటల్ వాళ్ళు మరో యాభై వేలు కట్టమన్నారు కృష్ణప్రసాద్ ఇంటికొచ్చి చూసుకుంటే ముప్పై వేలు మాత్రం ఉన్నాయి.

"క్యాష్ తక్కువ ఉంది. హాస్పటల్ వాళ్లకి చెక్ రాసి ఇస్తాను" అన్నాడు రాణీపద్మినితో.

రాణీపద్మిని ఆశ్చర్యపోయింది.

"అదేంటి? కనీసం ఇంకో డెబ్బై వేలు ఉండాలి" అంది.

"ఏమో. ఖర్చయిపోయి ఉంటుంది. చెక్ రాసి ఇచ్చేస్తానులే" అన్నాడు కృష్ణప్రసాద్.

హరిణి లేచి కూర్చుంటోంది. మెల్లగా లేచి నడుస్తోంది. రోజూ కొంత దూరం నడిపించి తీసుకుని వస్తున్నారు. కృష్ణప్రసాద్‌ని ఆమెతో కాస్సేపు ఉండనిస్తున్నారు. ఆ క్షణాలు కృష్ణప్రసాద్‌కి పండగే.

ముద్దుల వర్షంలో తన పాపని ముంచెత్తాలన్నంత వెర్రి ప్రేమ పుట్టుకొస్తుంది. ఎలాగో తమాయించుకుని తన ప్రేమకీ, ఆప్యాయతకీ అడ్డుకట్ట వేసుకుంటున్నాడు. కళ్లలోనే ప్రేమనంతా నింపుకుని, ఆమెనే అపురూపంగా చూస్తూ ఉండిపోతాడు. తన చేతిని ఆయన చేతిలోకి తీసుకుని, తన కళ్ళల్లోకి ప్రేమగా చూస్తూ గడిపే ఆ క్షణాలు హరిణి జీవితంలో సువర్ణాధ్యాయాలు. డాడీ ఉంటే చాలు హరిణికి ఇంకేం అక్కర్లేదు.

సుమాల సుగంధం ఎవరూ దాచలేరు. ఎక్కడున్నా అవి సువాసనలు వెదజల్లుతూనే ఉంటాయి. మంచితనం కూడా దాగదు. అది ఉబికి ఉబికి ఉప్పెనలా ముంచెత్తుతూనే ఉంటుంది. కృష్ణప్రసాద్ మంచితనం గురించి హాస్పిటల్లో కూడా అందరికీ తెలిసిపోయింది. అది నక్షత్రాల హాస్పిటలే గానీ అక్కడ కూడా కొందరు బీద పేషెంట్స్ పొరపాటున చేరినవాళ్ళున్నారు. వాళ్ళు కృష్ణప్రసాద్ దగ్గరికి వచ్చి బిల్లు కట్టటానికి సాయం చెయ్యమని అడిగారు. కృష్ణప్రసాద్ అడిగినంత డబ్బు ఇచ్చేస్తున్నాడు.

హాస్పిటల్‌లో రోగుల్నీ, రోగాల్నీ చూస్తుంటే కృష్ణప్రసాద్ సున్నితమైన మనస్సు తీవ్రంగా చలించిపోతోంది. ఎన్నెన్ని రోగాలు, ఎన్నెన్ని బాధలు. కార్పొరేట్ హాస్పిటల్ నక్షత్రాల హోటల్‌లా ఉంది. అశ్వనీ దేవతల్లా, అపర ధన్వంతరుల్లా అనిపించే డాక్టర్లు, అత్యుత్తమ వైద్య సేవలూ ఆధునిక పరిజ్ఞానం... అన్నీ అతనికి చాలా ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించినా, అంతలోనే అతనికి అంతులేని ఆవేదన కలుగుతోంది. ఏమిటిది? వైద్యరంగంలో అత్యున్నత శిఖరాలకు చేరుకున్నా, మన దేశంలో ఆ వైద్యం ఎంతమందికి అందుబాటులో ఉంది? ఏదో చెయ్యాలి. వైద్యం సామాన్యుడికి చేరువయ్యేందుకు తనవంతు కర్తవ్యం తను నిర్వర్తించాలి. ఇక్కడి ఖర్చులు సామాన్యుడు భరించగలడా? మనిషికి అందుబాటులో లేనప్పుడు ఇక అది ఉండి మాత్రం ఏం ప్రయోజనం. తన ఆస్థి మొత్తం విరాళం ఇచ్చి మంచి

హాస్పిటల్ కట్టించాలి. అతను నిర్ణయించుకున్నాడు.

"ఇక్కడ కూడా దానధర్మాలు తప్పలేదా?" రాణీపద్మిని కోపంగా అడిగింది. అప్పుడే ఒకతను వచ్చి కృష్ణప్రసాద్ దగ్గర డబ్బు తీసుకువెళ్ళాడు.

"పద్మినీ, నిజంగా డబ్బు అవసరం అయ్యేది ఇక్కడే. ఏ ఖర్చునైనా వాయిదా వెయ్యవచ్చునేమోగానీ మెడికల్ ఖర్చులు మాత్రం ఎవరూ వాయిదా వెయ్యలేరు. లోకంలో ఎన్ని బాధలు, ఎన్ని కష్టాలు? మనిషి జీవితం ఎంత దుర్భరమో హాస్పిటల్‌కి వచ్చి చూస్తే తెలుస్తుంది. రోగం బాధ చాలక ఇంకా డబ్బుకు కూడా కటకట పడుతుంటే ఎంత కష్టం పద్మినీ. హరిణి మామూలు మనిషి కాగానే నాకున్నదంతా అమ్మి పేద వాళ్ల కోసం ఒక హాస్పటల్ పెట్టాలని ఉంది" అన్నాడు కృష్ణప్రసాద్.



రాణీ పద్మిని హడలిపోయింది.

"ఏంటన్నయ్యా? నీకేమన్నా పిచ్చా? ఎవడికి వచ్చింది వాడు అనుభవిస్తున్నాడు. అందరి కోసం నువ్వు బికారివి అవుతావా?" అనుకోకుండానే గట్టిగా అరిచేసింది.

కృష్ణ ప్రసాద్ నవ్వేశాడు.

"ఏంటి పద్మినీ? అంత కోపం దేనికీ? నాకున్నదంతా దానం చేసినా నాకు ఏం తక్కువ? ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు. హాయిగా ఉద్యోగం చేసుకుంటూ, హరిణికి మంచి చదువు చెప్పిస్తాను. విద్య, సౌశీల్యం ఈ రెండూ పిల్లలకి ఇస్తే చాలు" అన్నాడు. అతని మాటల్లో దృఢ నిశ్చయం కనిపిస్తోంది.

అతనికేం చెప్పినా వినడని రాణీ పద్మినికి అర్థమై పోయింది. మౌనంగా ఉండిపోయింది.

★ ★ ★

**హ**రిణిని డిశ్చార్జి చేయవచ్చు అన్నారు.

ఆ సాయంత్రం...

కృష్ణ ప్రసాద్ ఇంటికి వచ్చాడు. అతని మనసు గంతులేస్తోంది.

"పెదనాన్నా, హరిణి ఎలా ఉంది?" విజ్జీ వచ్చి అడిగింది.

"బాగుందిరా తల్లీ. ఇంక మనింటికి వచ్చేస్తుంది" నవ్వుతూ చెప్పి, దారిలో కొన్న స్వీట్స్ విజ్జీ చేతికిచ్చాడు.

విజ్జీ స్వీట్ పాకెట్ తీసుకుని, గంతులేస్తూ పరుగెత్తి వెళ్లింది.

సుధకి ఆ సంగతి చెప్పాలి. అతని మనసు ఆగలేదు. వెంటనే వెళ్ళి సూట్‌కేస్ తెరిచాడు.

నోట్లు తక్కువగా ఉండటం కూడా అతని దృష్టిని ఆకర్షించలేదు కానీ...

సూట్‌కేస్ లోకి చూడగానే అతని గుండె ఆగిపోయినట్లయింది.

తెరవగానే కనబడే ఆ లాకెట్ గొలుసు లేదు. ఏమైంది?

కిందికి పోయి ఉంటుందనే ఆశతో అంతా గబగబా వెతికాడు.

లేదు.

కృష్ణప్రసాద్‌కి పిచ్చెక్కినట్లయింది.

"సుధా... సుధా." పిచ్చిగా సూట్‌కేస్ అంతా వెతుక్కున్నాడు. దొరకలేదు.

ఏమైపోయింది? ఆ గొలుసు ఏమైపోయింది?

"సుధా... సుధా" అతని మనసు క్షోభిస్తోంది. కాళ్ళూ చేతులూ ఆడలేదు. పంచ

ప్రాణాలూ పిండేసినట్లయింది. అదే పనిగా వెతికిన సూట్‌కేస్‌నే తిరిగి తిరిగి వెతుకుతున్నాడు.

విజ్జీ స్వీట్ తినటం పూర్తి చేసి, చెయ్యి కడుక్కుని వచ్చింది.

"విజ్జీ, ఇక్కడ ఒక గొలుసు ఉండాలి. నువ్వేమన్నా చూశావా? " అడిగాడు కృష్ణప్రసాద్.

విజ్జీ తడబడటం స్పష్టంగా కనిపించింది.

"చూశావా విజ్జీ? చూశావా? " అడిగాడు

విజ్జీ పూర్తి గాభరాలో మునిగిపోయింది.

ఏం చెయ్యాలో అర్థంకాలేదు.

"అదీ... అదీ" అంది తడబడుతూ.

"ఏమైంది? నీకు తెలుసా? చెప్పు విజ్జీ."

విజ్జీ వణకిపోతున్నది. ఒక్కసారిగా భోరుమంది.

కృష్ణప్రసాద్ నిర్ఘాంతపోయాడు.

"ఏమైంది విజ్జీ? ఎందుకేడుస్తున్నావు? " అన్నాడు.

"నాకేం తెలీదు పెదనాన్నా. నన్ను తిట్టకు. అదీ... ఆ గొలుసు..." అంటూ ఆగిపోయింది.

"ఏమైంది ఆ గొలుసు? చెప్పటానికి ఎందుకు భయం? చెప్పు నిన్నేం అనను" అన్నాడు కృష్ణప్రసాద్.

"ఆ గొలుసు నర్సయ్యకి ఇచ్చాను పెదనాన్నా" అంది విజ్జీ.

"నర్సయ్యకా? ఎందుకూ? " ఆశ్చర్యపోతూ అడిగాడు.

"ఆ గొలుసు, అప్పుడప్పుడు డబ్బులూ కూడా ఇచ్చాను పెదనాన్నా."

"ఎందుకిచ్చావు? "

"ఎందుకంటే నర్సయ్య నాకు చాక్లెట్లు, స్వీట్లు తెచ్చి నోట్లు ఉంటే తెమ్మంటాడు. మన సూట్‌కేసులోంచి నోట్లు తీసి ఇచ్చాను. మొన్న గొలుసేమన్నా ఉంటే ఇమ్మన్నాడు. తీసుకెళ్ళి ఇచ్చాను" అంది విజ్జీ బెదురుగా చూస్తూ.

కృష్ణప్రసాద్ కోపంతో కంపించిపోయాడు. అబద్ధాలు, దొంగతనం అతను అమితంగా అసహ్యించుకునే విషయాలు.

గతిలేని స్థితిలో నర్సయ్య దొంగతనం చేసిఉంటే మాత్రం కృష్ణప్రసాద్ తప్పకుండా క్షమించి ఉండేవాడు. కానీ నర్సయ్యకి అలాంటి పరిస్థితి లేదు. వసతి, మంచి జీతం ఉన్నాయి. అతను చిన్నపిల్లను మోసం చేసి డబ్బూ, నగలూ కాజేయటం కృష్ణప్రసాద్‌లాంటి శాంత స్వభావికి కూడా ఆగ్రహం తెప్పించింది.

అతను వెంటనే నర్సయ్యను పిలిపించాడు.

నర్సయ్య రాలేదు.

"ఇప్పుడు నాకు పనుంది. డ్యూటీలో ఉన్నాను. నైట్ వాచ్‌మన్ వచ్చాక డ్యూటీ మారుతుంది, అప్పుడు వస్తాను" అని చెప్పి పంపాడు.

కృష్ణప్రసాద్ ఎందుకు పిలిచాడో అతనికి వెంటనే అర్థమైపోయింది.

డబ్బూ, నగలూ అంటే కృష్ణప్రసాద్‌కి లెక్కే లేదని అతనికి అంతా చెప్పారు. అతనూ అలాగే అనుకున్నాడు. విజ్జీ కూడా అలాగే చెప్పింది. బాల్కనీలో ఉగ్రంగా నిలబడ్డ కృష్ణప్రసాద్‌ని చూసి అతనికి భయం వేసింది. రిస్కు తీసుకుని డబ్బూ, గొలుసూ ఎందుకు కొట్టేశానా అని బాధకూడా కలిగింది. కానీ చేతులు కాలాక ఆకులు పట్టుకుని లాభం లేదని నర్సయ్యకి తెలుసు. అందుకే తన వంతు పనిగా ఏం చేయాలో ఆలోచించటం మొదలు పెట్టాడు.

నర్సయ్య నేరుగా తనకు ఈ మధ్యనే పరిచయమైన పొట్టిరాజు దగ్గరికి వెళ్లాడు. పొట్టిరాజుకి ఛోటామోటా నాయకులతో, గల్లీ లీడర్లతో పరిచయాలున్నాయి. అతను తిమ్మిని బమ్మీ, బమ్మిని తిమ్మీ

> జీవితాన్ని ఏ భావాలతో నింపుకుంటామో అలాంటి భావాలే మనకు ఎదురు పడతాయి.
> — ఎమర్సన్

## ఎక్కడుంది చైనా?



ఓ కుర్రాడు స్కూలునుంచి ఏడ్చుకుంటూ ఇంటికి వచ్చాడు. ఎందుకు నాన్నా ఏడుస్తున్నావ్? అన్నాడు తండ్రి. 'మాస్టారు చైనా ఎక్కడుందని అడిగితే చెప్పలేకపోయా.. అందుకని కొట్టారు' అన్నాడు వాడు బెక్కుతూ. 'అయ్యో.. అలాగా? ఏదెక్కడ పెట్టిందీ గుర్తుంచుకోవాల్రా నాన్నా. ఇంతకీ అదెక్కడ పెట్టావో ఇప్పటికైనా గుర్తొచ్చిందా?' అన్నాడు ప్రేమగా ఓదార్చుతూ.

చేయగలడు. మసిపూసి మారేడు కాయ చేయగలడు. అతనికి ఉండాల్సిన దానికన్నా చాలా ఎక్కువ తెలివి ఉండటం మూలంగా బంధువులంతా ఏ సాయం కావాల్సి వచ్చినా అతడినే అడుగుతారు.

"నువ్వే ఏదన్నా చేసి నన్ను రక్షించాలి" అన్నాడు ఏడుపు గొంతుతో.

పొట్టిరాజు ఆలోచించాడు. అక్కడి పరిస్థితి అంతా అడిగి తెలుసుకున్నాడు.

"శుభ్రంగా ఇరుక్కున్నావు. ఆ పిల్ల నీ గురించి అంతా చెప్పేసి ఉంటుంది. ఆ గొలుసేం చేశావు?"

"మార్వాడీ కొట్లో అమ్మాను"

"నిండా మునిగిపోయావు. వాడు కంప్లయింట్ ఇచ్చి, తీగె లాగాడంటే డొంకంతా కదుల్తుంది. నువ్వే అని మార్వాడీ సాక్ష్యం ఇస్తాడు. శుభ్రంగా జైలుకి పోతావు".

నర్సయ్య వణికిపోయాడు.

"ఎట్లా మరి?" అన్నాడు ఏడుపు గొంతుతో.

"అదేమరి. నువ్వు నీ పరిస్థితేంటో ఆలోచించుకోనక్కర్లేదా? నువ్వు వాచ్‌మాన్‌వి. నువ్వే దొంగతనం చేశావంటే ఏమన్నా ఉందా? పెద్ద శిక్షే వేస్తారు. బయటకు వచ్చాక కూడా మళ్లీ ఎక్కడా పని దొరకదు" అన్నాడు పొట్టిరాజు.

"ఇప్పుడేం చెయ్యాలి?" నర్సయ్య రాజ్‌కుమార్ కాళ్లమీద పడిపోతూ

"మార్వాడీ ఎంత ఇచ్చాడు"

"ఆ. అయితే దాని ఖరీదు ఇంతని చెప్పాడు నర్సయ్య. లక్షల్లో ఉంటుంది. ఇదీ మంచిదేలే. అంత ఖరీదైంది కాబట్టి వాడు దాని గురించి ఈపాటికి జాగ్రత్తపడే ఉంటాడు. ఆ విషయం బయటకి రాదు. సరే ఆ పిల్ల దగ్గర్నుంచి ఎంత లాగావు?"

"ఆహా యాభై వేలుంటుంది"

"సరే. నాకు యాభై వేలివ్వు. కథ నడుపుతాను"

ఆపైన అతను చెప్పిన మాటలు విని నర్సయ్య వణికిపోయాడు.

"అమ్మో" అన్నాడు.

"ఏమిటి అమ్మో? ఇంకోలా చేస్తే చస్తావు. ఇది తప్ప వేరే గతిలేదు ఆపైన నీ ఇష్టం." అన్నాడు పొట్టిరాజు.

నర్సయ్యని మళ్లీ పిలిచాడు కృష్ణప్రసాద్. "నేను రాను. ఏం చేసుకుంటాడో చేసుకోమను" అమర్యాదగా చెప్పి పంపాడు నర్సయ్య.

డబ్బు సంగతి ఎలా ఉన్నా కనీసం ఆ గొలుసు తిరిగి ఇచ్చేస్తే నర్సయ్యని క్షమించేద్దామనే అనుకున్నాడు కృష్ణప్రసాద్. ఇప్పుడతనికి మరీ కోపం వచ్చేసింది.

"సరే ఏం చేయాలో నాకు తెలుసు"

అన్నాడు.

ఆరోజే హరిణిని డిశ్చార్జ్ చేసేరోజు.

"నర్సయ్య ఏం చేశాడో తెల్సా? " కృష్ణప్రసాద్ రాణీ పద్మినికి జరిగిందంతా చెప్పాడు. రాణీపద్మినితోపాటు హరిణి కూడా విన్నది.

"కృష్ణా, అందుకే ఆ విజ్జీని తీసుకురావ ద్దంటే విన్నావుకాదు. మనమే కష్టాలు పడి చస్తుంటే వీళ్ళందరినీ నెత్తిన పెట్టుకుని వచ్చావు. ఇప్పుడు దాని బుద్ధి చూశావా? ఆ అలగావాళ్ళతో చేరిపోయి మనకే ఎసరు పెట్టింది" రాణీపద్మిని కోపంగా అంది.

"చిన్నపిల్ల ముచ్చటపడి వచ్చింది. పాపం దానికేం తెలుస్తుంది. ఇలాంటి మోసాలు ఉంటాయని మనమే ముందు ఊహించి చెప్పాల్సింది" అన్నాడు కృష్ణప్రసాద్.

"డబ్బు పోతే పోయిందిలే. కనీసం సుధ గొలుసు అయినా నర్సయ్య తెచ్చి ఇస్తే చాలు" అన్నాడు. నర్సయ్య అది తిరిగి ఇస్తాడనే అతను అనుకున్నాడు.

రాణీ పద్మినికి కోపంతో మండిపోతున్నా ఏంచేయలేక ఊరుకుంది. హరిణి డిశ్చార్జ్ అయాక ఆ తర్వాత నర్సయ్య పని చూడొచ్చులే అనుకుంది.

హరిణి డిశ్చార్జ్ అయి వస్తుంటే కృష్ణప్ర సాద్ ఆనందం పట్టలేకపోయాడు.

తండ్రి ఆనందం చూసి హరిణి మనసు సంతోషంతో గంతులేసింది.

తండ్రి అంత సంతోషంగా ఉండటం హరిణి ఎన్నడూ చూడలేదు. ఇన్నాళ్ళుగా ఆయన్ని సంతోషంగా చూడాలని ఎంతో ఎంతో అనుకుంది హరిణి. ఈ లోకంలో తండ్రి తప్ప ఎవరూ తెలియని మనిషి హరిణి.

హరిణి తిరిగి ఇంట్లో అడుగుపెట్టింది. కృష్ణప్రసాద్‌కి కడుపు నిండిపోయినట్లనిపిం చింది.

హరిణికి ఒళ్ళు తుడిచి, గౌనువేసి, అన్నం తినిపించి పడుకోబెట్టింది రాణీ పద్మిని. విజ్జీని కూడా పిలిచి, భోజనం వడ్డించింది. అంతా తినేశారు.

"ఇంక నేను వెళ్తాను" అంది రాణీపద్మిని. రాణీ పద్మిని వెళ్ళిపోయాక అంతా విశ్రాంతి తీసుకుంటున్నారు.

కాలింగ్ బెల్ మోగింది. కృష్ణప్రసాద్ వెళ్ళి తలుపు తెరిచాడు. ఎదురుగా పోలీసులు.

"కృష్ణప్రసాద్ ఎవరు? " పోలీస్ ఇన్స్పెక్టర్ అడిగాడు.

"నేనే"

"యు ఆర్ అండర్ అరెస్ట్" అన్నాడు ఇన్స్పెక్టర్ కరుగ్గా.

కృష్ణప్రసాద్‌కి మతిపోయినట్లయింది.

"ఎందుకు? " అన్నాడు.

హరిణికి ఈ మాటలు విని మెలకువ వచ్చింది. ఇంట్లో పోలీసుల్నీ వాళ్ళు తండ్రితో మాట్లాడుతున్న

తీరునీ చూసి హరిణికి ఏమీ అర్థం కాలేదు. అయోమయంగా చూస్తోంది.

"అదంతా స్టేషన్‌లో మాట్లాడు. పాపా, మాతోరా" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఆ పాప ఎందుకు? " కృష్ణప్రసాద్ అడిగాడు.

"ఈ కేసులో ఆ పాప ప్రధాన సాక్షి"

"అసలు మీరేం మాట్లాడుతున్నారు. నన్నెందుకు అరెస్ట్ చేస్తున్నారు? " కృష్ణప్రసాద్ అయోమయంగా అడిగారు.

అంతలోనే కొంత మంది రిపోర్టర్లూ, ఫొటోగ్రాఫర్లూ వచ్చేశారు. పొట్టి రాజు కృష్ణప్రసాద్ తప్పించుకుంటాడేమో, డబ్బున్నవాడు కదా మీరూ రావాలి. వచ్చి అతని ప్రయత్నాలు అడ్డుకుని, ఆ పాపను రక్షించండి" అని చెప్పాడు.

"అన్నిటికీ సాక్ష్యాలున్నాయి. డబ్బుందని మీరు ఏ వేషాలు పడితే ఆ వేషం వేయటానికి కుదరదు. మీడియా అంతటికీ ఈ విషయం తెలిసిపోయింది. పిచ్చి ప్రయత్నాలు మాని, మాతో సహకరించి, మీ



నేరం ఒప్పుకోవటం మంచిది" అన్నాడు ఇన్స్‌పెక్టర్ కటువుగా కృష్ణ ప్రసాద్‌నీ, విజ్జీనీ తీసుకుని బయటకు నడిచాడు ఇన్స్‌పెక్టర్.

"డాడీ" అరిచింది హరిణి.

కృష్ణప్రసాద్ ఒక్కసారిగా వెనక్కు తిరిగాడు. పోలీసుల వలయం నుంచి తప్పించుకుని తటాల్న హరిణిని చేరుకున్నాడు.

"డాడీ" హరిణి చేతులు చాచింది.

కృష్ణప్రసాద్ ఆమెని అక్కున చేర్చుకున్నాడు.

"భయపడకు హరిణీ. ఏం కాదు. మనలో తప్పు లేనప్పుడు ఎందుకు భయపడాలి? దేవుడున్నాడు. అంతా చూసుకుంటాడు. ప్లీజ్, ఏడవకు. అత్తకి ఫోన్ చెయ్యి" అన్నాడు హరిణి వీపు నిమురుతూ.

"పదండి" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

కృష్ణ ప్రసాద్ పోలీసుల వెంట నడిచాడు.

హరిణికి కాళ్ళూ చేతులూ వణుకుతున్నాయి. మనిషి నిలువునా కంపించి పోతోంది.

చుట్టూ చూసింది. పట్టించుకునే నాథుడు లేడు. ఇద్దరు మాత్రం బయటికి వచ్చి చూసి హరిణి అటువైపు చూడగానే తలుపు మూసుకున్నారు.

కృష్ణప్రసాద్ పోలీసులతో వెళ్తుంటే ఫ్లాట్లలో వాళ్ళు చూడనట్లు నటించారు. ఏమైందని అడిగిన వాళ్ళు లేరు.

హరిణి ఏడుస్తూ రాణీ పద్మినికి ఫోన్ చేసింది.

"అత్తా, డాడీని పోలీసులు తీసుకెళ్లారు".

ఏడుస్తూ చెపుతున్న హరిణి మాటలు రాణీ పద్మినికి మొదట అర్థం కానే లేదు.

"ఏమైందే? అసలు వస్తున్నానుండు. ఎటూ వెళ్లకు. భయపడకు." అంది రాణీ పద్మిని.

వెంటనే బయల్దేరి కారు వేగంగా నడుపుకుంటూ వచ్చింది. ఆమెకి కూడా అయోమయంగా ఉంది. వచ్చాక ఆమెకి

భర్తకి ఫోన్ చెయ్యాలన్న ఆలోచన.

గబగబా రామ్‌కుమార్‌కి ఫోన్ చేసింది.

అతను నిర్ఘాంతపోయాడు.

"ఎవరనుకుని ఎవర్ని తీసుకెళ్లారో. నేను వెళ్ళి విడిపించుకుని వస్తాను. భయం లేదు" అన్నాడు ధైర్యం చెపుతూ. తనే అన్నీ చూసుకుంటాననీ, రాణీ పద్మినిని హరిణి విషయం మాత్రం చూసుకోమనీ చెప్పాడు.

అతను ఊహించిన విషయం వేరు. జరుగుతున్న పరిణామాలు వేరు. కేసు అతను అనుకున్నంత ఈజీ కాదు. నర్సయ్య, పొట్టి రాజు ఒక వ్యూహం ప్రకారం పకడ్బందీగా అల్లిన వల.

అందులో కృష్ణ ప్రసాద్ పూర్తిగా ఇరుక్కుపోయాడు.

విజ్జీ ఆ ఇంట్లో పని పిల్ల అనీ, చిన్న పిల్లల్ని పనిలో పెట్టుకోవటం నేరం అనీ, కృష్ణప్రసాద్ ఆమెతో వెట్టి చాకిరీ చేయించుకుంటూ, ఊర్నుంచి ఇక్కడికి కూడా బలవంతంగా తీసుకొచ్చాడనీ, ఆమె పట్ల క్రూరంగా ప్రవర్తించే వాడనీ కేసు బనాయించారు. అంతే కాదు కృష్ణప్రసాద్ ఆమెని లైంగిక వేధింపులకి కూడా గురి చేశాడనీ, రెండు సార్లు ఆ పాప పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తుంటే తను అడ్డుకో పోతే కృష్ణప్రసాద్ తనని 'ఏం చేస్తానో చూడు?' అని బెదిరించాడనీ నర్సయ్య కంప్లయింట్ ఇచ్చాడు. రాజు అంతకు ముందే నారాయణపురంకి మనుషుల్ని పంపి విజ్జీ తల్లిదండ్రుల్ని పిలిపించాడు. డబ్బూ, నగలూ చోరీ అయ్యాయనీ విజ్జీ ఒక్కత్తే ఇంట్లో ఉండటం వల్ల ఆ దొంగతనం ఆమె నెత్తికే చుట్టుకుంటుందనీ బెదిరించాడు.

"అయ్యో బాబోయ్, ఏదో ఊరు చూస్తానంటే పంపించాం, ఇదేం గొడవ... ఇప్పుడు ఏం జరుగుతుంది? " అన్నారు వాళ్ళు హడలిపోయి.

"మీ పిల్లని తీసుకెళ్లి జైల్లో పెడతారు. ఏ పదేళ్ళో జైలు పడుతుంది. అది చిన్న పిల్ల కాబట్టి ఆ నగలు మీకే ఇచ్చి ఉంటుందని మిమ్మల్ని కూడా బొక్కలోకి తోసి మక్కెలిరగ గొడతారు" అన్నాడు రాజు.

వాళ్లకి రాజు తప్ప తమని రక్షించే నాథుడు కనిపించలేదు.

"నువ్వే ఏదో ఒకటి చేసి మమ్మల్ని రక్షించాలి బాబూ" అని కాళ్లమీద పడ్డారు.

వాళ్లకి అతను దేవుడిలాగా కనిపిస్తున్నాడు.

"ఏం చేయమంటారు బాబూ. పేద వాళ్లం మాకు దిక్కేది? " అన్నారు.

"నేనేం చెపితే అది చేస్తే చాలు" అన్నాడు రాజు.

ఆ తర్వాత వాళ్లేం చెప్పాలో అంతా బోధించాడు. వాళ్లకి చెప్పిన మాటలే అంతకు ముందే విజ్జీకి చెప్పి ఆమె చేత కూడా ఏం చెప్పాలో ఎలా తప్పించుకోవాలో అని ప్రాక్టీస్ చేయించాడు.

★ ★ ★

నల్లటి చీకట్లు ముసురుకుంటున్నాయి. పోలీస్ స్టేషన్లో కూర్చున్న కృష్ణప్రసాద్‌కి తనేమిటో ఎక్కడున్నాడో కూడా అర్థం కాని అయోమయ స్థితి ఆవరించింది. అసలేం జరుగుతోంది? ఎందుకు జరుగుతోంది? ఏమిటిదంతా? నిలువెల్లా నిస్పృహతో దిగులూ దుఃఖాల ప్రతిబింబంలా ఉన్నాడు. అన్నిటికీ మించి హరిణిని గురించిన ఆలోచన.

రామ్ కుమార్ లాయర్ని వెంట పెట్టుకుని వచ్చాడు. వాళ్లని చూడగానే కృష్ణప్రసాద్‌కి ప్రాణం లేచి వచ్చింది.

"ఏం జరిగింది? " లాయరు అన్నీ తెలుసుకున్నాడు. కేసు వివరాలు విని అడ్వకేట్ మొహం కళ తప్పింది.

"బెయిల్ దొరకటం కష్టం" అన్నాడు.

"ప్రయత్నిద్దాం" అన్నాడు రామ్ కుమార్.

అప్పటికి కృష్ణప్రసాద్‌కి కేసు వివరాలూ, దాని తీవ్రతా తెలిశాయి.

ముక్కుకి సూటిగా పోవటం, నిర్మలంగా ప్రవర్తించటం తప్ప అతనికి మరోటి తెలియదు. ఇట్లా దొంగ దెబ్బ తీసే వాళ్లుంటారని అతనికి తెలియదు. అందుకే అతను ఇలా జరగవచ్చునేమో అని కూడా ఎంత మాత్రం ఊహించలేక పోయాడు. ఇది అతనికి పెద్ద షాక్. ఊహించలేని దెబ్బ. అతను దాన్ని తట్టుకోలేక విలవిలలాడాడు. గుండె మీద సమ్మెట పోట్లు పడ్డట్లు బాధ పడుతున్నాడు.

నర్సయ్యకు తను అడిగినంత డబ్బిచ్చాడు. ఏ సాయం కావాలన్నా చేస్తానన్నాడు. లోకంలో అంతా తన సొంత మనుసులేననీ, తన అన్నదమ్ముల్లాంటి వాళ్లేననీ నమ్మిన తనకా ఇంత నింద!

ఇదేం లోకం? విజ్జీని తను ఎంతగా ఆదరించాడు. ప్రేమతో తమ ఇంట్లో కూతురిలా ఆదరిస్తున్న విజ్జీ పని మనిషా? పసిపిల్లను పనిలోకి పెట్టుకుని ఆపైన లైంగికంగా వేధిస్తున్న కఠినాత్ముడా తను? అయ్యో, ఎంత మాటలంటున్నారు.

కృష్ణప్రసాద్ అంతవరకూ గౌరవమూ, ఆదరమూ తప్ప మరొకటి ఎరగడు. ఈ అవమానం, తిరస్కారం అతన్ని నిలువునా కృంగదీశాయి.

మంచినీ, మానవత్వాన్నీ మాత్రమే నమ్ముకున్న మనిషి కృష్ణప్రసాద్. ఒక్కసారిగా తనకు ఎంతమాత్రం పరిచయం లేని దుర్మార్గాన్నీ, దానవత్వాన్నీ చూసిన అతని గుండె క్షోభించింది. గుండెల్లో నెప్పిగా అనిపించి ఛాతీ రుద్దుకున్నాడు.

"ఏమైంది? నెప్పా?" అడిగాడు రామ్‌కుమార్.

"లేదు" అనేసి ఊరుకున్నాడు కృష్ణప్రసాద్.

"సరే. బెయిల్ కోసం సాధ్యమైనంత ప్రయత్నిస్తాను" అన్నాడు అడ్వకేట్.

అతని ప్రయత్నం ఫలించలేదు.

కృష్ణప్రసాద్ దురదృష్టమో నర్సయ్య అదృష్టమో గానీ నర్సయ్యకీ, విజ్జీ కేసుకీ విపరీతమైన పబ్లిసిటీ లభించింది. ధనమదంతో కన్నూమిన్నూ కానని వ్యక్తిగా కృష్ణప్రసాద్‌కి ముద్రపడిపోయింది. చాలా సంఘాలవాళ్ళు స్వచ్ఛందంగా వచ్చి నర్సయ్యకి అండగా నిలబడ్డారు. కృష్ణప్రసాద్ రాక్షసుడిలాంటి మనిషనీ, అతనికి బెయిల్ ఇస్తే సాక్ష్యాలు తారుమారుచేసి, సాక్షులను బెదిరించటం జరుగుతుందనీ వాదనలు జరిగాయి. కృష్ణప్రసాద్‌కి బుద్ధిచెప్పి తీరాలనీ, అతనికి శిక్షపడాలనీ ధర్నా కూడా జరిగింది.

నర్సయ్యే తన డబ్బూ, నగలూ తీసుకున్నాడని కృష్ణప్రసాద్ చెప్పిన మాటలు ఎవరూ వినలేదు.

"లక్షల్లో డబ్బు, గొలుసూ ఇంట్లో ఉంచి చిన్నపిల్లను వదిలేసి వెళ్ళేంత అమాయకుడివా?" అని అడిగారు.

"వాచ్‌మాన్ నన్ను నమ్మించాడు. పాపని తన కూతురిలా చూసుకుంటాననీ, ఇంటికి ఎవరూ రాకుండా చూస్తూ ఉంటాననీ అన్నాడు. నమ్మాను" అంటే అంతా నవ్వేశారు.

"మరి అవి పోయినప్పుడు ఎందుకు రిపోర్ట్ ఇవ్వలేదు?" తిరిగి ప్రశ్నించారు.

ఆ కళ్లల్లో అనుమానం, అవహేళన, తిరస్కారం కృష్ణప్రసాద్‌ని నిలువునా కృంగదీశాయి.

బంధుమిత్రుల్లో అంతా అతనిచేత ఏదోవిధంగా సాయం పొందినవాళ్ళే.

కానీ అతను ఇలాంటి కేసులో ఇరుకున్నాడని తెలియగానే వాళ్ళల్లో ఒక్కళ్ళుకూడా అతన్ని చూడటానికి రాలేదు.

రాణీపద్మిని కొందర్ని కలిసి సాయం అడుగుదామని ప్రయత్నించింది. ఇంట్లో ఉండే లేనట్లు చెప్పించారు వాళ్ళు. కొంత మందికి ఫోన్లు చేసింది.

రాణీ పద్మిని ఫోన్లు చేస్తున్నప్పుడు హరిణి అక్కడే ఉంది.

"మాకు కేసులంటే భయం. అయినా ఏదోముందే సెటిల్ చేసుకోవలసింది. ఇలా ఇంతదాకా తెచ్చుకుంటే ఎలా?" ఈ మాటలు అన్నవాళ్ళు చాలా కొద్దిమంది. మిగతా వాళ్ళయితే ఫోన్లో కూడా దొర క్కుండా జాగ్రత్తపడ్డారు.

"ఏమైందత్తా? ఎందుకిలా జరుగుతుంది?" ఏడుస్తూ అంది. కేసుగురించి హరిణికి కూడా అర్థమైపోయింది.

రాణీపద్మిని హరిణిని దగ్గరకు తీసుకుని బావురుమంది.

"అయ్యో. ఏం చెప్పనే. నల్లనివన్నీ నీళ్ళు తెల్లటివన్నీ పాలు అనుకుంటాడు మీ పిచ్చి డాడీ. పాముకి పాలుపోసి పెంచినట్లు అపాత్రదానం చేసి అంతా పోగొట్టుకున్నాడు. పోనీలే డబ్బుపోయినా మనుషులన్నా బాగున్నారనుకుంటే నువ్వు ఇలా చేశావు. ఆ దరిద్రం, ఆ తద్దినం విజ్జీని వద్దన్నా హైదరాబాద్ తీసుకొచ్చావు. అది ఇప్పుడు ఆ నర్సయ్యతో చేరి సొమ్ములన్నీ వాడికి చేరేసింది. ఏది పోయినా ఊరుకునే వాడే మీ వెర్రిడాడీ. కానీ మీ మమ్మీ గొలుసు తీసుకునే సరికి ఎక్కడలేని పట్టుదలా వచ్చింది. అంతా మనఖర్మ. దాని బుద్ధి చూడు. ఫ్రెండు ఫ్రెండని నువ్వు చంకలు కొట్టుకుంటూ తెచ్చావు. అది శుభ్రంగా మెక్కి, తిన్న ఇంటి వాసాలు లెక్క బెట్టింది. ఇప్పుడుచూడు. దాన్ని పనిమనిషిగా పెట్టుకున్నాడనీ ఇంకేదో చేశాడనీ అంటున్నారు. అన్నయ్యకి జైలుశిక్ష పడుతుంది. చూశావా ఈ దారుణం. నల్లటివన్నీ నీళ్ళుకావు, మెరిసేదంతా బంగారం కాదు. మనుషుల్లో రాక్షసులే అందరూ.

ఒక్కో సత్యమూ బోధపడుతోంది హరిణికి. హరిణి అణువణువూ డాడీ డాడీ అని పరితపించి పోతోంది. ఆ చల్లటి గుండెలో తలదాచుకోవాలనీ, ఆయన తినిపిస్తుంటే అన్నం తినాలనీ, ఆ చేతుల్లో నిద్రపోవాలనీ అంతులేని తపన, ఆవేదన.

దేవుడి లాంటి డాడీమీద ఇంత నిందమోపుతుందా ఈ లోకం... అన్నివిధాలా సాయం పొంది కూడా ఒక్కరుకూడా కనీసం ఇటు మొహం కూడా తిప్పలేదు. ఇదా లోకుల మనస్తత్వం! లోకంలోని కుళ్ళు స్వార్థం చూసి హరిణికి మతిపోయినట్లవుతోంది. "డాడీ, డాడీ. ఈ లోకం ఇంత దుర్మార్గ మైందని ఎందుకు కనిపెట్టలేకపోయావు డాడీ," హరిణి గుండె ఆక్రోశిస్తోంది.

రాణీపద్మినికి ఇక మిగిలిన ఒకేఒక్క ఆశ... ఆమె తల్లి తండ్రుల సాక్ష్యం. వాళ్ళ కోసం ప్రయత్నించింది.

"ఎవరో హైదరాబాద్ నుంచి వచ్చి తీసుకెళ్ళారు. ఇక్కడ వాళ్ళెవళ్ళూ లేరు" అన్నారు.

ఎవరు వచ్చారు? ఎవరు తీసుకెళ్ళారు. నర్సయ్యే అయిఉంటాడు. రాణీ పద్మిని మనసు కీడు శంకించింది.

తిరిగి హైదరాబాద్ వచ్చింది. హార్ట్ ఆపరేషన్ జరిగిన పసిపిల్ల హరిణిని చూసుకోవటం ఒకపక్క... కృష్ణప్రసాద్ కేస్ సంగతి మరోపక్క రాణీపద్మినిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

విపరీతమైన పట్టుదల, కార్యదీక్ష ఉన్న మనిషి రాణీపద్మిని. అందుకే ఇంతంత సంఘటనలు అనుకోనివి జరుగుతున్నా నిరాశపడకుండా తన ప్రయత్నాలు కొనసాగిస్తోంది.

కృష్ణప్రసాద్ కస్టడీలోనే ఉన్నాడు. కేసు కొనసాగుతోంది.

★ ★ ★

ఆరోజు కోర్టులో హియరింగ్.

కృష్ణప్రసాద్ కడ ఆశతో ఉన్నాడు. ఏమూలో ఆశ... విజ్జీ తల్లిదండ్రులూ, విజ్జీ తనకు అనుకూలంగా సాక్ష్యం చెపుతారేమోనని.

ముందుగా నర్సయ్య సాక్ష్యం.

ఆ తర్వాత విజ్జీ తల్లితండ్రులు చెప్పారు. "ఈ కృష్ణప్రసాద్ బాబంటే మాకు చాలా భయం. అందుకే ఇష్టంలేకున్నా పిల్లని పనిలో చేర్పించాం. లేకుంటే మమ్మల్ని చంపేస్తాడేమోనని భయం వేసింది. వద్దు బాబూ మా పిల్లని మా కళ్ళముందు ఉంచు చాలు అని కాళ్ళమీద పడి వేడుకున్నా ఆయనకి కనికరం లేకపోయింది. ఇక్కడికి తెచ్చి, నానాచాకిరీ చేయించి..." మొహాన చెంగు కప్పుకుని ఏడుస్తూ చెప్పింది విజ్జీ తల్లి. విజ్జీ తండ్రి కూడా అదే చెప్పాడు.

ఆ తర్వాత విజ్జీ సాక్ష్యం చెప్పింది. కృష్ణ ప్రసాద్ తన తల్లిదండ్రుల్ని బెదిరించి తనను పనిలోకి తీసుకున్నాడనీ, బలవంతంగా హైదరాబాద్‌కి తీసుకొచ్చాడనీ, ఎవరూ లేనపుడు ఒళ్ళంతా ఎక్కడెక్కడో తడిమేవాడనీ చెప్పి ఏడ్చింది.

కృష్ణప్రసాద్ కళ్ళు విప్పార్చుకుని వింటున్నాడు. విజ్జీ చెప్పుకుంటూ పోతోంది.

హరిణి మతిపోయిన దానిలా చూస్తోంది. అన్నీ వింటుంటే తను అసలు ఎవరు హరిణేనా అన్న అనుమానం వచ్చింది. అంతా రాక్షసులు... పిశాచాలు... తనూ ఒక పిశాచి. తన మూలంగానే డాడీ విజ్జీని హైదరాబాద్ తెచ్చారు. ఆయన మంచి తనానికి ఇదాశిక్ష. తనకు అంతచేసిన డాడీకి తను తిరిగి ఇచ్చింది ఇదా? తామంతా పిశాచాలు. అంతా కలిసి డాడీని పీక్కుతింటున్నారు.

"అయ్యో డాడీ. ఇంత అమాయకంగా ఎందుకున్నావు డాడీ" హరిణి గుండె ఆక్రోశిస్తోంది.

విజ్జీ సాక్ష్యం ముగిసింది.

అంతా వాళ్ళవైపే చూస్తున్నారు.

ఇంతలో... దబ్బుమన్న చప్పుడు. అందరూ ఉలిక్కిపడి అటు చూశారు. కృష్ణ ప్రసాద్ గుండె పట్టుకుని నేలమీదికి ఒరిగిపోయి ఉన్నాడు.

"డాడీ" హరిణి బిగ్గరగా ఏడ్చింది. కృష్ణప్రసాద్‌ని హాస్పటల్‌కి తరలించారు.

'వండర్ హెల్త్ హాస్పటల్.

అందులో ఇంటెన్సివ్ కేర్ యూనిట్...

కృష్ణప్రసాద్ బెడ్‌మీద కళ్ళు మూసుకుని పడుకుని ఉన్నాడు. మత్తులో ఉన్న అతని మొహం ఆందోళనగా, ఉద్రిక్తంగా అశాంతిగా ఉంది.

ఉండుండి అతను ఒక్కసారిగా కళ్ళు తెరిచాడు. "హరిణీ" గట్టిగా పలవరించాడు. ఆ నిశ్శబ్దంలో అతని కంఠం భయంకరంగా వినిపించింది.

డ్యూటీ డాక్టర్ పరుగెత్తుకుని వచ్చాడు. పక్కనే ఉన్న నర్సులూ, రాణీ పద్మినీ అంతా పరుగెత్తుకుని వచ్చారు.

"అన్నయ్యా" కృష్ణప్రసాద్ కళ్ళు తెరిచాడన్న ఆనందంతో, కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, ఆతృతగా పిలిచింది రాణీపద్మిని.

"పద్మినీ, హరిణి ఎక్కడ?" కృష్ణప్రసాద్ ఆతృతగా అడిగాడు.

"ఇంట్లో ఉందన్నయ్యా. నిద్రపోతోంది. పడుకో రేపు పొద్దున్నే పిల్చుకుని వస్తాంలే" అంది రాణీపద్మిని.

కృష్ణప్రసాద్ విరక్తిగా, నిరాశగా నవ్వాడు. "నాకంత టైమ్‌లేదు" అన్నాడు.

పద్మిని ఉలిక్కిపడింది.

"ఏంటన్నయ్యా ఏమిటిది? నీకేం హాయిగా రికవర్ అవుతావు" అంది.

పడుకోండి ప్లీజ్ రిలాక్స్. లేకపోతే మీ లైఫ్‌కే రిస్క్"డ్యూటీడాక్టర్ హెచ్చరించాడు.

"నా విషయం నాకు బాగా తెలుసు. పద్మినీ హరిణిని పిలు" కృష్ణప్రసాద్ దృఢంగా అన్నాడు.

పద్మిని అయోమయంగా చూస్తోంది. ఒక్కొక్క సంఘటనా చూస్తుంటే ఆమె గుండె చెదిరిపోయినట్లు కనిపిస్తోంది. అంత ఉక్కులాంటి మనిషి కూడా దిగజారి, దిగులుగా అయిపోయింది.

"నేను చెప్పింది చెయ్యి". కృష్ణప్రసాద్ కంఠం ఆ నిశ్శబ్దంలో పిడుగులా ధ్వనిం

చింది.

క్షణాలమీద హరిణి కోసం కబురు వెళ్ళింది. నిమిషాలమీద హరిణిని కార్లో హాస్పటల్‌కి తీసుకువచ్చారు.

బయట పోలీస్ కానిస్టేబుల్స్ పహరా... జైలు గదికి ఏమాత్రం తీసిపోని వాతావరణం... సదా చిరునవ్వూ, దయా ఒలికే మొహంతో ధర్మమూర్తిలా ఉండే తండ్రి దీనంగా, హీనంగా, హాస్పటల్ గదిలో దిక్కులేని ఖైదీలా పడి ఉండటం...

హరిణి గుండె బద్దలైపోతోంది.

హరిణిని చూసిన కృష్ణప్రసాద్ ఒక్కసారిగా చేతులుచాచాడు. హరిణి ఒక్క పరుగున వెళ్ళి ఆ చేతుల్లో ఒదిగిపోయింది. తండ్రిని బల్లిలా కరుచుకుపోయింది.

కృష్ణప్రసాద్ రొప్పుతున్నాడు. డాక్టర్లూ, నర్సులూ అంతా అసహనంగా చూస్తున్నారు.

“మీరంతా బయటకు వెళ్ళండి. నాకు ఏకాంతం కావాలి. నేను, పద్మినీ, హరిణీ మాత్రమే ఈ గదిలో ఉండాలి” శాసిస్తున్నట్లు చెప్పాడు కృష్ణప్రసాద్.

“కానీ... మీ పరిస్థితి”

“నాకు తెలుసు. అందుకే చివరి క్షణాలైనా నన్ను మావాళ్ళతో గడపనివ్వండి” కరుగ్గా చెప్పాడు కృష్ణప్రసాద్.

అంతా చేసేదిలేక బయటకు వెళ్ళారు.

తండ్రిలోని ఈ రూపం హరిణికి కొత్తగా ఉంది. “పద్మినీ, తలుపులు మూయి” అన్నాడు కృష్ణప్రసాద్.

పద్మిని తలుపులు మూసింది.

కృష్ణప్రసాద్ ఏం చెపుతాడా అని ఆతృతగా ఉంది పద్మినికి.

ఆయన నోరు తెరిచాడు.

“పద్మినీ... హరిణీ... నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. హరిణీ, నేను చెప్పేమాటలు నీ గుండెలో శిలాక్షరాలలా నిలిచిపోవాలి. ఎప్పటికీ మర్చిపోకూడదు. అర్థమైందా?” అడిగాడు కృష్ణప్రసాద్.

హరిణి అర్థమైనట్లు తల ఊపింది.

కృష్ణప్రసాద్ ఆయాసపడుతున్నాడు. మధ్య మధ్య గుండె రుద్దుకుంటున్నాడు. అయినా ఆయన కళ్ళల్లో ఏదో దృఢ నిశ్చయం కనిపిస్తోంది.

“హరిణీ. నీకు పదేళ్ళు దాటాయి. పరిస్థితులు అర్థమయే ఉంటాయి. ఇన్నాళ్ళూ నేను అందరూ ఒకటేననీ, ధర్మమార్గమనీ, దానధర్మాలనీ నా జీవితమంతా నా ఆశయాలకు ధారపోశాను. నీకూ అదే నూరిపోశాను” కృష్ణప్రసాద్ హరిణి కళ్ళల్లోకి చూశాడు.

యమధర్మరాజు నుంచి సత్యం తెలుసుకుంటున్న నచికేతుడిలో కనిపించిన శ్రద్ధ ఆమె కళ్ళల్లో కనిపిస్తోంది. కృష్ణప్రసాద్ నిట్టూర్చాడు.

“చివరికి నాకు దక్కిందేమిటి? అవమానం. బతికుంటే జైలు జీవితం. అంతేగా. ఈ లోకం దుర్మార్గపు లోకం. నువ్వు ఎవళ్ళకోసం జీవితం ధారపోస్తావో వాళ్ళే నిన్ను మింగేస్తారు. ఎవరినీ నమ్మకు. దానధర్మాలంటూ పైసాకూడా ఖర్చుచెయ్యకు. నీ ఎత్తునుంచి సెంటీమీటరు కూడా కిందికి దిగకు. ఎక్కడ ఉంచాల్సిన వాళ్ళని అక్కడే ఉంచు”.

హరిణి శ్రద్ధగా వింటోంది. ఒక్కో అక్షరమూ బీజాక్షరమై ఆమె గుండెలో బలంగా నాటుకుపోతోంది.

“అన్నయ్యా ఇవన్నీ తర్వాత చెప్పొచ్చులే. నీకూ గుండెజబ్బు, దానికీ గుండెజబ్బు. విని తట్టుకోలేక దానికేమైనా జరిగితే?” హరిణి మీద కృష్ణప్రసాద్ కున్న ప్రేమ పద్మినికి తెలుసు. కనీసం హరిణి ప్రాణానికి ఆపద అంటే అయినా ఆగుతాడేమో అనిపించింది ఆమెకి.

> కర్తవ్యమే నిజమైన హక్కులకు ఆధారం. మనం మన విధులను సక్రమంగా నిర్వహించ గలిగినప్పుడే హక్కులు మనకు చేరతాయి. – అర్నాల్డ్ హెచ్. గ్లాస్గో

కృష్ణప్రసాద్ నిస్పృహగా నవ్వాడు.

"పద్మినీ, నేను చెప్పే సత్యాలు నాకు ఇది వరకు తెలియక ఏ స్థితికి వచ్చానో చూస్తు న్నావుగా. నాకు పట్టిన గతి, నా కూతురికి పట్టకూడదు. అది ఇవి వినలేక, తట్టుకోలేక, గుండె బద్దలై చచ్చిపోయినా కూడా నాకు సమ్మతమే. కానీ నాలామాత్రం ఎన్నడూ కాకూడదు" అన్నాడు కృష్ణప్రసాద్.

హరిణి కృష్ణప్రసాద్ చేతిని పట్టుకుని ఉంది. "డాడీ" అంది కన్నీళ్ళతో.

కృష్ణప్రసాద్ నిస్పృహగా నవ్వాడు.

"ఇంకెక్కడి డాడీ తల్లీ. ఈ లోకంలో నిన్ను ఒంటరిదాన్నిచేసి వెళ్ళిపోతున్నాను. హరిణీ. ఈ లోకంలో సున్నితమైన మనస్సు ఉన్నవాడు బతకలేడు. సెన్సిటి వ్‌గా ఉండటంవల్ల నేను జీవితాంతం నర కయాతన అనుభవించాను. ఎక్కడ ఎవరు ఏ కష్టం పడ్డా నా గుండె కొట్టుకునిపో యేది. వాళ్ళ కష్టాలు నన్ను నిద్రపోనిచ్చేవి కావు, అన్నం తిననిచ్చేవి కావు. అన్నీ ఉన్నా ఎప్పుడూ అశాంతిగానే గడిపాను. నువ్వలా ఉండకూడదు. నీ గుండె బండలా చేసుకో వాలి. ఎవరికే కష్టం వస్తే మనకేంటి? వాడు కిందటి జన్మలోనో, ఈ జన్మలోనో ఏవో పాపాలుచేసి ఉంటాడు. ఎవడు చేసు కున్న దానికి వాడు అనుభవిస్తాడు. మధ్యలో మనం బాధపడటం దండగ. జీవి తంలో ఎన్నడూ ఎవరిగురించీ ఆలోచిం చకు. ఎవరికీ సాయం చెయ్యకు" అన్నాడు కృష్ణప్రసాద్.

హరిణి తల ఊపింది.

కృష్ణప్రసాద్ పద్మిని వైపు తిరిగాడు.

"పద్మినీ, నేను రాంగ్. నువ్వే కరెక్ట్. ఇక నుంచీ హరిణి బాధ్యత నీది. దాన్ని ధృఢంగా, కరుగ్గా, ఈలోకంలో తెలివిగా బతికేట్లు తయారుచెయ్యి".

పద్మిని మౌనంగా తల ఊపింది.

"పద్మినీ" కృష్ణప్రసాద్ పిలిచాడు.

"చెప్పన్నయ్యా" పద్మిని కళ్ళనీళ్ళతో అంది.

"పద్మినీ. నేను ఈ ప్రపంచంమీద రోతతో వెళ్ళిపోతున్నాను. నిజానికి ఇలాంటి దుర్మార్గపు లోకంలో బతకకుండా, చచ్చి దీనికి దూరంగా వెళ్తున్నందుకు నాకు సంతోషంగా ఉందికూడా... పద్మినీ ... పద్మినీ"!

కృష్ణప్రసాద్ చెప్పలేక రొప్పుతున్నాడు.

పద్మిని మౌనంగా వింటోంది. శిలలాంటి ఆమెకి ఈరోజు ఆగని జలపాతంలా కన్నీళ్ళు కారిపోతున్నాయి.

"పద్మినీ, నీ సమర్థతమీద నాకు నమ్మకం ఉంది. నీకు మరొక్కపని కూడా అప్పజెప్పి వెళ్తున్నాను".

"అన్నయ్యా అది ఏదైనా... ఎంత కష్టం అయినా సంకోచించకు. చెప్పు. నేను చేస్తాను" అంది పద్మిని.

"పద్మినీ. నాకీ మనుషులందరంటే అసహ్యం పుట్టింది. నాకీ ప్రపంచంలో నువ్వూ, హరిణీ తప్ప మరెవరూ లేరు. నేను పోయాక ఈ మనుషులెవ్వరూ నా శవాన్ని తాకనైనా తాకకూడదు".

"అవునన్నయ్యా, వాళ్ళెవళ్ళకీ నిన్ను తాకే అర్హత కూడా లేదు". పద్మిని కసిగా అంది.

"పద్మినీ అందుకే చెపుతున్నాను. నేను చచ్చాక నా అంత్యక్రియల భారం మొత్తం నీదే. నువ్వూ, హరిణీ మాత్రమే చెయ్యాలి. ఇంకొకళ్ళ సాయం తీసుకోకూడదు. ఎవరూ కనీసం నా శవపేటికను కూడా తాకకూ డదు.

... ఇది నా కోరిక కాదు. నా ఆజ్ఞ. ఎలా చేస్తావో, ఏం చేస్తావో నాకు తెలీదు. దీన్ని జాగ్రత్తగా పూర్తిచేయవలసిన బాధ్యత నీదే" కృష్ణప్రసాద్ ఆయాసపడుతూ చెప్పాడు.

పద్మిని అయోమయంగా చూసింది. తను ఆడది. హరిణి చిన్నపిల్ల. తామిద్దరే కలిసి చావు ఎలా జరిపించగలరు? కానీ అన్నయ్య కోరిక నెరవేర్చటం తప్ప ఇంకేదీ ఆలోచించదల్చుకోలేదు పద్మిని.

"హరిణీ, ఇకనుంచీ అత్తయ్యే నీకు డాడీ మమ్మీ అన్నీ... అత్త చెప్పినట్లు వినాలి" అన్నాడు. హరిణి తల ఊపింది.

"హరిణీ జాగ్రత్త. చచ్చిపోయినా నీ డాడీ నీకు తోడుగా ఉంటాడు. నువ్వు ఇప్పుడు గుండె జబ్బు హరిణివి కాదు. అందరికీ ఒకే గుండె ఉంటుంది. కానీ నీకు రెండు గుండెలు. నాగుండె నీగుండెకి జతచేసి వెళ్తున్నాను. రెండు గుండెల బలం నీది. నీకు నా ఆశీస్సులు ఎప్పుడూ తోడుగా ఉంటాయి. హరిణీ... నా తల్లీ... నీకు ఎదురు లేదురా..." కృష్ణప్రసాద్ పెదవులు హరిణి నుదుటిని ముద్దాడాయి. ఆయన చెయ్యి ఆమె తలమీద నిల్చి ఆశీర్వదించింది.



అంతే. మరుక్షణం ఆయన శరీరం నిర్జీవంగా వాలిపోయింది.

"డాడీ" హరిణి విహ్వలంగా అరిచింది.

"అన్నయ్యా," రాణీ పద్మిని భోరుమంది.

గది తలుపులు ధడాల్న తెర్చుకున్నాయి.

అంతా పరుగెత్తుకుని లోపలకు వచ్చారు. ప్రాణంలేని కృష్ణప్రసాద్ దేహాన్ని చూసి అంతా అవాక్కయారు.

★ ★ ★

**"నా** గుండె నీ గుండెకి జతచేసి వెళ్తున్నాను" కృష్ణప్రసాద్ మాటలు అక్షర సత్యాలయ్యాయి.

చావు అంటే హరిణికి కొత్తేం కాదు. తాతయ్య, నాయనమ్మల చావులు చూసింది. ఆ పైన తల్లి చావు చూసింది. తను స్వయంగా మృత్యువుకి చేరువైన క్షణాలు ఎన్నో.

మనిషన్నాకా పోక తప్పదనీ, ఈ లోకం శాశ్వతం కాదనీ హరిణికి అప్పటికే తెలుసు.

చావుని అంగీకరించగల స్థితిలో ఉన్నా, హరిణి తండ్రి దిక్కుమాలిన చావుని మాత్రం అంగీకరించలేకపోయింది.

హరిణికి తండ్రి మీద ఉన్న ప్రేమ అంతులేనిది, అనంతమైనది. దానిని కొలవటానికి ఏ కొలతా ఈ ప్రపంచంలో లేదు. ప్రేమే కాక భక్తి, గౌరవం, ఆరాధనా భావం కూడా ఉన్నాయి.

ధర్మమూర్తి లాంటి తన తండ్రికి ఈ గతి పట్టించిన వాళ్లని హరిణి క్షమించలేకపోయింది. తండ్రి అంటే ఉన్న ఆరాధన వల్ల ఆయనకి జీవితంలో జరిగే ప్రతి సంఘటన మీదా హరిణికి ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. ఆ చిన్నమనసులో ఎన్నో ఊహలు. ఆయనకి వైభవంగా షష్ఠిపూర్తి జరిపించాలి. సినిమాల్లో చూపించినట్లు పూలూ, పాటలూ, జరీ బట్టల్లో మెరిసిపోతున్న తండ్రి...

ఆయన వయసైపోయాక చచ్చిపోతే... అప్పుడు బంధుమిత్రులంతా వచ్చేస్తారు. ఆయన మంచితనాన్నీ దాతృత్వాన్నీ పొగుడుతారు. పూల రథంలా ఉన్న లారీలో ఆయన అంతిమ యాత్ర సాగుతుంది. చందనం చెక్కలతో ఆయనకి దహనం జరుగుతుంది.

అనాయాస జీవనం... సునాయాస మరణం. వీటిని కోరుకోని మనిషి ఉండడు.

అలాగే తన వాళ్లు గౌరవంగా జీవించాలనీ, జీవితం ఎంత గౌరవంగా సాగిందో, చావు కూడా అంతే గౌరవంగా డిగ్నిఫైడ్‌గా జరగాలనీ ఎవరైనా కోరుకుంటారు.

తండ్రి చనిపోయాక జరిగిన తతంగం... గది చుట్టూ పహరా పోలీసులు... పోలీసుల బూట్ల చప్పుడు... పోస్ట్‌మార్టమ్... అనేక ప్రశ్నలు... వాదోపవాదాలు... చివరికి ఆయన్ని ఎక్కడ దహనం చేయాలన్న విషయం కూడా వివాదాస్పదం... మృతదేహాన్ని అప్పగించటానికి జరిగిన నానా తంతూ...

ఉదాత్తుడూ, ధర్మమూర్తీ అయిన తన తండ్రి పొందిన అవమానం... చచ్చిన దిక్కులేని చావూ హరిణికి ఎన్నడూ మరిచిపోలేకపోయింది.

ఆయన చావుకి కారణం అయిన వాళ్ల మీద కసితో ఏ సాయం చేయకుండా ఆఖరికి ఓదార్పు కూడా కరువు చేసిన ఈ సమస్త లోకం మీదా పగతో ఆమె గుండె బద్ధలైపోయింది.

★ ★ ★

రాణీ పద్మినీ, ఆమె భర్తా, హరిణీ ఉన్న వ్యాన్ నారాయణపురం వైపు దూసుకుపోతోంది. దాన్ని రాణీ పద్మిని భర్త రామ్‌కుమార్ నడుపుతున్నాడు. వ్యాన్‌లో కృష్ణప్రసాద్ మృతదేహం.

అందరినీ తనవాళ్లనుకుని, తాను అందరివాడై నిల్చి, తన ఆస్తిలో తొంభైశాతం దానధర్మాలకీ, ఇతరులకి సాయం చెయ్యటానికే ఖర్చుపెట్టి, ఔదార్యంలో, ఉదాత్తతలో ఎంతో ఉన్నత శిఖరాలకి ఎదిగిపోయి, పదిమంది కోసం పాటుపడ్డ కృష్ణప్రసాద్ అంతిమ యాత్రకి కుటుంబ సభ్యులు తప్ప మరెవరూ లేరు. కొంతమంది ఆప్తులనబడే వాళ్లూ ఆయన చేత అనేక సాయాలు పొందినవాళ్లూ ఎవరూ రాలేదు. పేపర్లలో వార్తలు చదివి సంగతి తెలిసినవాళ్లు కూడా ఏమీ ఎరగనట్లు ఉండిపోయారు. ఎవరూ రాలేదు. రాణీ పద్మిని బావగారూ, తోడికోడలూ మాత్రం వచ్చారు. ఇట్లాంటి పరిస్థితిలో ఏంచేయాలో తెలీక మౌనంగా చూస్తూ ఉండిపోయారు.

"మేం చూసుకుంటాంలే... మీరు వెళ్లండి" అని రాణీ పద్మిని వాళ్లనుకూడా పంపించేసింది.

మల్లెపువ్వులా, స్వచ్ఛమైన మనసుతో జీవించిన కృష్ణప్రసాద్ మెడలో మల్లెపూల దండ కాదు సరికదా ఏ దండా లేదు. ప్రపంచంలోని అన్యాయాన్ని చూడలేక కళ్లు మూసుకున్న ఆయన నుదుట ఎవరూ తిలకం తీర్చి దిద్దలేదు. అనాథ ప్రేతంలా, దిక్కులేని శవంలా, హాస్పటల్ వాళ్లు కట్టిన బట్టలోనే వ్యాన్‌లో తీసుకు వెళ్తున్నారు.

హరిణి ఆయన్నే తదేకంగా చూస్తోంది. ఆమె కళ్లలో నీళ్లు లేవు. గుండెలో కోత, కళ్లలో పగ...

రాణీ పద్మినికి కొన్నాళ్ల క్రితం తమ ఇంటి పక్కన నివసించిన భూపేష్ గుర్తొచ్చాడు.

భూపేష్ ఉరఫ్ భూపీ పెద్ద రౌడీ - గూండా, గుడిసె స్థాయి నుండి బంజారాహిల్స్‌లో మేడ స్థాయికి కేవలం గూండాగిరీ ద్వారా ఎదిగిన మనిషి. అందర్నీ బెదిరిస్తూ, బ్లాక్‌మెయిల్ చేస్తూ, కోట్లు గడించాడు. దౌర్జన్యం, భూ కబ్జాలు, కబ్జాలు, కత్తి పోట్లు, మానభంగాలు, ఒకటేమిటి, గుండాగిరీ, దాదాగిరీలో అతను చేయని అకృత్యాలు లేవు. అతనెంత దుర్మార్గుడో తెలిసినా జనం అతనికి నీరాజనాలు పట్టేవాళ్లు. ఉన్నట్టుండి ఒక రోజు తాగితాగి రపీమని చచ్చాడు.

అతను చచ్చాక కూడా జనం అతనికి భయపడి చచ్చారు. అతని అనుచరవర్గం తమనేమన్నా చేస్తారేమోనని భయపడ్డారు, ఇంత పవర్‌ఫుల్ ఫెలో కాబట్టి చచ్చికూడా ఏం ఏడిపిస్తాడోనని జడుసుకున్నారో తెలియదు. భూపీ చచ్చాక కూడా అతన్ని చూడటానికి జనం బోలెడుమంది వచ్చారు. సినీ తారలూ, టి.వి. నటులూ కూడా వచ్చారు. వాళ్లని చూడటానికి జనవ విరగపడ్డారు. పూలదండలతో అతని దేహం మొత్తం నిండిపోయింది. యుద్ధవీరులకి తీర్చిదిద్ది

నట్లు వీర తిలకం దిద్దారు. ఇంటి దగ్గరా, సెంటర్లోనూ అంతా నల్లజెండాలు ఎగరే శారు. అతని ఫోటో పెట్టి పూలమాల వేశారు. అతని అంతిమయాత్రికి సిద్ధం చేసిన లారే పూలరథంలా తయారైంది. దారి పొడవునా "భూపేష్ అమర్ హై" "జబ్ తక్ సూరజ్ చాంద్ రహేగా భూపే ష్ కే నామ్ రహేగా" అని నినాదాలు మిన్ను ముట్టాయి. పూలు చల్లారు, నోట్లు విసి రారు. చందనపు చెక్కలూ, నెయ్యి వగైరా లతో అతని కాష్టం వెలిగిపోయింది.

బతికున్నన్నాళ్లూ అందర్నీ బెదిరించి, దోచుకుని, దౌర్జన్యం చేసిన స్ట్రీట్ రౌడీకి అంత గొప్ప అంతిమయాత్ర.... జనం నివాళి.

జీవితమంతా మంచి కోసం పాటుపడి, ఎప్పుడూ ఎవరికే సాయం చేద్దామా అని ఆరాటపడ్డ మనిషికి ఇలాంటి నీచమైన చావు.

ఏమిటీ ఘోరం? ఏమిటీ లోకం?

కృష్ణ ప్రసాద్ చివరి కోరిక ఎవరికీ తెలీదు. అయినా కూడా ఎవరూ రాలేదు. ఎక్కడ ఏదీ చుట్టుకుంటుందోనని భయం. మనకెందుకొచ్చిన గొడవ అని స్వార్థం. మంచివాళ్లకి బతుకే కాదు, చావు కూడా కష్టంగానే ఉంటుందేమో?

అసలు ఇందుకే కాబోలు, మనుషులు లంటేనే రోత పుట్టి, కృష్ణప్రసాద్ అంత దారుణమైన కోరిక కోరాడు."

రాణీ పద్మినికి దుఃఖం ఆగలేదు. నోట్లో కొంగు కుక్కుకొని వెక్కివెక్కి ఏడుస్తోంది.

హరిణి అత్తవైపు చూసింది.

రాణీపద్మిని తనను తాను సంభాళించు కుంది. తను కూడా బేజారైపోతే, పాపం చిన్నారి హరిణి ఏమైపోతుంది.

అన్నయ్యా హరిణిని తన చేతిలో పెడుతూ అన్న మాటలు ఆమె చెవుల్లో మారుమోగు తున్నాయి.

పట్టుదలతో రాణీపద్మిని పెదవులు బిగు సుకున్నాయి. ఆమె చెయ్యి హరిణి చేతిని బలంగా పట్టుకుంది.

కృష్ణప్రసాద్ పోయాడనగానే నారాయణ పురంలోని బీదా బిక్కీ తల్లడిల్లిపోయారు.

ఆయన శవాన్ని చూడాలని పరుగెత్తు కుని వచ్చారు. కానీ రాణీపద్మినీ ఆమె భర్తా ఎవరినీ లోపలకి రానివ్వలేదు.

సుధా నిలయం గేట్లు మూసుకున్నాయి.

"పొండి... బతికున్నన్నాళ్ళూ ఆయన్ని పీక్కుతిన్నారు మీ మూలంగానే అన్నయ్య పోయాడు. ఇంకా మీ కసితీరలేదా? ఇటు గానీ వచ్చారంటే చంపేస్తాను" ప్రళయ దుర్గలా గర్జించింది రాణీపద్మిని.

అంతా ఏం చేయాలో తెలీక చూస్తు న్నారు. "మేమసలే బాధలో ఉన్నాం. మమ్మల్ని పలకరించకండి. వెళ్ళండి. ఊ" మేడ మీద నుంచి అరిచింది రాణీపద్మిని.

జనం ఒక్కొక్కళ్ళే వెళ్లిపోయారు.

హరిణి అంతా మౌనంగా చూస్తోంది. "అత్తా. వాళ్ళెందుకు వచ్చారు? "

"ఎందుకు వస్తారే? డబ్బు కోసం. మనిషి పోయాడు కదా. చావు విందుకీ, దినవారాలు పెట్టేటప్పుడు చేసే దానధర్మా లకీ ఎగబడి వస్తారు. మనిషి చచ్చాడన్న బాధ ఉండదు. దోచుకుపోదామని వస్తారు..." రాణీపద్మిని కసిగా తిట్లు తిట్టింది. మామూలుగా అయితే ఎంతో డిగ్నిటీ మెయిన్‌టైన్ చేస్తూ, చాలా స్టైల్‌గా తప్ప మాట్లాడని రాణీపద్మిని నోట్లోంచి కోపం వస్తే బూతులు కూడా వచ్చేస్తాయి. కానీ ఆ కోపాన్ని కూడా ఎక్కడెక్కడ ఎలా ఏ భాషలో ప్రదర్శించాలో కూడా ఆమె అదుపులోనే ఉంటుంది. ఇతరుల దగ్గర ఆ కోపాన్ని ఇంగ్లీషులో చూపిస్తుంది. తన భర్త దగ్గర మాత్రం పచ్చితెలుగులో తిట్లు తిడుతుంది. ఇప్పుడు హరిణి ఆమెకి బాగా చేరిక అయింది. కాబట్టి ఆమె దగ్గర కూడా అరమరికలు లేకుండా మాట్లాడేస్తోంది.

హరిణి వెళ్లిపోతున్న జనం వైపు కోపంగా

చూసింది. తాము ఇంత కష్టంలో ఉంటే, అందులో కూడా లాభం పొందాలని వచ్చారని ఆ జనం మీద విపరీతమైన కోపం వచ్చింది హరిణికి.

రాణీపద్మిని భర్తకి పెద్దగా సమర్థత లేదు. అందులో ఇలాంటి విషయాలు, చావూ, దహనం లాంటివి అతను ఎన్నడూ నిర్వహించలేదు.

"ఏర్పాట్లు చేయించాలి కదా. దహనం ఎక్కడ చెయ్యాలి, తలకొరివి ఎవరు పెట్టాలి, అన్నీ డిసైడ్ చేసుకోవాలి కదా" అన్నాడు భార్యతో.

రాణీ పద్మిని జవాబు చెప్పకుండా మౌనంగా ఉండిపోయింది. రామ్‌కుమార్ అయోమయంగా చూస్తూ ఉండిపోయాడు. కృష్ణ ప్రసాద్ అంత్యక్రియలు పెద్ద పజిల్‌గా మారాయి అతనికి.

అతనికి కృష్ణ ప్రసాద్ అంటే గౌరవం, అభిమానం, పాపం జీవితమంతా ఔదార్యానికీ, ఔన్నాత్యానికే ఉదాహరణంగా నిలిచి, చివరికి చావు మాత్రం బీభత్సంగా, అంత్యక్రియలు పెద్ద మిస్టరీగా మారటం అతనికి బాధగా అనిపించింది.

హరిణికి మందులూ, ఆహారం మాత్రం క్రమం తప్పకుండా ఇస్తూనే ఉంది రాణీపద్మిని.

"వద్దు" అనబోయింది మొదట్లో హరిణి. రాణీ పద్మిని హరిణివైపు తీవ్రంగా చూసింది. ఆమె మొహంలో కాఠిన్యం కమ్ముకుంది.

"శవం ఇంట్లో ఉన్నంతసేపూ తినకూడదని అంటారు. అవన్నీ మూఢ నమ్మకాలు. ఇదివరకు రోజుల్లో అయితే రకరకాల జబ్బులతో తీసుకుని చచ్చేవాళ్లు. కాబట్టి, ఇన్‌పెక్షన్ ఉంటుందని భయపడి శవాన్ని తీసుకెళ్లాక స్నానాలు చేసిగానీ వంటలు వండేవాళ్లు కాదు. ఇప్పుడలా కాదు. బంధువులూ వాళ్లూ ఊళ్ల నుంచీ, దేశాలనుంచీ రావాలంటే అంతకాలం డి కంపోజ్ కాకుండా శవాన్ని కాపాడగలరేమోగానీ, ఎంత దుఃఖం ఉన్నా ఆకలి నుంచి తప్పించుకోగలరా. శుభ్రంగా తినేస్తారు. తిను." అంది.

హరిణి సమాధానం చెప్పకుండా అత్తవైపు మౌనంగా చూసింది. హరిణి విశాలమైన కళ్లు చెప్పే భాష్యాలు చదవటం పద్మినికి అప్పటికే వచ్చేసింది. ఒక్కసారిగా హరిణిని తీసుకుని చేతుల్తో చుట్టేసింది. హరిణి అత్త కడుపులో మొహం దాచుకుంది. పద్మిని చేతులు హరిణి వీపుని రాస్తున్నాయి.

ఆమె కంఠం చిన్నగా సన్నగా పలికింది.

"హరిణీ. నాచిట్టి తల్లీ. డాడీ అలా ఉంటే, అన్నం తినాలంటే నీకు బాధగానే ఉంటుందిరా. కానీ అర్థం చేసుకో. మనం నిస్సహాయులం. మనకి అన్నం తినకుండా బతికే శక్తి లేదు. అందుకని అన్నం, మందులూ తిని తీరాలి. తప్పదు. తప్పులేదు."

హరిణి సరేనన్నట్లు తల ఊపింది. రాణీ పద్మిని కడుపులో హరిణి తల సన్నగా తిరుగుతూ, రాణీ పద్మినికి హరిణి తల సన్నగా తిరుగుతూ రాణీ పద్మినిలో ఎన్నడూ లేని మాతృ భావనను కలిగించింది. హరిణి గర్భస్థ పిండమై తన కడుపులో తిరుగుతున్నట్లు అనుభూతి కలిగింది.

"హరిణీ... నా రాణీ... నా బంగారు తల్లీ. మీ డాడీ ఎక్కడికీ పోలేదురా. నీతోనే ఉంటాడు. తన గుండెని నీకిచ్చానని చెప్పలేదూ. గుండె నుంచి మనిషి వేరు అవుతాడా? కాదు. డాడీ చచ్చిపోలేదు. మనతోనే ఉంటాడు." అంది రాణి పద్మిని.

హరిణి టాబ్లెట్లు వేసుకొని అన్నం తింది. మర్నాడు తెల్లవారింది.

ఎర్రటి రక్తపు ముద్దలా సూర్యుడు అమాయకపు పిట్టలు. వాటికి రోజూ సుధానిలయంలోకి వచ్చి వాలి అక్కడి వాళ్లు విసిరే రకరకాల గింజలూ, పళ్ల ముక్కలూ తినటం అలవాటు. అలవాటు ప్రకారం వచ్చి వాలాయి.

రాణీ పద్మిని చేతిలోని తుపాకిని గాలిలోకి పేల్చింది.

"ఢాం" అని చప్పుడు.

ఆ పిట్టలకి ఆ శబ్దం ఎన్నడూ అలవాటు లేదు. బెదిరి కకావికలై, నిస్సహాయంగా గాలిలోకి ఎగిరిపోయాయి.

"ఎందుకలా చేశావ్? పాపం వాటికి రోజూ ఇక్కడ గింజలు వేస్తారు. ఆశపడి వచ్చాయి" అన్నాడు రామ్‌కుమార్.

"నేను వేటికీ గురిపెట్టి పేల్చలేదు. ఒక్కటి కూడా చావలేదు"

"పాపం. నోర్లేని పిట్టలు. వాటికన్నా కాసిని గింజలు వేస్తే, మీ అన్నయ్య చావుకి కాస్త శాంతి జరిపించినట్లు అయేది.

"జీవితాంతం వాటికి గింజలు వేస్తూనే వచ్చాడు అన్నయ్య. ఆ పుణ్యం చాల్లెండి" అంది రాణీ పద్మిని.

రామ్‌కుమార్ కాసేపు మౌనంగా ఊరుకు న్నాడు.

"ఇంతకీ చావు ఎలా ఎక్కడ జరిపిం చాలి? " అన్నాడు

"ఏర్పాట్లు చేస్తున్నాను" అంది రాణీప ద్మిని.

"ఏదీ? ఎక్కడా? ఏమీ కనిపించటం లేదే? " ఆశ్చర్యపోతూ అడిగాడు రామ్‌కు మార్.

"అన్నయ్య అన్నీ నన్నే చూసుకోమ న్నాడు. నేనే చూసుకోగలను"

రామ్‌కుమార్ మౌనంగా ఉండిపోయాడు. రాణీపద్మిని తాను ఏం చేయదల్చుకున్నదీ భర్తకి కూడా చెప్పలేదు. గుంభనగా ఉండి పోయింది. ఊళ్ళో అందరికీ ఆ విషయం సస్పెన్స్‌గా ఉండి అందరిలో ఆసక్తి ఉద యించింది. ఎవరి సాయం కోరకుండా రాణీ పద్మిని ఏం చేయదల్చుకుంది అసలు?

రామ్‌కుమార్ ఏదీ అర్థం కాక తలపట్టు కుని ఉండిపోయాడు.

కృష్ణప్రసాద్ శవాన్ని చూస్తుంటే తను చదివిన విషయాలు ఏవేవో గుర్తుకొస్తు న్నాయి.

జీవితమంతా ఒకలా జీవించి, చావు ముందు తాము అంతకు ముందు జీవించిన జీవితం వ్యర్థం అని తెలుసుకున్న వాళ్లు ఉన్నారు. వాళ్ళంతా వ్యసనాలకో వేటికో లోబడి జీవించి, చివర్లో అది తప్పు అని తెలుసుకుని మారినవాళ్లు. కనీసం చివరి క్షణంలో అయినా తనను తల్చుకున్న వాళ్ళని ఆ పరమాత్మ కరుణిస్తాడంటారు. కానీ ఇంత మంచివాడైన కృష్ణప్రసాద్ చివర్లో మంచితనం మీదే విరక్త కలిగి, చచ్చి పోతానని తెలిసి కూడా ఆ దేవుడ్ని తల్చుకో కుండా పోవటం ఏమిటి? అతనికి అంతా మాయ అనిపించింది.

విశ్వవిజేత అలెగ్జాండర్ తను చనిపో యాక శవపేటికలోంచి తన చేతులు బయ టకు కనబడేలాగా ఉంచాలని ఆదేశించా డట. మనిషి ఎన్ని గెలుచుకున్నా

ఎంత సంపాదించినా, చనిపోయేటప్పుడు తీసుకువెళ్లేది ఏదీ లేదని చెప్పటం అతని ఉద్దేశం.

ఇంతకీ ఇతని అంత్యక్రియలు ఎలాగ? అతనికి తనకి వరసకి బావగారు సూర్యప్ర కాశరావు గుర్తుకొచ్చాడు. ఆయనకి పిల్ల ల్లేరు. తను చనిపోయాక తన శ్రాద్ధకర్మలు ఎవరు పెడతారని విచారిస్తూ కూర్చుని చివ రికి గయకి వెళ్లి ఏదో తంతు జరిపించుకుని వచ్చాడు. అది చేశాక ఇక దినం, శ్రాద్ధం ఏదీ జరిపించక్కర్లేదుట. ఆయనకి తను ఎలా జీవించాలన్న భావం కన్నా తను చచ్చాక చావు ఎలా జరిపిస్తారోననే దిగులే ఎక్కువగా ఉండేది.

"నేను చనిపోయానని తెలియగానే మీరంతా రావాలి. నాకా ఎవరూ లేరు, మీరే పూనుకుని శ్రద్ధగా అన్నీ జరిపించాలి' ' అని అని చెపుతూనే ఉండే వాడు.

"ఊరుకో. అవేంటి పిచ్చిమాటలు? " అని

> యౌవనదశలో మనం ప్రపంచాన్ని మార్చేందుకు ప్రయత్నిస్తాం కానీ వయసు మళ్లిన తరువాత మనం యువతను మార్చడానికి ప్రయత్నిస్తాం. – జాబ్ బ్రౌన్

అంతా మందలించే వాళ్లు.

"పిచ్చిమాటలేంటి? అవే మంచి మాటలు. ఎన్నాళ్ళు బతుకుతామో ఎవరన్నా ఖచ్చితంగా చెప్పగలరా? లేదు. అదే ఎప్పుడో ఒక రోజు చావు వస్తుందని మాత్రం ఖచ్చితంగా తెలుసా లేదా? మృత్యోర్మా అమృతంగమయ అన్నారు. ఆత్మకి చావు లేదు. ఇవాళ ఈ ఊరు వెళ్తే రేపు ఇంకో ఊరు వెళతాం. అంతే. ఈ జన్మ గడిస్తే ఇంకో జన్మ" నవ్వుతూ చెప్పేవాడు సూర్యప్రకాశరావు.

ఆయనకి హిందూ ధర్మమంటే ప్రాణం. ఎప్పుడూ ఆత్మ, పునర్జన్మ సిద్ధాంతం, దహన క్రియలు గురించి ఆలోచిస్తుండే వాడు. మనిషికి బతుకుకన్నా చావు ముఖ్యమనీ, అది వైభవంగా జరగాలనీ ఆశించే వాడు. తను పోయినా బోలెడంత డబ్బు వదిలి వెళ్తున్నాడు కాబట్టి అంత్యక్రియలకి ఏ లోటూ రాదని అనుకునే వాడు.

ఆయన ఆశ అడియాశగానే మిగిలిపోయింది. ఎక్కడికో విమానంలో వెళ్తుంటే, ఆ విమానం గాలిలోనే పేలిపోయి, సముద్రంలో కూలిపోయింది. ఆయన శవం కూడా దొరకనే లేదు.

కబీర్ దాస్ మరణించినప్పుడు ఆయన మావాడంటే మావాడని హిందువులూ, ముస్లిమ్‌లూ పోట్లాడుకున్నారుట. అంత్యక్రియలు మా పద్ధతి ప్రకారం జరపాలంటే మా పద్దతి ప్రకారం అని ఇద్దరూ వాదించుకున్నారుట. చివరికి ఆయనకి కప్పిన బట్ట తీసి చూస్తే అక్కడ ఆయన దేహానికి బదులు ఒక పూలరాశి ఉందిట.

కృష్ణప్రసాద్ అలాగ పూలకుప్ప అయిపోతే బాగుండుననిపించింది రామ్‌కుమార్‌కి.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది రాణీపద్మిని. ఆమె అంత తాపీగా ఎట్లా ఉందో రామ్‌కుమార్‌కి అర్థంకాలేదు. కానీ ఆమె సమర్థత, నిబ్బరం అతనికి బాగానే తెలుసు. అయినా సస్పెన్స్... మిస్టరీ వేడుక అతనికి అనీజీగా ఉంది. ఈ కార్యక్రమం ఎంత తొందరగా ముగిస్తే, అంత తొందరగా హైదరాబాద్ తిరిగి వెళ్ళిపోవచ్చు. అదేదో తొందరగా జరిగిపోవాలని కోరుకుంటూ కూర్చుండిపోయాడు.

హరిణి చేత తలస్నానం చేయించింది. రాణీపద్మిని. తనూ చేసింది. ఇద్దరూ పట్టు బట్టలు కట్టుకున్నారు. హరిణి మొహానికి దట్టంగా పసుపు రాసింది రాణీ పద్మిని. నుదుట పొడవైన తిలకం దిద్దింది.

బిందెలో నీళ్ళు తీసుకుని, కృష్ణప్రసాద్ శవం దగ్గరకు వెళ్ళింది పద్మిని. ఆమె పక్కనే హరిణి. పట్టులంగా, జాకెట్టు, విరబోసుకున్న తల... మొహాన దట్టంగా పసుపు, నుదుట ఎర్రగా వెలిగిపోతున్న కుంకుమ బొట్టు... హరిణిని చూస్తే ఎందుకో భయం వేసింది రామ్‌కుమార్‌కి.

కృష్ణ ప్రసాద్ ఎప్పుడూ దానధర్మాలు, అన్నదాన కార్యక్రమాలు చేస్తూనే ఉంటాడు కాబట్టి ఆ ఇంట్లో ఒక గదినిండా నెయ్యి, నూనె డాల్డా నిలవ ఉంటాయి. మరోవైపు పెద్ద షెడ్‌లో కట్టెలు ఉంటాయి. ఇవన్నీ గాక పద్మిని హైదరాబాద్ నుంచి వస్తూ టిన్నుల కొద్దీ పెట్రోల్ తెచ్చింది.

కట్టెలన్నీ హాల్‌లో చేర్చింది పద్మిని. కృష్ణ ప్రసాద్ మృతదేహానికి స్నానం చేయించి, శుభ్రంగా తుడిచి, కొత్తబట్టలు కట్టారు ఇద్దరూ. పూజ గదిలో ఉన్న చందనం మాల తెచ్చి ఆయనకి వేశారు. నుదుట తిలకం దిద్దారు.

కింద కొన్ని కట్టెలూ, పిడకలూ అమర్చి దానిమీద కృష్ణప్రసాద్ మృతదేహాన్ని పడుకోబెట్టారు. దానిమీద మళ్ళీ కట్టెలమర్చి పెట్రోల్ నెయ్యి పోశారు. పద్మిని సూచనలు ఇస్తుంటే హరిణి బొమ్మలాగా చేసుకుపోతోంది.

రామ్‌కుమార్ సాయం అడగలేదు వాళ్ళు

"ఏం చేస్తున్నారు? " రామ్‌కుమార్ విస్తు పోతూ అడిగాడు.

"ఇంకాసేపట్లో మనం వెళ్ళిపోవాలి. మీరు బయటికి వెళ్ళి వ్యాన్‌తో రెడీగా ఉండండి". పద్మిని స్థిరంగా చూస్తూ చెప్పింది.

"పద్మినీ... నువ్వసలు..."

"వెళ్ళండి". రాణీపద్మిని కంఠం ఆజ్ఞాపిస్తు న్నట్లుగా ఉంది. రామ్‌కుమార్ చేసేది లేక బయటకు నడిచాడు.

పద్మిని ఇంట్లో సామానంతా కుప్పగాపోసి అన్నిటిమీదా పెట్రోల్ చల్లింది. కిరోసిన్ డబ్బాలు తెచ్చి, పిచ్చి పట్టినట్లు వెర్రిబలంతో ఊపుగా భవనం అంతా చల్లేసింది.

పూల పరిమళాలతో, అగరు సాంబ్రాణీ సువాసనలతో గుబాళించి పోయే సుధాని లయం పెట్రోల్ కిరోసిన్ వాసనలు కలిసిన వెగటు వాసనతో నిండిపోయింది.

పద్మినీ, హరిణీ కృష్ణప్రసాద్ కాయానికి ప్రదక్షిణలు చేసి, నమస్కారం చేశారు.

పద్మిని ఒక కట్టెను అందుకుంది. దానికి చివర పెట్రోల్ పోసి చేత్తో పట్టుకుంది.

హరిణి వైపు సూటిగా చూసింది. ఆవే దన, కోపం, అసహనం నిండిన పద్మిని కళ్ళు ఎర్రగా జ్యోతుల్లాగా ఉన్నాయి. ఆమె కాసేపు అలాగే చూస్తే, అసలే పెట్రోలు, కిరోసిన్‌తో తడపబడి ఉన్న భవంతి దానం తట అదే అంటుకుని తగలబడిపోయేట్లు జ్వలిస్తున్నాయి ఆమె కళ్ళు.

"హరిణీ. దీన్ని అంటించి నే చేతికిస్తాను. డాడీ చితిని నువ్వే అంటించాలి. అర్థ మైందా? "

హరిణి తల ఊపింది.

పద్మిని కొరివి అంటించింది. హరిణి చేతికి అందించింది.

హరిణి ఆ కొరివితో కృష్ణప్రసాద్ చితిని అంటించింది. గుప్పున మంటలు అంటుకు న్నాయి.

హరిణిని తీసుకుని ఒక్క అంగలో బయ టికి దూసుకుపోయింది పద్మిని.

ఒక్క నిమిషం ఆలస్యం చేసినా, వాళ్ళి ద్దరూ కూడా మంటలకి ఆహుతి అయిపో యేవాళ్ళు.

బయట రామ్‌కుమార్ కారుతో రెడీగా ఉన్నాడు. ఇద్దరూ ఒక్క ఉదుటున కార్లో చేరిపోయారు.

రామ్‌కుమార్ కారు గేటు బయటకు తీసుకెళ్ళి ఆపాడు.

"ఏమిటీ సాహసం? ఏమాత్రం అటూ ఇటూ అయినా ఇద్దరూ కాలిపోయేవాళ్ళు. ఇంత తెగువ పనికి రాదు" అన్నాడు మంద లింపుగా.

పద్మిని జవాబు చెప్పలేదు.

కిటికీ అద్దాలు తెరిచి, భవంతివైపే చూస్తోంది. మనుషులూ, పశువులూ, పక్షులూ అందర్నీ ఆదరించి ఎప్పుడూ కళక ళలాడుతూ కనిపించే ఆ భవంతి మంటల్లో మండిపోతోంది.

ఊళ్ళో జనం కూడా మంటలు చూసి, నిర్ఘాంతపోయి, అక్కడ పోగయ్యారు.

ఏం చేయలేక నిస్సహాయంగా నిలబడిపో యారు. హరిణి అత్త భుజానికి ఆనుకుని, భవంతివైపే చూస్తోంది. మంటల్లో మండి పోతున్న భవంతి... తను పుట్టి పెరిగిన భవంతి... ఆడుకున్న బొమ్మలు, సితార్, గిటార్ అన్నీ మండిపోతున్నాయి. వేటి గురించీ ఆమె బాధపడలేదు.

కానీ... ఆ మంటల్లో కాలిపోతున్న తండ్రి, తిరిగిరాని తండ్రి, తల్లీదండ్రీ గురువూ దైవం సమస్తం అయిన తన కొండంత దేవుడు... ఇక ఆయన శరీరం కూడా తనకి కనిపించదు. తనకి అన్నం పెట్టి, లాలించి, జోలపాడి నిద్రపుచ్చిన తండ్రి... తనకి గుండెజబ్బు నయమై మామూలుగా తిరగాలని తపించిపోయిన నాన్న తన కోసం కోటిదేవుళ్ళకి మొక్కిన డాడీ... ఈ ప్రపంచంలో కన్నతండ్రికి సాటి రాగల వ్యక్తి ఎవరు? అయ్యో డాడీ... నువ్వు మళ్ళీ కనిపించవా?

హరిణి గుండె ఆక్రోశించింది. "డాడీ.

భోరుమని ఏడ్చింది.

పద్మిని ఆమెని గుండెకి హత్తుకుంది. హరిణి ఒళ్ళు కదిలిపోతోంది. వెక్కిళ్ళు పెడుతూ ఏడుస్తోంది. పద్మినికి కూడా ఏడుపు ఆగటంలేదు. ఆమె కూడా భోరున ఏడ్చేస్తోంది. కన్నీళ్ళు జలజలా రాలి హరిణి తల మీద పడుతున్నాయి.

రామ్‌కుమార్ గుండె కదిలిపోయింది.

"ఏడవకు హరిణీ... ఏడవకు పద్మినీ. నువ్వే ఏడుస్తే పాపం చిన్నపిల్ల ఇంకా బెదిరిపోతుంది" అన్నాడు.

పద్మిని కాసేపటికి తెప్పరిల్లి, మౌనంగా ఆ భవంతివైపు చూస్తూ ఉండిపోయింది. వెక్కిళ్ళు తగ్గాయి.

తనూ భవంతివైపు చూస్తోంది.

మంటలు లేస్తూనే ఉన్నాయి. ఆ మంటలు హరిణి గుండెలో ఆరని మంటల్ని రేపాయి.

దాదాపు రెండు గంటలసేపు అక్కడే ఉండిపోయారు వాళ్ళు. అంతా తగలబడిపోయి ఉంటుందని నమ్మకం కుదిరాక ఇక బయలుదేరుదామన్నట్లు భర్తవైపు చూసింది రాణీ పద్మిని.

వ్యాన్ వేగంగా ముందుకి దూసుకుపోయింది.

"ఇలా చేస్తావనుకోలేదు" అన్నాడు రామ్‌కుమార్. అప్పటికి వాళ్ళు చాలా దూరం వచ్చేశారు. కాసేపు రిలాక్స్ అవుతున్నాడు అతను.

పద్మిని మాట్లాడలేదు. దూరంగా కూర్చుని తన ఒళ్ళో పడుకున్న హరిణి తల నిమురుతోంది.

"అసలిలా చెయ్యకూడదు" అన్నాడతను.

పద్మిని చివ్వున తల ఎత్తి అతనివైపు చురుగ్గా చూసింది.

"అంటే మీరు జగద్గురు ఆదిశంకరాచార్య చేసింది తప్పంటారా?" అంది.

## నలభై గాడిదల బరువు



మునిమాణిక్యం స్కూలు టీచరనేది తెలిసిన విషయమే. ఓ రోజున ఆయన క్లాసుపిల్లల కాంపొజిషన్ పుస్తకాలను కట్టగట్టి మోసుకొస్తున్నారు. ఆ సమయంలో ఓ కొంటె కుర్రాడు వ్యంగ్యంగా-

'మాస్టారూ గాడిదబరువు మోసుకొస్తున్నారే? ' అన్నాడు.

మునిమాణిక్యమేమన్నా తక్కువ తిన్నారా? వెంటనే-

'ఒక్క గాడిదకాదు నాయనా.. నలభైగాడిదల బరువిది' అంటూ తిప్పికొట్టారు.

ఎకసక్కెం చేయబోయిన
కుర్రాడి ముఖాన నెత్తురు
చుక్కుంటే ఒట్టు.

రామ్‌కుమార్‌కి ఆధ్యాత్మిక ప్రపంచంతో పెద్ద పరిచయం లేదు. తన బిజినెస్ ఏంటో తనేంటో తప్ప ఇంకో ప్రపంచం అతనికి తెలియదు కూడా. కానీ తండ్రి నరసింహ ప్రసాద్ ఆధ్యాత్మికత గురించి పద్మినికి చిన్నప్పుడు కృష్ణప్రసాద్‌తో కలిపి నూరిపోశాడు.

రామ్‌కుమార్ పద్మినివైపే చూస్తున్నాడు. పద్మిని మొహంలో ఇప్పుడు దుఃఖం లేదు. ఎప్పటిలాగే ఏ భావమూ కనిపించటంలేదు. శిలలా ఉంది. ఆమె కళ్ళల్లో

మాత్రం ఎప్పుడూ లీలగా కనబడుతుండే కర్కశత్వం. హరిణి చుట్టూ చేతులు వేసి పట్టుకుని ఉంది. ఆ చేతుల్ని అలా పెనవేయటంలో అదో మాదిరి దృఢత్వం, పట్టుదల. పద్మిని ఏ పని చేసినా, దాని అంతు చూసి కానీ వదలదు. అందుకే కాబోలు కృష్ణప్రసాద్ తన ప్రాణానికి ప్రాణమైన కూతుర్ని ఆమెకి అప్పగించి, నిశ్చింతగా ప్రాణం వదిలాడు అనుకున్నాడు రామ్‌కుమార్.

"ఇందులో నేను కొత్తగా చేసిందేం లేదు" అంది పద్మిని. "జగద్గురువు ఆదిశంకరాచార్య సన్యాసం స్వీకరించాలనుకున్నప్పుడు తల్లికి ఆమె మరణ సమయంలో తాను ఎక్కడున్నా వస్తానని మాట ఇచ్చాడు. అలాగే ఆమె మరణకాలం

ఆసన్నమైనప్పుడు ఆయన వచ్చాడు. కానీ సన్యాసం స్వీకరించిన వాడికి ఆ ఇంటికి తిరిగి వచ్చే అధికారం లేదు. అందుకని ఊళ్ళో వాళ్ళంతా ఆక్షేపించి వెళ్ళిపోయారు. తల్లికి ఇచ్చిన మాటకి కట్టుబడి, శంకరాచార్యులవారు ఆమె దహనకాండ తానే జరిపించాలని నిశ్చయించుకున్నారు. ఇంట్లోనే ఆమె దేహాన్ని ఉంచి, ఎవరి సాయమూ లేకుండా, ఇంటికి నిప్పుపెట్టి, ఆమె దహనం జరిగిపోయేలా చూశాడు" అంది రాణీ పద్మిని.

రామ్‌కుమార్ మౌనంగా విన్నాడు.

"తర్వాత ఏం చేస్తావు" మెల్లగా అడిగాడు.

"చూస్తాను. అక్కడే ఆ స్థలంలోనే ఒక సమాధి కట్టించాలని ఉంది" అంది పద్మిని.

★ ★ ★

హరిణిని మామూలు మనిషిని చేయటం అత్యంత దుర్లభమైన కార్యం అయింది పద్మినికి.

హరిణి దేనికీ పేచీ పెట్టడంలేదు. పద్మిని చెప్పినట్లే వింటుంది. ఏం చేయమంటే అది చేస్తుంది. కానీ, మనిషి నూరేళ్ళు నిండిన ముదివగ్గులా తయారైంది. అదోమాదిరి శాంతం ... ఏదీ పట్టనట్లు నిర్లిప్తత.

పద్మిని సైకియాట్రిస్ట్‌ని సంప్రదించింది.

"చిన్న పిల్ల. పాపం, తట్టుకోలేని పరిస్థితులు ఎదురయ్యాయి. ఒంటరిగా ఉంచకుండా అన్ని చోట్లకీ తిప్పుతుండండి" అన్నాడాయన.

"అది మళ్ళీ మామూలు మనిషి అయ్యేట్లు కనిపించటంలేదు. నాకెందుకో దాన్ని చూస్తే భయం వేస్తోంది" అంది రాణీ పద్మిని.

సైకియాట్రిస్ట్ పద్మిని హరిణి గురించి చెప్పినప్పుడే అన్ని వివరాలూ అడిగాడు. హరిణి గురించి పూర్తి అవగాహనకు వచ్చాడు.

"అనవసరంగా వర్రీ అవకండి. మెల్లగా అందరు పాపల్లాగే తయారవుతుంది" అన్నాడు.

రాణీ పద్మిని మౌనంగా ఉంది.

"చూడండి. మీకు పాప గురించి బాగా తెలుసు. ఆమె స్వతహాగా సున్నిత మనస్కురాలు. ఒక ప్రశాంత వాతావరణంలో, స్వచ్ఛంగా స్వచ్ఛమైన తటాకంలో నీటిలా హాయిగా గడిపింది. అంతవరకూ లోకంలో మంచినీ, ఔదార్యాన్నీ మాత్రమే చూసిన ఆమెకి ఒక్కసారిగా లోకంలో దుర్మార్గమంతా బట్టబయలయేసరికి తట్టుకోలేకపోయింది. లోకుల మనస్సులో గరళం చూసిన ఆ పాప గుండె పాషాణంలా మారింది. అందుకే తండ్రి చావునీ, భయంకరమైన అంత్యక్రియల్నీ చూసి కూడా చలించలేదు. కానీ ఇది తాత్కాలికం. ఆమె మనసు ఒరిజినల్‌గా సున్నితమైంది. వెన్నలాంటిది. మళ్ళీ ఆ సున్నితత్వం తన్నుకుని పైకి లేచి, ఆమెని నిర్లిప్తంగా మార్చి ఉంటుంది. ఆ సున్నితత్వం ఇంకా ఇంకా పైకి వచ్చేస్తుంది. అప్పుడు మళ్ళీ అన్ని స్పందనలూ మొదలవుతాయి. అప్పుడు పాప మళ్ళీ తుళ్ళుతూ ఆడుకునే మామూలు పాప అయిపోతుంది" అన్నాడాయన.



పద్మిని వింటోంది. ఆమె ఆలోచనలు ఎటో పోతున్నాయి.

"ఇలాగే జరుగుతుందా? " అడిగింది డాక్టర్ అమె వైపు నవ్వుతూ చూశాడు.

"ఇలాగే జరగవచ్చు. కానీ జరిగి తీరు తుందా అంటే... ఇవన్నీ మనసుకి సంబం ధించిన విషయాలు. అందరూ ఒకేలా ఒకేలా రియాక్ట్ అవరు" అన్నాడు.

మనసు... మనిషికి దేవుడిచ్చిన గొప్ప వరం. పెద్ద శాపం...మనసు. మాయల గుర్రంలాంటిది మనసు. చిత్రమైనది మనసు.

అంత గొప్ప సైకియాట్రిస్ట్ కూడా పద్మిని మనసులో చెలరేగుతున్న ఆలోచనల్ని పసి గట్టలేకపోయాడు. ఆయన ఏ మాత్రం పసి గట్టినా "వద్దు వద్దు" అని గట్టిగా వారించే వాడు.

పద్మిని చాలా గొప్ప మనిషి. ఆమె కావా లనుకుంటే, తన మొహంలో గొప్ప కర్క శత్వం, క్రూరత్వం ప్రదర్శించగలదు. వద్దను కుంటే, రాతి బొమ్మ మొహంలా ఏ భావమూ లేకుండా ఉంచుకోగలదు.

నిశ్చలంగా ఉన్న ఆమె మొహంలో డాక్ట ర్‌కి ఏ భావమూ కనిపించలేదు.

"పాప తొందరలోనే నార్మల్‌గా అవు తుంది. డోంట్ వర్రీ ప్లీజ్" అన్నాడు.

పద్మిని తల ఊపి ఊరుకుంది. రాణీ పద్మిని ఎవరినీ నమ్మదు. ఆఖరుకి డాక్టర్‌ని కూడా.

మనకి తెలియని విషయాల్లో నిపుణులు చెప్పింది నమ్మక తప్పదు. కాబట్టి రాణీ పద్మిని తనకు పూర్తిగా తెలియని విషయ మంటూ లేకుండా, అన్ని రంగాల్లోనూ కొద్దో గొప్పో విజ్ఞానాన్ని సంపాదించేసింది. ఇంకా తెలుసుకోవాలంటే స్వయంగా పుస్తకాలు చదివి తెలుసుకుంటుంది.

అలాగే వైద్యరంగంలోనూ, మానసిక శాస్త్రంలోనూ రాణీ పద్మినికి కొంత పరిజ్ఞానం ఉంది.

డాక్టర్ చెప్పింది ఆమెకి అర్థమైంది. హరిణి తాత్కాలికంగా బండగా మారినా, ఆమె అసలు తత్వానికి త్వరలోనే రివర్ట్ అవుతుంది.

రాణీ పద్మిని డాక్టర్ దగ్గర శలవు తీసుకుని, బయటకు వచ్చి కారు స్టార్ట్ చేసింది.

రద్దీగా ఉన్న ట్రాఫిక్‌లో కారుని చురుగ్గా, తేలిగ్గా నడిపేస్తూ ఆలోచిస్తోంది.

హరిణి త్వరలోనే మళ్లీ సెన్సిటివ్ గర్ల్ అయిపోతుంది. హరిణి అలా అవటం రాణీ పద్మినికి ఇష్టం లేదు. అలా అయితే ఇంకేం ప్రయోజనం? అది మళ్ళీ తండ్రిలాగే తయారవుతుంది. సున్నితమైన మనస్సు ఉండి, అన్నిటికీ బాధపడుతూ, అన్నయ్య ఎంత క్షోభ అనుభవించాడో తనకి తెలుసు అది కృష్ణప్రసాద్ కూతురిలా కాదు, రాణీ పద్మిని మేనకోడలుగా మారాలి. అప్పుడే తను అన్నయ్యకి ఇచ్చిన మాట నెరవేర్చుకోగలదు.



★ ★ ★

"హరిణీ రేపు మనం ఫారెస్ట్‌కి వెళుతున్నాం" అంది రాణీ పద్మిని.

"ఫారెస్ట్‌కా? ఎందుకూ?" హరిణి ఆశ్చర్యంగా అడిగింది.

"ఒక స్పెషల్ టైప్ చెట్టు ఉందక్కడ. దాని వేరు తెచ్చుకోవాలి."

"ఎందుకూ?"

"అది వేడి నీళ్ళల్లో వేసి కషాయం కాచి తాగితే గుండెకి బోలెడంత బలం వస్తుంది. మనిషికి దేన్నయినా భరించగల శక్తి వస్తుంది."

"అది ఎవరి కోసం అత్తా?"

"నీ కోసమేనే తల్లీ." హరిణి బుగ్గమీద ముద్దుపెడుతూ చెప్పింది రాణీ పద్మిని.

"నా కెందుకత్తా. నేనన్నీ భరించానుగా?" హరిణి అమాయకంగా అడిగిన ప్రశ్నకి రాణీపద్మిని గుండె తరుక్కుపోయింది.

"అది కాదు హరిణీ. చాలా చాలా ఉంటాయి. ముఖ్యంగా మనిషి సెన్సిటివ్‌గా ఉండకూడదు."

"ఉంటే."

"ఉంటే ప్రతిదానికీ బాధపడతారు. శాంతి ఉండదు. హాయి ఉండదు."

"ఓహో"

"మరి రెడీయేనా?"

"ఓ" అంది హరిణి

మర్నాడు పొద్దున్నే రాణీపద్మిని హరిణికి స్నానం చేయించి, తల దువ్వి గౌన్, బూట్లు వేసి రెడీచేసింది.

కార్లో వాటర్ బాటిల్స్, హాట్‌పాక్స్, టార్చ్ లైట్, గునపం, కత్తి, పెద్ద కత్తెరలూ పెట్టింది. పెట్రోల్ పోయించి. కారుని హైదరాబాద్ పొలిమేరల్లోకి దౌడు తీయించింది.

హైవే మీద కారు స్పీడ్‌గా దూసుకుపోతోంది. "అత్తా, ఇంకా ఎంతసేపు?" హరిణి అడిగింది.

"ఇంకో రెండు గంటలు."

"నీకా అడవి బాగా తెలుసా?"

ఈ చెట్టు గురించి ఎలా తెలుసు అని అడగాలని ఉంది హరిణికి. కానీ స్పీడ్‌గా, ఏకాగ్రతగా కారు నడుపుతున్న పద్మినిని చూసి, అడగాలంటే జంకుగా అనిపించింది.

పద్మిని ఒక విశిష్ట వ్యక్తి. ఆమెని పూర్తిగా

ఎవరూ, ఎన్నడూ అర్థం చేసుకోలేదు. చేసుకోలేరు కూడా. పద్మిని ఏకాగ్రత చెదరగొట్టటం ఎవరితరమూ కాదు. ఆమె మనసులో చాలా అరలున్నాయి. ఏ విషయాన్ని అయినా అక్కడికక్కడే మూసేసే సామర్థ్యం ఆమెకుంది. కానీ ఏదీ మర్చిపోవటం అంటూ ఎన్నడూ జరగదు. కావల్సినప్పుడు ఆ విషయాన్ని మళ్ళీ జ్ఞాపకం చేసుకుంటుంది. అంతేకాదు. ఆమె బుర్ర ఒక కంప్యూటర్ లాంటిది. ఒక టాస్క్‌ని స్క్రీన్ లోపల వర్కింగ్‌లో ఉంచి, మరోపని తెర మీద జరిపించే కంప్యూటర్‌లా ఆమె ఏకకాలంలో రెండు మూడు పనులు చేయగలదు. ఒక పుస్తకం చదువుతూ అందులోని విషయాన్ని గ్రహిస్తూ, మరో పక్క ఎవరన్నా మాట్లాడుతుంటే ఒక్కమాట కూడా పొల్లు పోకుండా వినగలదు. ఆ రెంటిలో ఏ ఒక్కదాని మీద కూడా ఆమె ఏకాగ్రత చెడదు, చెదరదు.

మిన్ను విరిగి మీద పడ్డా చలించకపోవటం ఆమె మరో ప్రత్యేకత.

కానీ కృష్ణప్రసాద్ అలా కాదు, ఆయన ప్రతిదానికీ చలించిపోయేవాడు. సున్నిత మనస్కుడు కావటంచేత ప్రతిదానికీ స్పందించేవాడు.

మెల్లమెల్లగా కృష్ణప్రసాద్‌కీ రాంకీ పద్మినికీ మధ్య ఉన్న అంతరాలు, వాటి లోపల అంతర్లీనంగా వ్యాపించి ఉన్న పద్మిని విశ్వరూపం హరిణికి అర్థమవుతున్నాయి. అత్త అంటే ఆరాధన పెరిగిపోతోంది.

"హరిణీ"

"ఊ"

"నాకు ఆ చెట్టు గురించి ఎలా తెలుసని కదూ నీ సందేహం? "

అత్త తన మనసులోని భావాన్ని చదివినట్లే అడగటం హరిణికి ఆశ్చర్యం కలిగించింది.

"అవును"

"నేను ఎమ్మెస్సీ బాటనీ చదివాను"

"తెలుసత్తా" అంది హరిణి. వాళ్ళు అప్పటికి అడవి దగ్గరకు వచ్చేశారు. హైవే దాటించి ఒక మట్టిరోడ్డు మీదికి కారుని మళ్ళించింది పద్మిని. చిన్న ఊరు వచ్చింది. అక్కడి నుంచి కూడా ఆ పరిసరాలలో బాగా పరిచయం ఉన్న మనిషిలా కారుని ముందుకి పోనిస్తోంది పద్మిని.

"నాకు రకరకాల చెట్లు, ఆకులు అన్నీ తెలుసు. ఈ వేరు గురించి చదివాను. దాన్ని నాకు తెలిసిన వాళ్ళు ఉపయోగించటం చూశాను. బాగా బెనిఫిట్ అయారు"

కారు కచ్చా రోడ్డు కూడా దాటి, చివరకు ఒక అతి చిన్న పల్లెటూరును ప్రవేశించింది.

అది చాలా చిన్న ఊరు. అసలు మనుషులు ఉన్నారా, లేదా అన్నట్లుంది.

రాణీ పద్మిని హాట్‌పాక్‌లోంచి భోజనం తీసి, పేపర్ ప్లేట్లలో వడ్డించి, హరిణికి ఒక ప్లేట్ ఇచ్చి తను ఒకటి తీసుకుంది. ఇద్దరూ మెల్లగా తింటున్నారు. ఆ తర్వాత కాసేపు రెస్ట్ తీసుకుని, ఫ్లాస్క్‌లో పాలు హరిణికి ఇచ్చి, తను ఇంకో ఫ్లాస్క్‌లోంచి టీ తాగింది. పేపర్ ప్లేట్లూ, గ్లాసులూ అన్నీ ఒక కవర్‌లో వేసేసింది.

ఇంకాస్సేపు విశ్రాంతి తీసుకున్నాక రాణీపద్మిని డోర్ తెరిచి, ఒక బాస్కెట్‌తో కిందికి దిగింది. హరిణి ఆమె బ్యాగ్ తీసుకుని ఆమె వెనకే దిగింది. రాణీ పద్మిని కారు డోర్ లాక్‌చేసి ముందుకి నడిచింది. హరిణి ఆమె పక్కనే నడుస్తోంది.

అడవి దారి... పెద్ద పెద్ద టేకు చెట్లూ, పేర్లేవో తెలీని వృక్షాలూ, లతలూ, దట్టంగా ఉన్న ఆ చెట్లన్నీ చూస్తుంటే హరిణికి భయం వేసింది.

"అత్తా, ఇదంతా అడవి కదూ? "

"అవును"

మనం కోరేది మనకు దొరకదు. కాబట్టి మనకు దొరికిన దానినే ఇష్టపడదాం.

– హెన్రీ డేవిడ్ థొరియో

"తప్పిపోం కదా?"

రాణీ పద్మిని నవ్వేసింది

"నాకీ దారంతా బాగా తెలుసు" అంది.

హరిణి ఆమె పక్కనే నడుస్తోంది. మన సులో ఏవేవో సందేహాలు

"అత్తా"

"ఏంటి? మళ్ళీ ఏం డౌట్?"

హరిణి చుట్టూ చూస్తోంది. మనిషి ప్రకృతి ఒడిలో పుట్టాడు. సృష్టి జరిగిన ప్పుడు ఈ మేడలూ, కార్లూ లేవు. పచ్చటి ప్రకృతి మాత్రం ఆనాడూ, ఈనాడూ కూడా ఉంది. అందుకే తన పుట్టిల్లయిన ప్రకృతిని చూసి ఆనందించని మానవుడు ఉండడు.

"అత్తా"

"అడుగు"

"అత్తా, ఇక్కడ అడవిలో దెయ్యాలుం టాయా?"

పద్మిని గట్టిగా నవ్వేసింది.

హరిణి చిన్నబుచ్చుకుంది.

"అత్తా, మా ఊళ్ళో చెపుతుండేవాళ్ళు. అడవిలో కొరివి దయ్యాలుంటాయని చెప్పారు. ఎవరూ లేనిచోట కొరివి దెయ్యాలూ, మామూలు దెయ్యాలూ ఏవేవో ఉంటాయిట"

పద్మిని ఆగిపోయి హరిణి చేతిని అందు కుని ముద్దుపెట్టుకుంది.

"నమ్మకు, అలాటివేమీ ఉండవు. అడవి లోనే కాదు. శ్మశానంలో గానీ, మరెక్కడా గానీ ఉండవు"

"ఒక వేళ ఉంటే?"

"ఉండవు. ఒకవేళ... నీ సందేహం ప్రకారం ఉన్నా ఎవర్నీ ఏం చేయవు"

"నీకెలా తెలుసు?"

పద్మిని మళ్ళీ గట్టిగా నవ్వేసి, క్షణంలో మళ్ళీ మామూలు గంభీరంగా మారిపో యింది.

"హరిణీ" ఆమె గొంతు మెల్లగా ధ్వనిం చింది.

"ఏంటత్తా?"

"ఈ అడవిలో నక్సలైట్లూ, అడవి దొంగలూ లాంటి వాళ్ళు ఉంటారు తెలుసా?"

హరిణి పెద్ద పెద్ద కళ్ళు మరింత విశాల మయ్యాయి.

"అవును. వార్తల్లో చెపుతుంటారు కదా" అంది.

"అవునా? మరి ఏనాడైనా వాళ్ళని ఏ దెయ్యమో పిశాచమో చంపిందని విన్నావా?"

"లేదు" హరిణి అడ్డంగా తల ఊపింది.

"లేదు కదూ? మరి దెయ్యాలుంటే, అవి మనుషులకి అపకారం చేస్తాయన్నమాట నిజం అయితే వాళ్ళకి కీడు చేసి ఉండాలి కదా?"

"అవును కదా?"

"అవునా? అంటే దెయ్యాలు లేవు. ఉన్నా ఎవర్నీ ఏం చేయవు. సరేనా. పులులూ, సింహాలూ ఎలుగుబంట్లూ ఉంటాయి. కానీ ఆహారం కోసం తప్ప ఏ జంతువూ మనిషిని ఎటాక్ చెయ్యదు. కానీ మనిషి అంత దుర్మార్గపు జంతువు మరి ఏదీ ఉండదు. మనిషి అవసరం ఉన్నా, లేకపోయినా అన వసరంగా, నిష్కారణంగా ఎదుటివాడికి అప కారం చేయాలని ఉత్సాహపడతాడు. ఎంత క్రూర జంతువు అయినా సరే, దాని మన సులో భావాలు దాచుకోదు. ఎటాక్ చేస్తుం దేమోనని నువ్వు ఈజీగా కనిపెట్టవచ్చు కానీ మనసులో కుళ్ళు కల్మషం అంతా దాచుకుని, పైకి నవ్వుతూ మాట్లాడగలిగే మహా క్రూర జంతువు మనిషి ఒక్కడే. మనుషులతో జాగ్రత్తగా ఉండు చాలు. దెయ్యాలూ, వైల్డ్ యానిమల్స్ గురించి అసలు ఆలోచించను కూడా ఆలోచించకు"

హరిణి శ్రద్ధగా వింటోంది

పద్మిని మాట్లాడుతూనే చకచకా నడిచే స్తోంది.

ఆమెకి ఈదారి బాగా అలవాటయిందేనని హరిణి గ్రహించింది. తుప్పలూ, ముళ్ళూ,

రాళ్ళూ అన్నీ తేలిగ్గా దాటేస్తోంది.

హరిణి చుట్టూ చూసుకుంటూ నడుస్తోంది. పెద్ద పెద్ద మర్రి చెట్లు, వాటి ఊడలు సినిమాల్లో చూపించే ఊడల్లా నేలలోకి దిగి ఉన్నాయి. ఒక్కో చోట ఒక చెట్టుకీ, మరో చెట్టుకీ బలమైన లతలు పెనవేసుకుని వున్నాయి. టార్జాన్ సినిమాల్లో లాగా మనిషి వాటిని పట్టుకుని లాఘవంగా అటూ ఇటూ దూకవచ్చు అంతా తమాషాగా ఉంది. ఉండుండి కొన్ని జంతువులు, కుందేళ్ళో మరి ఇంకేంటో గానీ, గబగబా దూకినట్లు పరుగెత్తి పారిపోతున్నాయి.

పద్మినికి కావల్సిన చెట్టు కనిపించింది. పదునైన కత్తి తీసి, చకచక తనక్కావల్సిన వన్నీ కోసేసింది. బ్యాగ్ నిండా నింపింది. ఆమె మొహంలో ఏదో తృప్తి.

ఇద్దరూ బయల్దేరి తిరుగు ముఖం పట్టారు. "హరిణీ ఎలా ఉంది? పాలుగానీ, ఇంకేమైనా కానీ తాగుతావా?" అడిగింది పద్మిని.

"అఖ్కర్లేదత్తా. బాగానే ఉంది."

హరిణికి పద్మినిని చూస్తూంటే ఆరాధనా, ప్రేమా కూడా కలిగాయి. లోకం అంతా మోసం చేసినా కనీసం అత్త ఉంది చాలు. తన కోసం ఎంత కష్టపడుతుందో పాపం. మహారాణి లాంటి రాణీ పద్మిని అత్త తన కోసం కాలి నడకన ఎంత దూరం వచ్చింది పాపం.

పద్మినీ మొహం మీద ముత్యాల్లా చెమట బిందువులు శరీరమంతా చెమటలో తడిసి పోయి ఉంది.

"అత్తా."

"ఏంటి హరిణీ."

"నా కోసం చాలా కష్టపడుతున్నావు అత్తా."

బాధపడుతూ అంది హరిణి.

ఇంతలో వాళ్లు మళ్లీ సెలయేరు దగ్గరకు వచ్చారు. "ఏం లేదు హరిణీ... నామీద నీకు ఎలాంటి అభిప్రాయం ఉంది?" ఒక చెట్టు కింది నిల్చుని అడిగింది రాణీ పద్మిని.

ఆమె హరిణి వైపే సూటిగా చూస్తోంది. హరిణి కూడా రాణీ పద్మిని వైపు సూటిగా చూసింది.

"అత్తా... నువ్వు తప్ప నాకెవ్వరూ లేరు. ఎవ్వరూ అఖ్కర్లేదు కూడా." అంది.

రాణీ పద్మిని కళ్లు తృప్తితో మెరిశాయి.

"చాలు హరిణీ. నేను చెప్పినట్లు విను చాలు. నిన్నో అద్భుత వ్యక్తిని చేస్తాను" అంది రాణీ పద్మిని కంచుకంఠంతో

ప్రకృతి మాత ఒడి... ఏటి జలజల... ఆకుల గలగల... ఎటు చూసిన పచ్చదనపు మిలమిల... వాటి మధ్య హరిణికి ఆ మాటలు వేదమంత్రాల్లా వినిపించాయి. మంత్రాల ఘోష తన చెవుల్లో మారుమోగుతున్నట్లూ, తాను మంత్రముగ్ధ అయిపోయినట్లూ అనిపించింది. రాణీ పద్మిని వైపే చూస్తూ ఉండిపోయింది.

రాణీ పద్మిని హరిణి చేతిని తన చేతిలోకి తీసుకుంది. ఆమె కళ్లు పట్టుదలతో, ప్రేమతో మెరుస్తున్నాయి.

"అత్తా, నువ్వు తప్ప నాకెవరూ లేరు" అన్న మాటలు శిలలాటి ఆమె గుండెని కరిగించాయి.

"నేనున్నాను హరిణీ... నీకు నేనున్నాను," అనుకుంది. "అత్తా, అందరూ డాడీని ఎలా మోసం చేశారు. తల్చుకుంటే భయం వేస్తోంది." అంది హరిణి.

"నీకు ఏ భయమూ లేకుండా చేస్తాను" అంది రాణీ పద్మిని

"ఎలా?" హరిణి ఆశ్చర్యంగా చూసింది.

"చెప్పను. ఇంక నుంచీ నేను నీకు ప్రిసెప్టర్‌ని. నేను చెప్పింది వింటూ ఉంటే చాలు" అంది రాణీ పద్మిని.

ఇద్దరూ మళ్లీ నడుస్తున్నారు.

చెట్లు ఊగుతున్నాయి. గాలి రివ్వున వీస్తోంది. ఎండుటాకుల మీద వాళ్ల పాదాలు పడ్డప్పుడు గలగలమని శబ్దం. ఉండుండి ఏవో చప్పుళ్లు. ఏదో జరజర పాకి

నట్లు...

ప్రాచీన కాలంలో గురువు వెంట శిష్యుడు వెళ్లినట్లు పద్మిని వెంటే నడుస్తోంది హరిణీ.

చీకటి పడే లోపలే ఇద్దరూ కారు దగ్గరకు చేరుకున్నారు.

కారు వేగంగా హైదరాబాద్ వైపు దూసుకుపోయింది.

"ఈ రోజుల్లో డాషింగ్, డేరింగ్, డైనమిక్‌గా మాత్రం ఉంటే చాలదు. డెవిలిష్‌గా కూడా ఉండాలి" పాఠం చెపుతున్నట్లు బోధించింది రాణీ పద్మిని.

" పాజిటివ్ వే ఆఫ్ థింకింగ్ ఉండాలి. అడవికి వెళ్లున్నప్పుడు అడిగావు చూడు, అక్కడ పులులుంటాయా, దెయ్యాలుంటాయా అని, అవి ఉంటాయేమోనని భయపడితే వెళ్ళగలిగే వాళ్ళమా? మనిషికి తెగింపు ఉండాలి. గుండెబలం, కండబలం కూడా ఉండాలి" అంది రాణీపద్మిని.

"మరి నాకు అవి లేవుగా? " హరిణి బిక్క మొహం వేసింది.

రాణీపద్మిని చిరునవ్వు నవ్వి ఊరుకుంది. మర్నాటికల్లా రాణీపద్మిని హరిణి గుండె బలం పెంచి ఆ గుండెని రాతిబండలా చెయ్యటానికి కార్యక్రమం సిద్ధం చేసింది.

పొద్దున్న హరిణి లేచి, బ్రష్ చేసుకుని, పాలు తాగింది.

"అలా వెళదాం రా" అంది రాణీపద్మిని. బంగళా లోపల రోడ్డు ఉంది. ముందువైపు కూడా గేటు దాటాక సిమెంట్ రోడ్డూ దానికి రెండు వైపులా చెట్లూ ఉంటాయి. లోపలవైపు ఒక్కోచోట కూర్చోవటానికి రాళ్ళు, సిమెంట్ సోఫాలూ ఉన్నాయి. బంగళా వెనకవైపు తోటలో సిమెంట్ తిన్నె ఉంది. మాంసం ఫ్రెష్‌గా ఉండాలని కోళ్ళూ, మేకలూ అక్కడే కోస్తుంటారు. నీటి పంపులు కూడా అక్కడ ఉన్నాయి.

కృష్ణప్రసాద్ పూర్తి అహింసావాది. మాంసం తినేవాడు కాదు. హరిణి ఇంతవరకూ ఏ పిట్టను కూడా చంపటం చూడలేదు.

హరిణిని సిమెంట్ తిన్నె దగ్గరకు తీసుకెళ్ళింది రాణీపద్మిని. తమ హరిణికి ఇవ్వాల్సిన ట్రీట్‌మెంట్ గురించి ఆమె సైకియాట్రిస్ట్‌ని సంప్రదించిననాడే నిర్ణయించేసుకుంది.

సిమెంట్ తిన్నెకి ఎదురుగా ఉన్న రాతి సోఫాలో తను కూర్చుని, హరిణిని పక్కన కూర్చోబెట్టుకుంది.

ఇంతలో ఒక నౌకరు చేతిలో కోడిపెట్టని పట్టుకుని వచ్చాడు. అది రెక్కలు టపటపలాడిస్తూ గింజుకుంటోంది. క్కొక్కొక్కొ అని అరుస్తోంది.

"దాన్ని వదిలెయ్యమను." అంది హరిణి.

"లేదు. ఏం చేస్తాడో చూడు."

"నాకు భయం వేస్తోంది."

"భయం వెయ్యకూడదు." స్థిరంగా చూస్తూ చెప్పింది రాణీ పద్మిని.

నౌకరు కోడితో సహా చప్టా మీదికి చేరాడు. ఇంకో నౌకరు పదునైన కత్తితో అక్కడికి వచ్చాడు.

హరిణి కళ్ళు పెద్దవి చేసి చూస్తోంది. ఏం జరగబోతోందో తెలిసిపోయింది హరిణికి. అక్కడినుంచి వెళ్ళిపోవటానికి తయారై లేచింది.

రాణీపద్మిని చెయ్యి ఆమె చేతిని బలంగా పట్టుకుని ఆపేసింది.

నౌకరు చేతిలో కత్తి తళతళ మెరిసింది. కోడిమెడవైపు బలంగా ఒక్క వేటు.

చివ్వున రక్తం చిమ్మింది.

కెక్‌మంటూ చప్పుడు.

కోడి తల వేరయింది. మొండెం మెడలోంచి రక్తం...

హరిణి కళ్ళు పెద్దవిచేసి చూస్తోంది.

రాణీ పద్మిని కూడా ఆ సన్నివేశాన్ని

ఇతరులను ఎల్లప్పుడూ ద్వేషించడం లేదా ముఖప్రీతి వాక్యాలతో మెప్పించడం దాస్యబుద్ధిని వెల్లడిస్తుంది. – జార్జి వాషింగ్టన్

సినిమా చూసినట్లు చూస్తోంది.

తనెందుకు స్పృహతప్పి పడిపోలేదో హరిణికి అర్థంకాలేదు. తను గనక ఇదివరకటి హరిణే అయి ఉంటే తప్పకుండా స్పృహతప్పి పడిపోయి ఉండేది. ఇప్పుడైనా ఆ సన్నివేశాన్ని చూసి తట్టుకునే ధైర్యం లేదు. కానీ చూడగలిగింది. అంతే.

హరిణి అనుభవించిన కష్టాలు ఆమె గుండెని గట్టిపరిచే ఉంటాయని రాణీపద్మిని విశ్వాసం. ఆ హృదయం ఇప్పుడు మరీ కోడి మరణం చూడగానే మూర్ఛపోయేంత మృదువైనది కాదు. కానీ, భవిష్యత్తులో ఇంతకన్నా బండగా ఉండాలనీ; కఠినత్వం ఆ గుండెని ఆవరించాలని రాణీపద్మిని కోరిక.

హరిణి చేతిని పట్టుకుని లోపలికి తీసుకెళ్ళింది రాణీపద్మిని.

ఇద్దరూ హాల్‌లోకి వచ్చారో లేదో, రామ్‌కుమార్ ఆతృతగా చూస్తూ ఎదురయ్యాడు.

"ఏమయ్యారు? మీ కోసం వెతుక్కుంటున్నాను" అన్నాడు.

"ఏమవుతాం? తప్పిపోతామా? " రాణీ పద్మిని చిరుకోపంతో అడిగింది.

రామ్‌కుమార్ నవ్వేశాడు.

"నువ్వు నీ రూమ్‌లోకి వెళ్ళు" అంది రాణీ పద్మిని హరిణితో. ఇంతసేపూ ఆమె హరిణి చేతిని పట్టుకునే ఉంది. హరిణి ఆమె చెయ్యి విడిపించుకుని తన గది వైపు వెళ్తోంది.

"హరిణీ. ఆర్యూ ఓ. కే. ఒంటరిగా ఉండగలవు కదా. ఏమాత్రం మొహమాటం లేకుండా చెప్పు" అంది రాణీ పద్మిని.

"ఫర్వాలేదు. బాగానే ఉన్నాను" అనేసి ముందుకి నడిచింది హరిణి.

రాణీ పద్మిని హాల్లో సోఫాలో కూర్చుంది. ఆమె ధరించిన ఎర్రటి సిల్కు నైటీ రక్తంలో ముంచినట్లు ఎర్రఎర్రగా మెరుస్తోంది. జుట్టుని ఎర్రటి సిల్క్ రిబ్బన్‌తో పైకి కట్టింది. ఆమె మొహాన బొట్టు లేదు. చేతులకి మెడలో ఎక్కడా ఏ నగా లేదు. అయినా చాలా విలక్షణంగా కనిపిస్తోంది. ఏ నగా, ఏ అలంకారం లేకపోయినా, దర్పంగా, విశ్రాంతి గదిలో ఉన్న ఈజిప్షియన్ మహారాణిలా కనిపిస్తోంది.

సర్వెంట్ తెచ్చిన కాఫీ కప్పు అందుకుంది.

## అంతా లాభమే నాన్నా!



మునిమాణిక్యం ఓ రోజు కొడుకుకు నోటి లెక్కలు నేర్పిస్తూ 'ఒరే నాయనా మనింటి ఖరీదు పదహారు వేలు... లక్షరూపాయలకు అమ్మితే లాభమెంత? ' అంటూ అడిగారు.

వాడేం మాట్లాడలేదు.

'మాట్లాడవేం? లాభమెంత? ' రెట్టించారు మునిమాణిక్యం.

'నాన్నా అసలు ఈ ఇల్లుమనదికాదు గదా? ' అన్నాడు వాడు సంశయిస్తూ.

ఎలాగైనా వాడితో జవాబు చెప్పించాలన్న ఉద్దేశంతో 'మనదే అనుకోరా.. లాభమెంత చెప్పు' మళ్ళీ అడిగారాయన కొద్దిగా విసుగ్గా.

'అలాగైతే లక్షకు లక్షా అంతా లాభమే నాన్నా' అంటూ లేచి చక్కాపోయాడు.

రామ్‌కుమార్ మరోకప్పు తీసుకుని, ఆమె ఎదురుగా ఉన్న సోఫాలో చతికిలపడ్డాడు.

"పొద్దున్నే తోటలోకి షికారుకి వెళ్లారా? " అన్నాడు.

"లేదు. హరిణికి కాస్త స్పెషల్ ట్రీట్‌మెంట్ ఇవ్వాలని వెళ్ళాను"

"ఏమిటా స్పెషల్ ట్రీట్‌మెంట్? " కాఫీ సిప్ చేస్తూ క్యాజువల్‌గా అడిగాడు రామ్‌కుమార్ అదేదో సూర్య నమస్కారమో, పొద్దున్నే విరిసిన పూబాలల్ని చూపించటమో లాంటిదై ఉంటుందని ఊహిస్తూ.

రాణీ పద్మిని తన ట్రీట్‌మెంట్ వివరించింది. రామ్‌కుమార్ అదిరిపడ్డాడు. తాగుతున్న కాఫీ గొంతులో అడ్డుపడి ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"నీకేమన్నా మతుందా అసలు? చిన్నపిల్ల మీద ప్రయోగాలు చేస్తావా? " అరిచేశాడు. మామూలుగా అయితే అతను రాణీ పద్మిని అంటే చాలా భయపడతాడు. కానీ అతనికి హరిణి అంటే రక్తసంబంధం లేకపోయినా అభిమానం, ఆప్యాయత ఉన్నాయి. ఇప్పుడు హరిణి తమ ఇంట్లోనే ఉంటున్నాక ఆమె మీద కూతురు మీద ఉండే అనురాగం, వాత్సల్యం ఏర్పడ్డాయి.

"బాగానే మతి ఉంది. ఇది నేను తొలిసారిగా చేస్తున్న ట్రీట్‌మెంట్ కాదు. మనుషుల గుండెల్ని మొద్దుబార్చి సున్నితత్వం తగ్గించటానికి ఇదివరకు చాలామంది చేశారు" అంది రాణీపద్మిని నిర్లక్ష్యంగా.

"నువ్వు చూశావా? "

"కళ్ళతో చూడలేదు. కానీ విన్నాను. పుస్తకాల్లో చదివాను"

"ఏదో చెపుతారు. ఇంకేవో రాస్తారు. ఇట్లా ఎవరూ చెయ్యరు"

"ఇప్పుడే ఇలా అంటున్నారు. ముందు ముందు చెయ్యబోయేవి వింటే..." రాణీపద్మిని సగంలో ఆగిపోయింది.

"అవి ఇంకా భయంకరమైనవా? ' రామ్‌కుమార్ బెదిరిపోతూ అడిగాడు.

"విని మీరే చెప్పాలి" అంది రాణీ పద్మిని.

"ఏమిటో చెప్పు"

రాణీ పద్మిని చెప్పినవి విని రామ్‌కుమార్ కొయ్యబారిపోయాడు.

"వద్దు పద్మినీ. అట్లా చెయ్యకు. పాపం అసలే హరిణి బెదిరిపోయి ఉంది. ఇవన్నీ చేస్తే ఆమె గుండె చెదిరిపోతుంది."

"ఏమీ కాదు" తెగింపుగా చెప్పింది రాణీ పద్మిని.

"అంత రిస్క్ తీసుకోవటం మంచిది కాదు. ఏ అనర్థం జరుగుతుందో ఏమో. అసలే హార్ట్ ఆపరేషన్ అయిన మనిషి. ఆపైన తండ్రికి జరిగినవి. నువ్వు చేసే ఈ ఘోర, విపరీత ప్రయోగాలు తట్టుకోలేక ఆ చిన్న గుండె ఆగిపోతే? " ఆవేశంగా ప్రశ్నించాడు రామ్‌కుమార్.

"ఆగిపోతే పోనీండి" రాణీ పద్మిని లెక్కలేనట్లు చూస్తూ చెప్పింది.

"అంటే... మీ అన్నయ్యకిచ్చిన మాట తప్పుతావా? " రామ్‌కుమార్‌కి కోపం ఆగలేదు.

"ఆ మాట నిలబెట్టుకోవడం కోసమే ఈ ప్రయత్నాలూ, ప్రయోగాలూ. అన్నయ్య ఏమన్నాడు? హరిణి తనలా కాకూడదన్నాడు. దాని మనస్సు దృఢం అయేలా చేయమన్నాడు. దానికి తనలా సున్నితమైన మనస్సు ఉండటానికి వీల్లేదన్నాడు"

"ఈ ప్రయత్నంలో హరిణి గుండె తట్టుకోలేక షాక్ అయి చచ్చిపోతే? "

"పోతే పోనీండి. హరిణి ఉంటే గట్టిగా ఉండాలి. లేకపోతే చావనన్నా చావాలి. అంతేగానీ, బతికి ఉండి అన్నయ్యలా ప్రతి దానికీ బాధపడుతూ, చివరికి తన మంచితనంతో తన పీక తనే తెగ్గోసుకునే రకం కాకూడదు. అంతే" పద్మిని సమాధానం చెప్పింది.

రామ్‌కుమార్ ఏం మాట్లాడలేకపోయాడు. అయినా మనసు సరిపెట్టుకోలేకపోయాడు. అయిష్టంగా చూస్తున్నాడు.



"మీరంత బాధపడుతున్నారుగానీ ఇవన్నీ మీకు కొత్తా ఏమన్నానా? మీ పల్లెటూర్లో మీ పల్లెవాళ్లు చేసింది గుర్తు లేదూ?" అంది రాణీ పద్మిని.

రామ్‌కుమార్‌కి ఆ విషయం జ్ఞాపకం వచ్చింది. పెళ్ళయిన కొత్తలో ఒకసారి పల్లెకు వెళ్లారు. రామ్‌కుమార్‌ది జమీందారీ కుటుంబం. అతను చదువూ, వ్యాపారం అన్నీ హైదరాబాద్‌లోనే కావటం వల్ల పల్లెతో పెద్ద సంబంధాలు లేవు. ఒకరోజు సాయంత్రం ఇద్దరూ ఊళ్ళోకి షికారు వెళ్ళారు. అక్కడ ఒక గుడిసె దగ్గర ఒక స్త్రీ చిన్న పిల్లాడికి ఏదో ద్రవం తాగిస్తోంది. ఎర్రటి చిక్కటి ద్రవం చూసి రాణీ పద్మిని ఆగిపోయి, అదేంటని అడిగింది.

"పంది రక్తం, ఇందులోకి పట్టి తాగిస్తున్నాం" అంది ఆ స్త్రీ

"ఎందుకూ?" రాణీ పద్మిని అంతటి మనిషికీ ఆ విషయానికి ఆశ్చర్యం కలిగింది.

"ధైర్యం వస్తుందమ్మా. అందుకని" చెప్పింది ఆ స్త్రీ.

ఇప్పుడు ఆ విషయాన్నే గుర్తుచేసింది.

"సరే. నీ ఇష్టం. నేను చెప్పాల్సింది చెప్పాను" అని ఊరుకున్నాడు.

హరిణి గదిలోకి వెళ్ళింది పద్మిని. హరిణి కిటికీలోంచి బయటకు చూస్తూ ఏదో ఆలోచిస్తోంది. రాణీ పద్మిని రాకను గమనించ లేదు.

"హరిణీ. నా మీద కోపం ఉందా?" రాణీ పద్మిని అడిగింది.

హరిణి తల తిప్పి చూసింది.

"సారీ అత్తా. చూడలేదు" అంది

"అంతే కదా. నా మీద కోపం వచ్చిందేమోనని"

"నీమీద కోపమా? ఎందుకత్తా? ఎందుకు కోపం ఉంటుంది. నాకోసం నువ్వు బోలెడు కష్టపడుతున్నావు" అంది

హరిణి.

పద్మిని హరిణి రూమ్‌లో అటూ ఇటూ తిరుగుతూ బొమ్మల్నీ, వస్తువుల్నీ మళ్ళీ చక్కగా అమరుస్తోంది. హరిణి కాసేపుండి నోరు విప్పి, తన సందేహం అడిగింది.

"అత్తా, ఆ కోడిని తల్చుకుంటే బాధగా ఉంది" పద్మిని హరిణి వైపు సూటిగా చూసింది.

"బాధ ఎందుకే? దేని ఫేట్ దానిది. మనం బాధపడకూడదు. అన్నిటికీ బాధపడుతూ ఉంటే ఎప్పటికీ సుఖం ఉండదు. ఎవరి బాధ వాళ్ళది. ఎవరి కష్టాలు వాళ్ళవి. మనకి అనవసరం. మనం ఎవరి గురించీ కన్సర్న్ చూపించాల్సిన అవసరం లేదు. నీకు హార్ట్ ప్రాబ్లమ్ వచ్చింది. నీ బాధ నువ్వు పడ్డావు. నీ నెప్పి ఇంకెవరన్నా అనుభవించారా? లేదు. అలాగే ఎవడికి వచ్చినపుడు వాడు అనుభవిస్తాడు. మనం చూస్తూ ఊరుకోవాలి"

హరిణికి అర్థమైంది.

"ఓహో" అంది తల ఊపుతూ.

అంతే. ఈ లోకంలో చిన్న చేపను పెద్ద చేప తింటుంది. వీధి కుక్కను వేటకుక్క తరుముతుంది. బలహీనుడ్ని బలవంతుడు దోపిడీ

చేస్తాడు. నువ్వు సెన్సిటివ్‌గా ఉంటే, నీ సున్నిత హృదయాన్నీ మంచితనాన్నీ అసమర్థతగా జమకట్టి లోకం నిన్ను పూర్తిగా ఎక్స్‌ప్లాయిట్ చేసి ఊరుకుంటుంది. పెద్దయ్యాక నువ్వు ఇంక మారలేవు. అందుకే ఇది మంచి సమయం. నీ నేచర్ మార్చుకోంది నీకు ఫ్యూచర్‌లో మనశ్శాంతీ, ఆనందం ఉండవు. దేవుడు నీకు అన్నీ ఇచ్చాడు. హాయిగా ఉండు" రాణీపద్మిని బోధించింది.

హరిణికి ఆ బోధ మొత్తం తలకెక్కింది.

మర్నాడు మరో కోడి మెడ కోయించింది. రాణీ పద్మిని. ఇంకోరోజు మరో పిట్ట.

నాలుగైదు రోజులు గడిచేసరికి హరిణికి కోడిని కోస్తుంటే క్యాజువల్‌గా చూడటం అలవాటైపోయింది.

ఆ తర్వాత నెక్స్ట్ స్టెప్‌గా మరో అడుగు ముందుకేసింది పద్మిని.

ఈ సారి మేకను తెప్పించింది.

మేక కోడిలా కాదు కదా. దాన్ని లాక్కుని వస్తుంటే అది మొరాయించింది. రానని భీష్మించుకుని ఉండిపోదామని ప్రయత్నించింది. గింజుకుంటోంది. 'మే' 'మే' అని భయంకరంగా అరుస్తోంది. పారిపోదామని సర్వవిధాలా ప్రయత్నిస్తోంది. దాన్ని ఈడ్చుకుంటూ సిమెంట్ తిన్నె దగ్గరకి తెచ్చి పడేశారు. పారిపోకుండా గట్టిగా పట్టుకున్నారు. అది భయంకరంగా అరుస్తోంది.

పనివాడి చేతిలో వేటకత్తి ధగధగ మెరిసింది. ఒకటే వేటు. మేక తలతెగి కింద పడింది. హరిణి వణుకుతూ అత్త చేతిని గట్టిగా పట్టుకుంది. పద్మిని చెయ్యి ఆమె చేతిని ధృఢంగా పట్టుకుంది. హరిణికి ధైర్యం వచ్చింది.

కానీ మేక మొండెంవైపుగానీ, తెగిపడిన తలవైపుగానీ చూడలేకపోయింది.

పద్మిని కూడా ఆమెను బలవంత పెట్ట లేదు. స్టెప్ బై స్టెప్... వన్ బై వన్...

గరళం ఒకే ముద్దలో ఇస్తే చస్తారు. రోజూ కొంచెం కొంచెం కాలకూటం తినిపించి విషకన్యను తయారుచేస్తారుట. అలా మెల్లగా ఒక్కోటీ చూపించి, గుండెధైర్యం తెప్పించాలి అనుకుంది.

ఈ ట్రీట్‌మెంట్‌తో పాటుగా తను అడవి నుంచి తెచ్చిన మూలికలతో కూడా వైద్యం చేస్తూనే ఉంది రాణీపద్మిని. చేదుగా కాలకూటంలా ఉన్న ఆ మూలికల కషాయం తాగలేక హరిణి తల్లడిల్లిపోయేది.

"ఏమీ కాదు. తాగు" అలవాటైతే అంతా బాగానే ఉంటుంది." అని మందలించి తాగించేది రాణీపద్మిని.

తర్వాత మెట్టు మరీ భయంకరమైనది. మెదక్ దగ్గర ఒక ఊళ్ళో జాతర ఉంది.

ఆ జాతర గురించి రాణీపద్మినికి తెలుసు.

"నేనూ, హరిణీ మేదినీపురం జాతరకి వెళ్తున్నాం" అంది రాణీ పద్మిని రామ్‌కుమార్‌తో.

రామ్‌కుమార్ బిత్తరపోయాడు. ఒక క్షణం నోట మాట రాలేదు.

"నువ్వు ఒక్కదానివే వెళ్తే చాలదూ" అన్నాడు చివరికి.

"బాగుంది. అసలు వెళ్ళేదే హరిణి కోసం' ' అంది రాణీపద్మిని.

రామ్‌కుమార్ మొహంలో బాధా భయం స్పష్టంగా కనిపిస్తున్నాయి. "వద్దు, హరిణి భయపడుతుంది" అన్నాడు.

"నేను ట్రీట్‌మెంట్ మొదలు పెట్టినప్పుడు అలాగే అన్నారు. ఏమయింది. తట్టుకుందా, లేదా? ఇది ట్రీట్‌మెంట్‌లో ఫైనల్ స్టెప్."

రామ్‌కుమార్ కాసేపు సీలింగ్ వైపు చూస్తూ మౌనంగా ఉండిపోయాడు.

"సరే నీకు చెప్పలేను గానీ, కనీసం హరిణికి ఆ జాతర ఎలా ఉంటుందో చెప్పిమరీ తీసుకెళ్ళు" అన్నాడు.

పద్మిని మాట్లాడకుండా ఊరుకుంది కానీ, ఆమెకి కూడా అదే మంచిదనిపించింది.

జాతర గురించి హరిణికి చెప్పింది.

"వెళదామా మరి? " అడిగింది రాణీపద్మిని.

"నీ ఇష్టం అత్తా" అంది హరిణి.

"నా ఇష్టం కాదు నువ్వు ఇండిపెండెంట్‌గా ఆలోచించాలి" అంది రాణీపద్మిని.

"వెళ్దాం" అంది హరిణి.

అప్పటికే రాణీపద్మిని హరిణికి ఇండిపెండెంట్‌గా ఆలోచించటం గురించీ, స్వతంత్ర్యంగా వ్యవహరించటం గురించీ నేర్పి ఉంది.

బట్టలు కొనటానికి వెళ్ళినా, మొదట్లో హరిణికి సలహా ఇచ్చి 'అది తీసుకో' 'ఇది నీకు బాగుంటుంది' అనేది కానీ రాను రానూ, అది కూడా మానేసింది.

"హరిణికి తన బట్టలు తను స్వతంత్ర్యంగా ఎన్నిక చేసుకోవటం వచ్చింది. తనకేది కావల్సి వచ్చినా దాన్ని పొందటం, ఇష్టంలేనివి నిర్మొహమాటంగా తిరస్కరించటం కూడా నేర్పింది పద్మిని. కానీ ఎక్కడ ఎలా ఉన్నా అత్త దగ్గర మాత్రం హరిణి పాత హరిణిగానే ఉంటుంది. రాణీ పద్మిని అది కూడా వద్దంటుంది.

"అత్త, మామయ్య, ఆఖరికి డాడీ అయినా సరే, కాంప్రమైజ్ కాకూడదు. మనకిష్టమైన పనులే మనం చేయాలి." అని బోధిస్తుంది.

టి.వి.లో బుల్‌ఫైట్స్ చూపించింది.

అడవిలో జంతువులు ఒకదాన్నొకటి ఎలా చంపుకుంటాయో కూడా ఆ ప్రోగ్రాంలు వచ్చినప్పుడల్లా చూపిస్తుంది. జంతువుల్ని ఎంతెంత హింసలు పెట్టి, ఏమేం చేస్తే మనకి బ్యాగ్‌లూ, చెప్పులూ, సెంట్లూ లభిస్తాయో వివరంగా తెలిపింది.

అవన్నీ శాంతిప్రియులూ, అహింసావాదులూ, జంతువుల్ని ప్రేమించమనీ, ఆదరించమనీ, జీవహింస మానమనీ అడుగుతూ చెపుతారు. కానీ రాణీపద్మిని వాటిని మరోలా వాడుకుంది.

"ప్రపంచంలో ఎంత హింస జరుగుతోంది. మనం దేన్నని కంట్రోల్ చెయ్యగలం? చైనాలో బతికున్న పిల్లికి చర్మం వలిచి అప్పుడు చంపి తింటారుట, ఫ్రెష్‌గా ఉంటుందని. కుందేళ్ళనూ, పాముల్నీ కూడా అలాగే చేస్తారుట. మన చుట్టూ ప్రపంచంలో బోలెడంత క్రూరత్వం ఉంది. అన్నిటిగురించీ తెలుసుకుంటే ఒకేసారి షాక్ అయి పిచ్చి పడుతుంది". అని చెప్పింది.

టి.వి.లో ప్రోగ్రాంలు, రాణీ పద్మిని తెప్పించి ప్రదర్శించే స్నైల్ టైప్ ఇంగ్లీష్ సినిమా క్యాసెట్లు, మాగజైన్లలో వ్యాసాలూ అన్నీ హరిణి గుండెని బండగా మార్చేశాయి. రాణీ పద్మిని దృష్టిలో ఆ జాతరకి వెళ్ళటం అంటే ఆ గుండె బండా కాదా అని తేల్చుకునే పరీక్ష.

కార్లో బయల్దేరి ఆ జాతరకి వెళ్ళారు. రామ్‌కుమార్‌ని కూడా రమ్మంటే, రాలేనని తప్పించుకున్నాడు.

కావాలనే కాస్త ఆలస్యంగా బయల్దేరింది రాణీ పద్మిని.

ఆ ఊళ్ళో గ్రామ దేవతని కొలిచే జాతర అది. దూరానికే బోలెడంత దుమ్ము లేస్తూ హడావిడిగా కోలాహలంగా ఉంది. కాస్త దూరంలో కారు ఆపి ముందుకి నడిచారు.

అమ్మవారి విగ్రహం భయంకరంగా ఉంది. అందరూ మొక్కులు చెల్లించుకుంటు న్నారు. జాతర అంతా రక్తం. రక్తపు వాసన. కోళ్ళు తెచ్చి సమర్పిస్తున్నారు. కోళ్ళ మెడ కోసి, తలల్ని మాలలాగా కట్టారు.

మేకల్నీ, గొర్రెల్నీ కూడా బలి ఇస్తు న్నారు. ఒక పెద్దకత్తి, పదునుగా ఉన్న ఆ కత్తి తళతళా మెరుస్తోంది. ఆ కత్తితో ఒక్క వేటుతో ఆ జంతువుల్ని బలి ఇస్తున్నారు. వాటిని ఒకే వేటులో నరకాలిట. లేకపోతే అవి బలికి పనికి రావుట. ఆ నరికే అతను చాలా నిపుణుడిలా ఉన్నాడు. చకచక ఒకే వేటుతో నరికిపారేస్తున్నాడు.

జంతుబలి నిషేధం అని అక్కడ గనక అంటే జనం చితకబాదుతారు.

యథేచ్ఛగా, స్వేచ్ఛగా జంతుబలి సాగి పోతూ ఉంది.

హరిణికి పెద్దగా భయం అనిపించలేదు. రోజూ, కోడినో, మేకనో, గొర్రెనో కోస్తుంటే చూస్తూనే ఉంది. కాకపోతే ఇక్కడ లార్జ్ స్కేల్‌లో జరుగుతోంది. అంతే.

ఇంతలో హరిణి ఊహించని సంఘటన.

దాని గురించి రాణీ పద్మినికి కూడా తెలి యదు. కాబట్టి ఆమె ఆ విషయం హరిణికి చెప్పలేదు.

హఠాత్తుగా కేకలూ, అరుపులూ, డప్పుల చప్పుడూ వినిపించి అటు వైపు చూశారు ఇద్దరూ.

కొందరు మనుషులు పాడుతూ, కేకలు పెడుతూ వస్తున్నారు. వాళ్లు ఒక దున్నపో తుని లాక్కుని వస్తున్నారు. దాని మెడలో పూలమాల ఉంది. అది రానని మొరాయి స్తోంది. దాన్ని బలంగా ఈడ్చి, లాక్కుని వస్తున్నారు.

హరిణి, పద్మిని ఉన్న చోటికి దగ్గరగా వచ్చి ఆగారు.

అక్కడ ఒక పెద్ద గొయ్యి తవ్వి ఉంది. హరిణీ, పద్మినీ కూడా అప్రయత్నంగా అక్క డికి నడిచి వెళ్లారు. ఏం జరగబోతోందో ఊహించిన పద్మిని "అయినా ఇదీ మంచికే. అనుకున్న దానికన్నా ఎక్కువ ఎఫెక్ట్ ఉంటుంది" అనుకుంది.

హరిణి వైపు చూసింది. పెద్దగా భయం కనిపించలేదు.

జనం పాటలు పాడుతూ, చప్పట్లు కొడుతూ ఉన్నారు. డప్పుల చప్పుడు మిన్ను ముట్టింది. ఆ గోలలో దున్నపోతు అరు పులు ఎవరికీ వినబడటం కూడా లేదు.

తవ్వి ఉంచిన గోతిలోకి దున్నపోతుని ఒక్క తోపు తోశారు. అది భయంకరంగా అరుస్తూ దభీమని అందులో పడింది.

అక్కడ తళతళమని మెరుస్తున్న పదు నైన కత్తి పట్టుకుని ఒకతను నిల్చుని ఉన్నాడు. ఆ కత్తికి గజ్జెలు కట్టి ఉన్నాయి.

అతని చేతిలోని కత్తి ఒక్కసారిగా పైకి లేచింది. ఒక్కటే వ్రేటు.

ఒక్క వేటులో దున్నపోతు మెడ తెగి కింద పడింది. ఒక భయంకరమైన అరు పుతో ఆ దున్నపోతు తనువు చాలించింది.

కేకలూ, కేరింతలూ, డప్పూ, డోళ్ళ ధ్వనులు మిన్ను ముట్టాయి.

పద్మిని హరిణి చెయ్యి పట్టుకుని ముందుకి నడిచింది. ఇంకెక్కడా ఆగకుండా నేరుగా కారు పార్క్ చేసిన చోటుకి వెళ్లిపో యారు ఇద్దరూ.

రాణీ పద్మినికి నుదుట చిరు చెమటలు పట్టాయి. ఆమె కూడా ఇంత భయంకర దృశ్యం ఎన్నడూ చూసి ఉండలేదు. అంత కఠినాతి కఠినం అయిన ఆమెకి కూడా

ఒక్క క్షణం షాక్ తిన్నట్లు అయింది. తనకే ఇట్లా ఉంటే ఇంక హరిణి పరిస్థితి ఎలా ఉందోనని భయం వేసింది. హరిణిని తేకుండా ఉండాల్సిందేమోనని ఒక్క క్షణం అనుకుంది.

"హరిణీ... సారీరా... మరీ భయంకరంగా ఉంది కదూ? ఎలా ఉంది? షాక్ అయ్యావా? " అంది.

హరిణి నిశ్చలంగా చూసింది.

"సారీ ఎందుకత్తా? అయామ్ క్వైట్ ఓ.కే." అంది.

రాణీ పద్మినికి పట్టరాని ఆనందం కలిగింది.

అంటే... తనే చలించిపోయిన సంఘటన చూసి కూడా హరిణి చలించలేదన్న మాట. తను హరిణికి చేసిన బోధలూ, ఇచ్చిన ట్రెయినింగ్ అద్భుతంగా పని చేశాయనటానికి ఇంతకన్నా ఉదాహరణ లేదు.

హరిణి మొహాన్ని చేతుల్లోకి తీసుకుని ముద్దుల వర్షం కురిపించింది పద్మిని.

తను నీరు పోసి పోషించిన మొక్క జీవం పుంజుకుని చిగుర్లు వేస్తే ఆనందించినట్లు, నిశ్చలంగా ఉన్న హరిణి మొహాన్ని చూసి ఆనందించింది రాణీ పద్మిని.

ఎవరో తెలిసిన వాళ్ళు కన్పిస్తే మాట్లాడింది పద్మిని. వాళ్ళు వెళ్ళాక "అత్తా, వీళ్లు నీ ఫ్రెండ్సా" అడిగింది హరిణి.

"ఫ్రెండ్స్ అంటూ లోకంలో ఎవరూ ఉండరు. అప్పుడు డాడీ ప్రాబ్లమ్‌లో వీళ్లెవరైనా వచ్చి సాయం చేశారా? లేదు. ఇప్పుడు ఈ సంగతులేవీ తెలీనట్లు మాట్లాడుతున్నారు చూడు" అంది పద్మిని.

మరి అన్ని విషయాల్లో నిర్మొహమాటంగా, ఖచ్చితంగా ఉండే రాణీపద్మిని వీళ్లతో కుండబద్దలుకొట్టి తెగతెంపులు ఎందుకు చేసుకోలేదు?

"వాళ్లు సెల్ఫిష్ అని తెలిసీ ఎందుకు మాట్లాడావత్తా? " అడిగింది హరిణి.

"ఇది సెల్ఫిష్ ప్రపంచం హరిణీ. ఇక్కడ ఒకడి సంగతి మరొకడికి పట్టదు. ఎవడి కష్టాలు వాళ్లే పడాలి. ఇంకో విషయం. రాజకీయాల్లో పర్మనెంట్ ఫ్రెండ్స్ అంటూ ఎవరూ ఉండరు. అసలు ఫ్రెండ్స్ అనే ఉండరు. ఎవరితోనైనా అవసరం వచ్చినప్పుడు వాళ్లతో పొత్తుపెట్టుకుంటారు. ఇప్పుడు ప్రజాస్వామ్యం కాబట్టి ప్రజలే రాజులు. ప్రతివాడూ ఒక రాజు. అంటే ప్రతివాడూ ఒక పొలిటీషియన్. ప్రతి విషయంలోనూ పాలిటిక్స్, మనమంతా పొలిటీషియన్స్‌మే" పద్మిని నవ్వేసింది. ఇట్లు చేరారు.

అప్పుడు హరిణికి పన్నెండేళ్లు,

పుష్టిగా, అందంగా, చక్కటి అలంకరణలో చూడగానే ఎవరికన్నా ముద్దు వచ్చేట్లు చాలా చాలా బాగుండేది.

నారాయణపురం వాసి ఒకతను హరిణిని ఒకసారి షాపింగ్ సెంటర్ దగ్గర హరిణిని చూడటం తటస్థించింది. అది ఒక ఆకాశ సౌధం. ఇంద్రభవనంలా ఉంటుంది. అతను అటువైపుగా వెళ్తూ పల్లెనుంచి వచ్చాడు కాబట్టి అద్దాల బిల్డింగ్ బాగుంది కదా అని చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో విమానం లాంటి కారు నిగనిగ మెరుస్తూ రావటం, అందులోంచి హరిణి దిగటం జరిగింది. పద్మిని కారుని పార్కింగ్ కోసం సెల్లార్‌లోకి తీసుకెళ్లింది. హరిణి ఆమె కోసం ఎదురుచూస్తూ నిలబడింది.

హరిణి.... హరిణే కదూ? " ఆ నారాయణపురం మనిషి ఆనందం పట్టలేకపోయాడు. సన్నగా దుర్బలంగా ఉండి ప్రశాంతమైన కళ్లతో ఆదరంగా చూసే హరిణికీ, గులాబీరంగు బలమైన శరీరం, బుట్టబొమ్మ లాంటి గౌన్, కాళ్లకి ఖరీదైన షూస్, కత్తిరించిన జుట్టూ, అన్నిటికన్నా ముఖ్యంగా అహంకారం, పొగరూ మిళితమై నిర్లక్ష్యంగా లెఖ్ఖలేనట్లు చూస్తున్న ఈ హరిణికీ చాలా తేడా కనిపించింది.

"హరిణివేనా నువ్వు? బాగున్నావామ్మా? " అతను ఆప్యాయంగా పలకరిం

చాడు.

ఇంతలో హరిణి అతనిమీద పిడుగులవానలా విరుచుకుపడింది.

"హూ ఆర్యూ? ఎవడ్రా నువ్వు? ఎందుకు నాతో మాట్లాడాలని చూస్తున్నావ్? షటప్ అండ్ గెట్‌లాస్ట్"

హరిణి ఎంత కోపంగా మాట్లాడినా, చిన్నప్పటినుంచీ చూసిన వాడవటం చేతా, ఆ కుటుంబం అంటే ఉన్న మమకారం చేతా అతను ఏమీ అనలేకపోయాడు. బూరెల్లాంటి బుగ్గలూ, లక్కపిడత లాంటి నోరూ, అంత చిన్నపాప చిరుతపులిలా అలా అరిచేయటం చూసి అతనికి ముద్దు వచ్చింది కూడా.

హరిణి కాదా? బంగారు తల్లి హరిణి ఇంత ఘోరంగా అరవటమా?

"నువ్వు హరిణివేమో అనుకుని పొరపడ్డానమ్మా... నువ్వు హరిణివి కాదా? "

"షటప్. నేనెవర్నో నీకు అనవసరం"అరిచేసింది హరిణి.

ఇంతలో రాణీపద్మిని వచ్చి అతనివైపు కోపంగా చూసింది.

"ఏమిటి? పాపని ఒక్కదాన్నీ చేసి మాట్లాడుతున్నావ్? అసలు ఏంటి నీ ఉద్దేశం? " అంది కోపంగా అరుస్తూ.

అతను బిత్తరపోయాడు. అతనికి రాణీపద్మిని తెలుసు. ఆమెలో పెద్ద మార్పులేదు కాబట్టి బాగా గుర్తుపట్టగలిగాడు. పోనీ ఈ పాప హరిణి కాదేమో అనుకోటానికి కూడా లేకుండా అయింది. ఈ పాప ఖచ్చితంగా హరిణే.

"క్షమించడమ్మా. ఊరికే పలకరించబోయాను" అన్నాడు.

"ఏంటి ఊరికే పలకరించబోయేది? అయినా పలకరించేశావుగా. నీ పనైపోయింది. ఇక పో"

అతను ఇంకేం మాట్లాడకుండా వెనుతిరిగాడు. రాణీ పద్మిని హరిణిని ఇంత దారుణంగా ఎలా మార్చేయగలిగిందో అతనికి అర్థం కాలేదు.

అతనికే కాదు. హరిణిని అంతకుపూర్వం ఎరిగిన వాళ్ళందరికీ అదో పెద్ద పజిల్. విడిపోని గొప్ప మిస్టరీ. అలాటి అనుభవాలు ఇంకొందరికి జరిగాయి.

హరిణి సంగతి అందరికీ తెలిసిపోయింది. రాణీపద్మిని గురించి అంతకుముందే అందరికీ చాలా బాగా తెలుసు. ఆమె అంటేనే అందరికీ హడల్. పలకరించటం కాదుకదా, కనీసం అటువైపు చూడాలన్నా భయపడతారు.

శాపగ్రస్థులైన దేవతలు రాక్షసులైనట్లు, దేవకన్య లాంటి హరిణి రాక్షస బాలికగా మారిపోయిందా ఆశ్చర్యం వేసేది వాళ్ళకి.

మెల్లమెల్లగా హరిణి జ్ఞాపకాలు మరుగున పడిపోయాయి.

నారాయణపురంలో కృష్ణప్రసాద్ భవంతిని కాల్చి బూడిద చేశాక రాణీపద్మిని దాని మీద ఒక సమాధి నిర్మించింది. ఏడాదికొకసారి హరిణిని తీసుకుని అక్కడికి వెళ్తుంది.

ఎవరినీ పలకరించరు వాళ్ళు. ఎవరన్నా పలకరించబోయినా ఖస్సుబుస్సుమంటారు. అందుకే అంతా వాళ్ళని మాట్లాడించే ప్రయత్నం కూడా మానుకున్నారు.

"అత్తా. మనుషులు కూడా కావాలంటారు కదా. మనం అందర్నీ దూరం చేసుకుంటే— మనకి ఏదన్నా అవసరం వస్తే? "

"ఎవడితోనూ మనకి పనిలేదు. మనుషులు కావాలి అనుకోవటం దండగ. డబ్బుంటే చాలు కొండమీద కోతి దిగివస్తుంది. మీ నాన్నకి అంతమంది మనుషులుండేవాళ్ళు. ఎవరేం చేశారు? " అంది రాణీ పద్మిని.

"కానీ మరి నాన్నకి డబ్బు కూడా ఉందిగా? " హరిణి సందేహంగా చూసింది.

పద్మిని విరగబడి నవ్వింది.

"అదే. అలా సందేహాలు రావాలి. నాన్నకి డబ్బు ఉంది. కానీ మంచితనం ఉండటంతో అందరికీ తేలిక అయిపోయాడు. మనని చూడగానే అబ్బో వీళ్ళేం చేస్తారోనని జనం

హడలి చచ్చేట్లు ఉండాలి. వీడేం చేస్తాడులే, వీడి మొహం అని చులకనగా చూసేట్లు ఉండకూడదు. అవతల వాడిని మనం చావుదెబ్బ తీయగలగాలి. తీయకపోతే కనీసం అంత కెపాసిటీ ఉన్నట్లు యాక్షన్ అన్నా చెయ్యాలి. మనకి గూండా ఇమేజ్ ఉన్నా పర్వాలేదు గానీ, మంచి వాళ్ళన్న ఇమేజ్ ఉంటే మాత్రం మనని నొక్కేస్తారు. సినిమాల్లో చూపిస్తారు చూడు ఈజిప్ట్, రోమ్ రాణులు. వాళ్ళల్లా దర్పంగా, క్రూరంగా ఉండాలి."

హరిణికి వివరించి చెప్పింది రాణీపద్మిని.

హరిణికి ఎన్ని చెప్పినా రాణీపద్మిని మాత్రం చాలా అరుదుగానే అయినా, ఒక్కోసారి భూగృహంలో ఉన్న కృష్ణప్రసాద్ నిలువెత్తు లైఫ్‌సైజ్ ఫొటో ముందు నిలబడి ఏడ్చేస్తూ ఉండేది. అది కొన్నిసార్లు హరిణి కంట కూడా పడేది. ఆమె అత్త పక్కన చేరి ఓదార్చటానికి ప్రయత్నించేది. కానీ తట్టుకోలేక తను కూడా భోరుమని విలపించేది. కాస్సేపయ్యాక ఇద్దరూ తమకు తామే తెప్పరిల్లేవాళ్ళు. ఏడుపూ, విలాపం మనిషి మనసుని సున్నితం చేయాలి. కానీ చిత్రంగా, ఏడ్చిన కొద్దీ వాళ్ళ గుండె మరింత బండబారేది. తమ కన్నీరు సీసంలా మారి, గుండెని పోతపోస్తున్నదా అని వాళ్ళకే అనిపించేంత గట్టిగా మారేది ఆ గుండె. వాళ్ళ అహం అప్పుడు మరింత దెబ్బతిని, దెబ్బతిన్న పులుల్లా తమకి ఈ కన్నీరు ప్రసాదించిన లోకాన్నీ, మనుషుల్నీ క్షమించలేకపోయేవాళ్ళు. మరింత కఠినంగా మారిపోయేవాళ్ళు.

రాణీపద్మినికి కూడా జంతుప్రేమ ఉంది. కానీ కేవలం క్రూర జంతువులంటేనే ఆమెకి ప్రేమ. ఇంట్లో చిరుతపులి బొమ్మలూ, సింహం విగ్రహాలూ ఉండేవి. అసలు ఒక చిరుతపులిని పెంచుకుని, రోమన్ రాణుల్లా దాన్ని వెంట తిప్పుకుంటూ తిరగాలనే ప్రగాఢ వాంఛ ఆమెకి ఉంది. అనుమతీ, అవకాశం దొరకదని ఊరుకుంది కానీ, లేకపోతే ఇంట్లో తప్పకుండా చిరుతపులుల్నీ పెంచేదే.

ఎవరికీ తెలియకుండా, కనీసం ఒక కొండ చిలువనన్నా పెంచుకోవాలని అనుకుంటోంది ఆమె. భయంకరమైన కుక్కలంటే ఆమెకి మోజు. ఆ ఇంట్లో దెయ్యాల్లాంటి కుక్కలు హాయిగా తిరిగేస్తూ ఉంటాయి.

హరిణి పూర్తిగా అత్తని ప్రతిబింబిస్తుంది కాబట్టి ఆమెవి కూడా అవే అభిప్రాయాలు.

మనుషులంటే ద్వేషంతో, దేవుడి మీద కోపంతో అందరికీ దూరమయ్యి, డబ్బుకీ కుక్కలకీ మాత్రమే దగ్గరయి జీవిస్తున్నారు వాళ్ళు.

హరిణిని దత్తత తీసుకోవాలన్న రాణీ పద్మిని కోరికకి రామ్‌కుమార్ ఎదురు చెప్పలేదు.

హరిణి అంటే అతనికి పుత్రికా వాత్సల్యం ఎలాగూ ఉండనే ఉంది. ఇంక రాణీ పద్మినికి ఎవరితోనూ సరిపడదు. ఎవరూ ఆమె భావాలకి తగ్గట్లు మారలేరు. ఆమె ఎవర్నీ ఇష్టపడదు. హరిణి తన సొంత అన్నయ్య కూతురు కాబట్టి ఆమెకి ఇష్టం అయింది. తండ్రిని పోగొట్టుకుంది. ఆమెకి ఎవరూ లేరు కాబట్టి రాణీపద్మిని ప్రేమ రెట్టింపు అయింది. రాణీ పద్మిని ఎవరినీ ప్రేమించటం కాదు సరికదా కనీసం సహించటం కూడా చేతకాదు అందువల్ల దత్తత అనేది ఎన్నటికీ జరగదని అనుకుంటున్న అతనికి హరిణిని దత్తత తీసుకోవటం సంతోషం అనిపించింది.

దత్తత స్వీకారాన్ని రిజిష్టర్ చేయించింది రాణీపద్మిని. అప్పుడే ఆమెకి ఒక బ్రహ్మాండమైన ఐడియా కూడా వచ్చింది.

"మనం మామూలు మనుషులం కాదు. మనం విశిష్ట వ్యక్తులం. అలాగే మన పేర్లు కూడా మామూలుగా ఉండకూడదు. సామాన్యులకి ఉన్నట్లే మనపేర్లు కూడా హరిణి-రాగిణి అని ఉంటే మనకీ వాళ్లకీ తేడా

## చిల్లితొట్టికి మాటువేయించరా ఏంటి?



"ఓ తొట్టికి రంధ్రం ఉంది. అందులో నుంచి గంటకు 5 గ్యాలన్ల నీరు కారిపోతోంది. గంటకు తొమ్మిది గ్యాలన్ల నీటి నిచ్చే పంపుతో ఆ తొట్టిలోకి నీరువదిలితే ఎంతసేపటిలో అది నిండుతుంది..? చేసి చూపించండ్రా!" కుర్రాళ్లకు లెక్కలు చెబుతు న్నారు మునిమాణిక్యం.

అక్కడే ఉన్న వాళ్ల ఆవిడ "ఇవేం లెక్క లండీ నా మొహం.. చిల్లి తొట్టిలో నీళ్లుపో స్తుంటే ఓ చెంపకారిపోయేవి కారిపోతుంటే పైనుంచి మరో పంపుతో దాన్ని నింపాలని చూడడం ఏంటండీ.. వెర్రికాకపోతే. దానికి మాటోపాడో వేసుకుని నింపు కోవచ్చు గదండీ.." అని కడి గిపారేసిందట.

ఏముంది?
మన పేర్లు కూడా అద్భుతంగా ఉండాలి" అంది.

"ఇంతకీ ఏం చెప్పదల్చుకున్నావు? " రామ్‌కుమార్ అడిగాడు.

"హరిణి పేరుకి అర్థం చూడండి. లేడి పిల్ల అని. లేడిపిల్ల ఏంటి లేడిపిల్ల? ఏ సింహం పిల్ల అనో, చిరుతపులి అనో ఉంటే బాగుంటుంది," అంది రాణీ పద్మిని.

"పేరు మార్చేస్తావా? " అడిగాడు రామ్‌కుమార్. "అవును, హరిణి పేరు నాకు నచ్చలేదు. లేడి పిల్ల అంటే బలహీనంగా, దెబ్బతినేదిగా ఉంది. మార్చి షెర్నీ అని పెట్టేస్తున్నాను. అసలు ఇన్నాళ్లూ ఈ ఆలోచన ఎందుకు రాలేదా అనిపిస్తోంది" అంది రాణీ పద్మిని.

"షెర్నీ అంటే..."

"షెర్నీ అంటే ఆడసింహం."

హరిణిని దగ్గరకు లాక్కుని ముద్దుల వర్షం కురిపించింది రాణీ పద్మిని.

"నా తల్లి, నా బంగారు తల్లి, నా కన్నతల్లి పేరు షెర్నీ... షెర్నీ..."

"బాగుంది. షెర్నీ...." రామ్‌కుమార్ కూడా నవ్వుతూ పిలిచాడు.

దత్తత కార్యక్రమం జరిగిపోయింది.

షెర్నీ అన్ని విధాలా... ఆఖరుకు పేరులో కూడా రాణీ పద్మిని ఆశయాలకు తగ్గట్లు మారిపోయింది.

★ ★ ★

విజయ్ హరిణి కథ ముగించి, పవన్ వైపు చూశాడు.

పవన్ శిలలా నిశ్చలంగా నిలబడి ఉన్నాడు. రెప్పవేయటం కూడా మర్చిపోయి బొమ్మలా నిల్చుని ఉన్నాడు. అతను పూర్తిగా నిర్ఘాంతపోయి ఉన్నాడు.

"పవన్... పవన్" తట్టి కదిపాడు విజయ్.

"ఊ" పవన్ మెల్లగా నీరసంగా అన్నాడు.

"ఎలా ఉంది? "

"హారర్ మూవీ చూసినట్లుంది."

"నేనడిగింది హరిణి కథ గురించి కాదు. నీ ఒంట్లో ఎలా ఉందని అడుగుతున్నాను."

"నేను బాగానే ఉన్నాను."

"పద. కాస్త కాఫీ తాగుదాం." పార్క్‌లో ఉన్న రెస్టారెంట్ వైపు దారి తీశాడు విజయ్.

ఇద్దరూ ఒకే టేబుల్ దగ్గర సెటిల్ అయ్యారు.



మంచినీళ్లు తాగించాడు విజయ్. తాను ఒక గ్లాస్ తీసుకుని తాగాడు. టీ ఆర్డర్ చేశాడు.

కాసేపు ఏం మాట్లాడకుండా ఊరుకున్నాడు. "పవన్" మృదువుగా పిలిచాడు.

"ఏమిటి? "

" ఈ కథంతా విన్నాక నాకు మతిపోయినట్లు అయింది. ఎప్పుడెప్పుడు ఈ కథ చెబుతానా అని ఒకటే బాధ. చెపితే మళ్లీ నువ్వేమైపోతావని భయం. పవన్, నాకూ బాధగానే ఉంది. కానీ ఏం చేస్తాం చెప్పు. నువ్వు షెర్నీని మర్చిపోవడం మంచిది" మెల్లగా చెప్పాడు విజయ్.

పవన్ చివ్వున తలెత్తి చూశాడు. అతని కళ్లు తీవ్రంగా ఉన్నాయి.

"మర్చిపోవాలా? ఎందుకని? "

"వన్‌వే ట్రాఫిక్ అవుతుంది కాబట్టి" అన్నాడు విజయ్.

పవన్ సూటిగా చూశాడు.

"విజయ్. నాది నిశ్చలమైన ప్రేమ. నిజాయితీ అయిన ప్రేమ. అది టూవే కావాలనీ, షెర్నీ కూడా నన్ను అర్జెంట్‌గా ప్రేమించేసి పెళ్లాడేయాలనీ నాకు లేదు. నేను సైలెంట్‌గా ఆమెని ప్రేమిస్తూనే ఉంటాను. కాకపోతే నాకు ఎప్పుడూ ఆశ్చర్యంగానే అనిపించేది, షెర్నీని ఎందుకు ప్రేమిస్తున్నానా అని. నాకు పైపై మెరుగులూ, అందాలూ, ఐశ్వర్యాలూ అంటే ఎన్నడూ మోజు లేదు. మరి షెర్నీని ఎందుకు ప్రేమించినట్లు? అందరిలాగే నేనూ ఆమె అందాన్ని చూసి ఆకర్షితుడినయ్యానా అని నన్ను చూస్తే నాకే ఆశ్చర్యం కలిగేది. కానీ ఇప్పుడు అర్థమైంది. షెర్నీలో ఏం చూశానో నాకర్థమైంది." ఆవేశంగా చెప్పాడు పవన్.

"ఏం చూశావు? " ఆశ్చర్యపోతూ అడిగాడు విజయ్.

"చెపుతాను. విజయ్. నీకు గుర్తుందా,

ఒకసారి మన ఫ్రెండ్ రఘు వాళ్ల ఇల్లు మంచిది కాదేమోనని సందేహం వచ్చి ఒక మంత్రవేత్త దగ్గరకి వెళ్లానని చెప్పాడు చూడు..." అడిగాడు పవన్.

"ఇపుడు ఆ టాపిక్ దేనికీ? " అర్థం కాక అడిగాడు విజయ్.

"ఎందుకు చెపుతాను కానీ, గుర్తుందా, ఆ మంత్రవేత్త ఏం చెప్పాడో? "

విజయ్ గుర్తు చేసుకున్నాడు. రఘు వాళ్ళు ఆ ఇంట్లో చేరాక కొన్ని కష్టాలు వచ్చాయి. రఘు తండ్రి యాక్సిడెంట్ అయింది. రఘు అన్నయ్య, పరీక్ష తప్పాడు. అందుకని ఇంట్లో ఏదన్నా దుష్టశక్తి గానీ ఉందేమోనని ఊళ్లో ఒక మంత్రవేత్తను సంప్రదించారు.

"మీ ఇంట్లో ఏ దుష్ట శక్తి లేదు." అన్నాడాయన రఘు తండ్రి వైపు చూస్తూ.

"స్వామీ. తమరు ఒక్కసారి దయచేసి మా ఇంటికి వచ్చి చూడండి" అన్నాడు రఘు తండ్రి.

" అక్కర్లేదు. ఏ దుష్టశక్తీ లేదంటే, నా మాట నమ్మరేం? అట్లాంటివేమన్నా ఉంటే అవి నీతో వెనకే వస్తాయి. నీ మొహంలో వాటి ఛాయ కనబడుతుంది." అని చెప్పాడు ఆయన.

విజయ్ ఆ సంగతి గుర్తు చేసుకున్నాడు. పవన్ తను ఎందుకు ఆ విషయం ప్రస్తావించాడో చెప్పాడు.

"విజయ్. నాకు ఆ దుష్టశక్తులంటే నమ్మకం లేదు. ఆ విషయం ఎందుకు గుర్తు చేశానంటే ఆయన అన్నాడు చూడు, ఆ శక్తి తాలూకు ఛాయలు వీళ్ళ మొహంలో ప్రతిబింబిస్తాయని, ఆ విషయం నాకు తెలీదుగానీ, మనిషిలోని మంచితనం సహృదయత ఛాయలు మాత్రం మనిషి మొహంలో కనబడకుండా పోవని నాకనిపిస్తోంది. హరిణి కృష్ణప్రసాద్ కూతురు. చిన్నప్పుడు చేసిన మంచి పనులూ, ఆ మంచితనపు ఛాయలూ ఆ మొహంలో ఏ మూలనో ఇంకా ప్రతిబింబిస్తూనే ఉన్నాయి. ఆ మంచితనపు ఛాయలే నన్ను ఆమె పట్ల ఆకర్షితుడినయేట్లు చేశాయి" అన్నాడు పవన్

"నేను షెర్నీని ప్రేమిస్తున్నాను. ఆమె ప్రేమ పొందటానికి నా చివరి రక్తం బొట్టు వరకూ ప్రయత్నిస్తాను" బాంబు పేల్చినట్లు చెప్పాడు పవన్.

విజయ్ అదిరిపడ్డాడు.

"వద్దు పవన్... ఊరుకో. దాన్ని మర్చిపో. అది మనిషి కాదు రాక్షసి. దెయ్యం. పిశాచంలా మారిపోయిన మనిషి. నువ్వు దాన్ని నీ మార్గంలోకి తీసుకెళ్ళలేవు సరికదా అది నీ రక్తం తాగే పిశాచం అవుతుంది. నీ చివరి రక్తం బొట్టుని కూడా పీల్చేస్తుంది. వద్దు పవన్ వద్దు" విజయ్ పవన్ గడ్డం పట్టుకుని బతిమాలాడు.

"నా ప్రేమ స్వచ్ఛమైంది. నా ప్రేమలో నిజాయితీ ఉంది. నా ప్రేమ మీద నాకు నమ్మకం ఉంది. భగవంతుడు నా ప్రేమని తప్పకుండా ఆశీర్వదిస్తాడన్న విశ్వాసం నాకుంది" అన్నాడు పవన్.

విజయ్ నిస్సహాయంగా పవన్‌వైపు చూస్తూ ఉండిపోయాడు. ప్రేమలో ఉన్న మజానో, మహమ్మారో మరేమిటోగానీ, ప్రేమికులంతా ఇలాగే అనుకుంటారు ఇలా అనుకునే లైలాని మజ్నూ, సలీంని అనార్కలీ, దేవదాసుని పార్వతీ ప్రేమించారు. వాళ్ళ ప్రేమ ఎక్కడ సఫలమైంది? భగవంతుడు వాళ్ల ప్రేమని ఎందుకు ఆశీర్వదించలేదు? దీపం ఎంతో అందమైంది. మెరుస్తూ, వెలుగులు చిమ్ముతూ ఆకర్షిస్తుంది. దీపం పురుగు దాన్ని ముట్టుకుందామని ప్రయత్నించి, మాడి మసైపోతుంది. ప్రేమికులు కూడా అంతే. ఎందుకొచ్చిన ప్రేమలు? ఫలించవని తెలిసీ ఎందుకీ ప్రయత్నాలు? అయ్యో దేవుడా. ఈ భయంకరమైన షెర్నీ, క్రూర షెర్నీ ప్రేమలో పడి పవన్ పళ్ళచక్రంలో నలిగిపోయినట్లు నలిగిపోడు కదా?

విజయ్ కళ్ళముందు ఏవేవో దృశ్యాలు కనిపిస్తున్నాయి. షేర్నీ ఒక సింహాన్ని పట్టుకుని పవన్ మీదికి బల్లెం విసురుతున్నట్లు, వేటకుక్కల్ని వెంట బెట్టుకుని వచ్చి పవన్ మీదికి ఉసికొల్పుతున్నట్లు ఏవేవో ఊహించుకుని కంపించిపోయాడు విజయ్.

"ఏమిటి అంత వణికిపోతూ ఆలోచిస్తున్నావు? "

అడిగాడు పవన్ విజయ్ భుజం తట్టుతూ.

"నువ్వు జోక్‌గా అంటున్నావేమోగానీ, నాకైతే నిజంగానే వణుకుపుడుతోంది. నిన్ను ప్రేమించేట్లు చేసుకుంటానన్నావు. ఎలా చేసుకుంటావు? అసలు నీతో మాట్లాడుతుందా? చూస్తేనే భగ్గుభగ్గుమంటుంది. అది నిన్ను ప్రేమించేట్లు ఎలా చేసుకుంటావు? "

పవన్ సీరియస్‌గా చూశాడు.

"చూడు. లేడీస్‌కి రెస్పెక్ట్ ఇవ్వాలి. అదీ ఇదీ అని మాట్లాడకు"

"నేను ఎంతగా రెస్పెక్ట్ ఇస్తానో నీకు తెలీదా? నువ్వు ఆమె ప్రేమలో పడి ఏమైపోతావోనని భయంకొద్దీ అన్నాను అంతే."

"ఫర్వాలేదులే. నేను మాత్రం ఆరోజు అనలేదూ? అది దెయ్యం అని."

"కోపంతో అప్పటికప్పుడు ఏదో అంటాం. అంతేగానీ పర్మనెంట్ ద్వేషం కాదుగా"

"అంతే"

విజయ్ మళ్ళీ కాసేపు ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు.

పవన్ ప్రేమ ఫలించాలి. ఫలించాలి అని దేవుడ్ని ప్రార్థించుకుంటూ ఉండిపోయాడు.

★ ★ ★

పవన్ గార్డెన్లో కూర్చుని లాన్‌వైపు చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. షేర్నీ అతని కళ్ళముందు డాన్స్ చేస్తోంది. షేర్నీని మర్చిపోవటం అసాధ్యం అని అతనికి తెలుసు కాబట్టే ఆమె ప్రేమ పొందాలని ప్రయత్నిస్తున్నాడు. కానీ అది మరింత అసాధ్యం అత్యంత దుర్లభం అని అతనికి తెలుసు. కానీ అసలు మనసు అనేదే ఒక విచిత్రమైనది. ఆ మనసు ఇక ప్రేమలోగానీ పడిందంటే ఇంకా విచిత్రమైనదవుతుంది. ప్రేమించే మనసు ఎవరినీ, దేనినీ లెఖ్ఖ చెయ్యదు. దానికి భయమంటే తెలియదు. ఆచారాలూ, రీతులూ, రివాజులూ దానికసలు లెఖ్ఖ ఉండవు. స్వేచ్ఛగా, స్వచ్ఛంగా ఎగిరే విహంగంలా అనంత దూరాలకు, పైపైకి హాయిగా వెళ్ళి విహరిస్తుంది.



ప్రేమించిన వాడెవ్వడూ పిరికివాడు కాదు. పిరికితనాన్ని సుదూర తీరాలకు పారద్రోలేది ప్రేమ. ధైర్యాన్నీ సాహసాన్నీ గుండెనిండా నింపేది ప్రేమ. అందుకే ప్రేమించిన వాడు ఎంతకైనా తెగిస్తాడు. దేన్నికైనా సాహసిస్తాడు.

పవన్ గార్డెన్లో కూర్చుని ఆలోచిస్తున్నాడు. తనకు షేర్నీ ప్రేమను తప్పకుండా పొందగలనన్న దృఢనమ్మకం ఎట్లా ఏర్పడింది? ఆలోచిస్తే అతనికే ఆశ్చర్యం వేసింది. ప్రేమ అంత దృఢనమ్మకాన్ని ఇవ్వ

ఒక శాతం ప్రేరణను తొంబై తొమ్మిది శాతం శ్రమను ప్రతిభ అంటారు.

– రోస్‌పాల్

గలిగింది. అద్భుతాలు చేయించగలిగేది ప్రేమ. అపురూపమైనది ప్రేమ.గుండెల నిండా గాలి పీల్చి వదిలాడు.

లాన్‌మీద నిలిచిన అతని కళ్లు ఒక్కసారిగా పెద్దవయ్యాయి. లాన్ మీద లేత గులాబీ రంగు పాదాలు వేగంగా నడుస్తూ ఇటే వస్తు న్నాయి. వాటికున్న హైహీల్స్ షూస్ ఇంత అందమైన పాదాల్ని పట్టేసిన అదృష్టం మాదే సుమా అన్నట్లు టక్కు టిక్కుమని చప్పుడు చేస్తున్నాయి.

షెర్నీ... షెర్నీ.

అతని కళ్లు పాదాల మీద నుంచి పైకి వెళ్లాయి. లేత గులాబీరంగు పాదాలు... ఆపైన నున్నటి కాళ్లు. ఆపైన ఎర్రరంగు మిడ్డీ .. దాని మీద నల్లటి షర్ట్.. ఆపైన శంఖం లాంటి మెడ.. అందమైన మొహం.. ఆ మొహంలో కఠినత్వం దాగిన కళ్లు.

షెర్నీ కళ్లు ఒక్క క్షణంపాటు పవన్ కళ్లతో కలిశాయి.

పవన్ మొహంలో చిరునవ్వు. షెర్నీని ఆప్యాయంగా, ప్రేమగా, అపురూపంగా చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

"హాయ్ షెర్నీ" అన్నాడు.

షెర్నీ తిరిగి హాయ్ చెప్పలేదు. నీ లెఖ్ఖేంటి అన్నట్లు చూసి వెళ్లిపోతోంది.

"హలో హరిణీ" అన్నాడు.

అంతే

బ్రహ్మాండం బద్దలైనట్లు...

ఒక ఉరుములాంటి స్వరం... "నాపేరు హరిణి కాదన్నానుగా. హౌ డేర్ యు ఆర్ టు కాల్ మి హరిణి ఎగైన్" అరిచేసింది షెర్నీ.

"థాంక్ గాడ్" అన్నాడు పవన్ తేలిగ్గా నవ్వేస్తూ.

"ఎందుకూ? " షెర్నీ క్షణకాలం ఆశ్చర్య పోతూ అరిచేసి, అంతలోనే మళ్లీ మొహం బింకంగా మార్చుకుంది.

"అయినా నీ పేరు షెర్నీగా ఎందుకు మార్చుకున్నావు? ఏం బాగాలేదు. హరిణి అంటే చాలా బాగుంది" అన్నాడు పవన్.

షెర్నీ నిప్పులు కక్కుతున్న మొహంతో చూసింది.

"అదంతా నీకనవసరం. నీకింకా బుద్ధి రాలేదా? " అంది.

"బుద్ధా? దేనికీ? ఎందుకు రావాలి? "

"మా ఇంటికి వచ్చినప్పుడు కుక్కలు అరుస్తే పరుగెట్టావు చూడు... మా కుక్కల్ని చూసే అంత భయపడ్డావు. ఇంక మనుషుల్ని చూసి ఎంత భయపడాలో ఆలోచించు."

"ఏం చేస్తారు? "

"నా దగ్గర పిస్టల్ ఉంది. నాకు లైసెన్స్ కూడా ఉంది. షూట్ చేసి పారేస్తాను."

"ఓ.కే. అయినా నీ కుక్కలు నాకు బుద్ధి చెప్పాయని నీకు ఎలా తెలుసు?

షెర్నీ విరగబడి నవ్వింది. మొట్టమొదటి సారిగా షెర్నీ నవ్వు చూస్తున్నాడు పవన్. ఆ నవ్వులో మృదుత్వం లేదు. కానీ ఇప్పుడు క్రూరత్వం కూడా లేదు. అదో మాదిరి వెటకారం... ఆనందం.

"నవ్వుతుంటే నువ్వు చాలా బాగున్నావు. హాయిగా నవ్వుతూ ఉండరాదూ? ఆ కోపం, ఆ క్రూరంగా చూడటం అవన్నీ ఏంటి? "

"షటప్. నీ హద్దులు దాటకు" అంది షెర్నీ.

"ఓ.కే. ఓ.కే." చిన్నగా నవ్వుతూ అన్నాడు పవన్.

"ఇంతకీ మీ కుక్కలు నాకు బుద్ధి చెప్పా యని ఎలా అనుకున్నావు? " అడిగాడు ఆస క్తిగా చూస్తూ.

"సింపుల్. నీ షర్ట్ మా నిక్కీ నోట్లో చిక్కింది కదా. దాన్ని అలాగే వదిలి గోడ దూకి పారిపోయావు."

షెర్నీకి ఆ దృశ్యం తల్చుకుని కాబోలు నవ్వు ఆగటం లేదు. విరగబడి నవ్వుతూ ఉండిపో యింది.

షెర్నీ నవ్వుతుంటే ఒళ్లు కదిలిపోయి,

ఇతరులకు మంచి చేయడం అన్నది కర్తవ్యం కాదు. మంచి చేయడం అన్నది మీ ఆరోగ్యాన్ని ఆనందాన్ని పెంపొందించి సుఖాన్ని ఇస్తుంది. – జూరాస్టర్

అందాలు ఉయ్యాల బల్ల ఊగినట్లు ఊగుతున్నాయి. ఎర్రటి పెదిమలు విడివడి తెల్లటి ముత్యాల్లాంటి పళ్లు మెరుస్తూ, కెంపుల మధ్య కూర్చిన రవ్వల్లా కనిపిస్తున్నాయి.

పవన్ సర్వం మరిచిపోయి షేర్నీనే చూస్తూ ఉండిపోయాడు.

నవ్వుతున్న షేర్నీ హఠాత్తుగా చాలా సీరియస్‌గా మారిపోయింది.

"ఏంటి అలా చూస్తున్నావు? " అంది కోపంగా.

"అందంగా ఉంటే చూడటం తప్పా? "

"తప్పే. మానర్‌లెస్ గూస్" తిట్టింది షేర్నీ.

"నువ్వు నన్ను చూడొచ్చు కానీ నేను నిన్ను చూడకూడదా? " అడిగాడు పవన్.

షేర్నీ ఒక నిమిషం ఆశ్చర్యపోయింది.

"షిట్. నేను నిన్ను చూశానా? " అంది.

"ముందు ఆ పదాన్ని విత్‌డ్రా చేసుకో. నువ్వు నన్ను గమనిస్తుంటావనీ, నన్ను చూస్తూ ఉంటావనీ నేను రుజువు చెయ్యగలను" అన్నాడు పవన్.

షేర్నీ నిర్లక్ష్యంగా తల ఎగరేసింది.

"డోంటాక్ రబ్బిష్" అంది.

"లేదు. ప్రూవ్ చెయ్యమంటావా? ఛాలెంజ్ ? "

"ఓ.కే. ఛాలెంజ్. ఏ వెధవనీ చూడాల్సిన అవసరం నాకు లేదు" కేర్‌లెస్‌గా సమాధానం చెప్పింది షేర్నీ.

"అదే అనవసరం ధీమా. వెధవల్ని చూడవేమో గానీ నన్ను చూశావు. ఓ.కే. ప్రూవ్ చేస్తాను చూడు. నన్ను చూడకుండా, నన్ను గమనించకుండా మీ నిక్కీ నోట్లో చిక్కిన షర్ట్ నాదేనని ఎలా చెప్పగలిగావు? అంటే నా షర్ట్‌లు నీకు గుర్తేనన్నమాట" అన్నాడు పవన్.

షేర్నీ పని కుడితిలో పడ్డ ఎలకలా అయింది. ఏం చెప్పాలో తెలీక గుటకలు మింగుతోంది. ఇంత వరకూ షేర్నీకి అవతల వాళ్లతో జులుంచేసి మాట్లాడటమేగానీ ఇలా సమాధానం చెప్పాల్సిన అవసరం రాలేదు. నీతో నాకేంటి అని అరచి క్షణంలో అక్కణ్నుంచి వాకౌట్ చేయవచ్చు. కానీ అలా చెయ్యటం పిరికితనం అవుతుందనిపించింది. పిరికితనం అంటే షేర్నీకి పరమ అసహ్యం.

"నీ షర్ట్ గుర్తించినంత మాత్రాన నిన్ను చూస్తూ కూర్చుండిపోయినట్లు కాదు. ఆఫ్టరాల్. నీకెన్ని షర్ట్‌లున్నాయి? రెండో మూడో... అంతేకదూ? వేసుకున్నవే మళ్లీ మళ్లీ వేసుకొస్తావు. గుర్తుండక ఏమవుతాయి? " అంది తేలిగ్గా.

పవన్ విరగబడి నవ్వాడు.

"కిందపడ్డా గెలుపు నాదే అన్నాడట వెనకటికి ఎవడో. ఒక్క షర్టే రోజూ వేసుకొచ్చినా గుర్తుండాలని రూలేం లేదు" అన్నాడు.

"మరి? అసలేంటి నీ ఉద్దేశం? " షేర్నీకి కోపం ఆగటంలేదు.

"ఏం లేదు. నీకు నేనంటే ఏదో చెప్పలేని ఇది ఉండవచ్చు నీకూ తెలీదు. నీ మనసు తలుపులు తెరిచి చూసుకో. సమాధానం నీకే తెలుస్తుంది" అన్నాడు పవన్.

"అసలు నీలాటివాడితో మాట్లాడకూడదు" అనేసి, గిరుక్కున వెనక్కు తిరిగింది షేర్నీ.

వెనుకనుంచి పవన్ విరగబడి నవ్వటం షేర్నీకి వినిపిస్తూనే ఉంది.

వెనక్కు తిరిగింది.

పవన్ నవ్వుతూ చెయ్యి ఊపాడు.

"ఇడియట్" పళ్లు నూరింది.

గొప్ప కాంప్లిమెంట్ రిసీవ్ చేసుకున్నట్లు నవ్వుతూ మళ్లీ చెయ్యి ఊపాడు పవన్.

కోపంగా చూస్తూ, గబగబా నడుస్తూ వెళ్లిపోయింది షేర్నీ.

షేర్నీ బర్త్‌డేని నోట్ చేసుకున్నాడు పవన్.

ఆ మర్నాడే షేర్నీ బర్త్‌డే.

షేర్నీ ఎంత గ్రాండ్‌గా సెలబ్రేట్ చేసుకుంటుందో అనుకున్నారు అంతా. పవనే కాదు. షేర్నీని ప్రేమిస్తున్నవాళ్లూ, ఆమె అంటే ఆసక్తి ఉన్న అమ్మాయిలూ అందరూ షేర్నీ బర్త్‌డేని గుర్తుపెట్టుకున్నారు.

మామూలు రోజుల్లోనే అదరగొట్టేట్లు డ్రెస్ చేసుకొచ్చే షెర్నీ ఆ రోజు ఇంకెట్లా వస్తుందోనని అంతా ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు.

ఆరోజు రానే వచ్చింది.

షెర్నీ కారు ఆగింది.

పవన్ కళ్లు అప్రయత్నంగానే షెర్నీవైపు చూశాయి. నల్లటి పువ్వులున్న ఆకుపచ్చ స్కర్ట్, అదేమాదిరి బ్లౌజ్, కాళ్లకి నల్లటి షూస్.... షెర్నీకి ఉన్న అత్యంత సాధారణమైన డ్రెస్సుల్లో అది ఒకటి.

పవన్ ఆశ్చర్యపోయాడు.

షెర్నీ బర్త్‌డే సెలబ్రేట్ చేసుకోదా?

ఒకవేళ సాయంత్రం ఏదన్నా పెద్ద హోటల్లో చేసుకుంటుందేమో?

షెర్నీతో కాస్త చనువుగా మాట్లాడే నిఖిల షెర్నీని పలకరించింది.

"హాయ్... హ్యాపీ బర్త్‌డే" అంది.

షెర్నీ ఆశ్చర్యపోయింది. మరుక్షణం సర్దుకుంది.

"నీకెలా తెలుసు? " అంది.

"క్యాజుయల్‌గా రికార్డ్స్‌లో చూశాను. చాలామందికి తెలుసు ఇవాళ నీ బర్త్‌డే అని. అవునూ. కొత్త డ్రెస్ వేసుకుని రాలేదేం? సాయంత్రం వేసుకుంటావా? " నిఖిల అడిగింది.

"కొత్త డ్రెస్ ఎందుకు వేసుకోవాలి"? ప్రశ్నించింది షెర్నీ.

"ఎందుకంటే... బర్త్‌డే కాబట్టి"

"బర్త్‌డే అయితే? అది కూడా సంవత్సరంలో అన్ని రోజుల్లాంటిదే. మనిషన్నాక పుడతాడు... పెరుగుతాడు. చస్తాడు. అన్నీ ఒకటొకటే జరిగిపోతాయి. ఈ మాత్రం దానికి బర్త్‌డే అనీ మరొకటనీ సెలబ్రేషన్ దేనికీ? " అంది షెర్నీ.

అంతా నిర్ఘాంతపోయారు.

పవన్ కూడా విన్నాడు. షెర్నీ ఫిలాసఫీకి నవ్వు వచ్చింది అతనికి.

ఆ తర్వాత అంతా క్లాస్‌కి వెళ్లారు.

ఆరోజు ఫస్ట్ పీరియడ్ కాన్సిల్ అయింది. కొంతమంది క్యాంటీన్‌కీ, మరికొంతమంది బయట తిరిగిరావటానికీ వెళ్లారు. నిఖిల షెర్నీని రమ్మంటే షెర్నీ యథాప్రకారం రానంది.

షెర్నీ కాలేజ్ బిల్డింగ్ బయటికి వచ్చింది. వెనక ఉన్న తోటలవైపు నడవటం మొదలుపెట్టింది. కాస్త వెనగ్గా తోటల మధ్యన చిన్న చెరువు ఉంది. ఆ చెరువు ఒడ్డున కూర్చోవటం షెర్నీకి అలవాటే.

పవన్ షెర్నీని అనుసరించాడు. ఎందుకో తెలీదు. షెర్నీని ఏడిపించాలనిపించింది.

ఒంటరిగా వెళ్తే, షెర్నీ అక్కడ ఒంటరిగా ఉంటుంది కాబట్టి తనని ఫాలో అయ్యాడని చిరాకు పడి ఏమన్నా గొడవ చేస్తుందేమోనని అతను ఊహించగలిగాడు, కానీ ఎందుకో ఆమెని టీజ్ చెయ్యాలనిపించింది.

షెర్నీ గబగబా అడుగులు వేస్తూ సాగిపోతోంది. పాములా వేగంగా వెళ్లిపోతోంది. ఆమెకి తెలియకుండా ఆమెని అనుసరిస్తున్నాడు పవన్.

షెర్నీ కొలను గట్టుకి చేరింది.

గట్టుమీద కూర్చుంది.

కొలనులో నీళ్లని చూస్తోంది. చెట్టు చాటున దాగిన పవన్ ఆమెని చూస్తున్నాడు. షెర్నీ రూపు స్పష్టంగా కనిపిస్తోంది.

షెర్నీ హఠాత్తుగా వంగి బ్యాగ్‌లోంచి ఏదో తీస్తోంది.

తను చాటునుంచీ గమనిస్తున్నాడని తెలిసి పిస్టల్ తీసి పేల్చేయదు కదా? పవన్‌కి అనుమానం వచ్చింది.

షెర్నీ బ్యాగ్‌లోంచి కర్చీఫ్ తీసింది. ఒకసారి మొహాన్ని తుడుచుకుంది. కళ్లల్లోంచి జలజలా నీరు ప్రవహిస్తోంది. షెర్నీ కర్చీఫ్‌తో తుడుచుకుంటోంది.

పవన్ నివ్వెరపోయాడు.

షెర్నీ కళ్లల్లో నీళ్లు ఉన్నాయి.

షెర్నీ బాధపడుతోంది. అదీ బర్త్‌డే నాడు. సంతోషంగా సెలబ్రేట్ చేసుకోవలసిన బర్త్‌డే నాడు.

ఎందుకో అతను ఊహించగలడు.

ఒక్క క్షణం అతను తనని తాను నిగ్రహించుకోలేక పోయాడు. ముందుకు పరుగెట్టి షెర్నీ భుజాల్ని తట్టి, "బాధపడకు" అని గుండెకి హత్తుకొని ఓదార్చాలనిపించింది. షెర్నీ మీద అతనికి ఉన్న ప్రేమ అతన్ని ముందుకు నెడుతోంది.

కానీ మరుక్షణంలో అతని వివేకం అతడిని హెచ్చరించింది. తనుగనుక ఆ పని చేస్తే ఏం జరుగుతుందో అతను ఊహించగలడు. షెర్నీకి తన పట్టుదల, తన దర్పం, తన అహం తను మూసుకుని బతుకుతున్న ఇనుపతెరా ఇవే పంచప్రాణాలు. తను ఏడుస్తున్న దృశ్యం ఇంకొకళ్ళ కంటపడితే సహించే ఓర్పు ఆమెకి లేదు. తీవ్రంగా దెబ్బతిన్న ఆమె అహం ఆమె మనసుని గాయపరుస్తుంది. దెబ్బతిన్న పులిలా మారుతుంది. పిస్టల్ తీసి, తనని తాను కాల్చుకుని చచ్చినా ఆశ్చర్యం లేదు.

షెర్నీలో మార్పు రావాలి కానీ ఎలాగ? ఆమె ప్రవృత్తి ప్రవర్తన సహజసిద్ధంగా అలవడినవి అయితే ఎలాగో ఒకలాగా బుద్ధులు చెప్పి ఆమెని సరిఅయిన మార్గంలో ప్రవేశపెట్టవచ్చు కానీ జీవితంలో దెబ్బతిని, ఆ దెబ్బలు నేర్పిన పాఠాలతో కఠినంగా మారిపోయిన షెర్నీని ఎలా మార్చాలి? ఏ విధంగా పరివర్తన తెప్పించాలి?

షెర్నీ ఏడుస్తోంది.

అతను ఉండబట్టలేకపోతున్నాడు. షెర్నీ భుజం చుట్టూ చేయివేసి, ఆమె వీపు నిమిరి ఓదార్చాలనీ, ఆమె తలని తన గుండెల్లో పొదువుకుని "నా బుజ్జి కదూ. ఏడవకు ప్లీజ్" అని బుజ్జగించాలనీ, షెర్నీని పసిపాపలా లాలించాలనీ అతనికి గాఢంగా అనిపించింది. బలమైన ఆ కోర్కెని బలవంతంగా నొక్కిపట్టి, ఒక్కసారి గాఢంగా నిట్టూర్చి, వెనక్కి తిరిగాడు.

★ ★ ★

కాలం గిర్రున తిరిగిపోతోంది.

పవన్ చదువు మాత్రం అశ్రద్ధ చేయకుండా చదువుతూనే ఉన్నాడు. మనసు తిరిగి తిరిగి షెర్నీ చుట్టూనే తిరుగుతోంది. ఎంతగా బుద్ధి చెప్పినా వినదు. బలవంతాన దాన్ని చదువు మీదికి లాక్కెళ్ళి చదువుతున్నాడు.

షెర్నీతో మాట్లాడాలనీ, స్నేహం పెంచుకోవాలనీ ఎంతో ప్రయత్నించాడు. పాషాణంలాంటి షెర్నీ మాత్రం అణువైనా చలించలేదు. నాలుగు సంవత్సరాల సుదీర్ఘ కాలంలో షెర్నీని ఏమాత్రం కదిలించలేని పవన్ నిరాశగా నిస్సహాయంగా మిగిలిపోయాడు.

చదువు పూర్తయిపోయింది.

షెర్నీని చూసే భాగ్యం కూడా ఉండదు.

షెర్నీ అమెరికా వెళ్ళిపోవటానికి ప్రయత్నాలూ చేసుకుంటోంది. వాళ్లతోపాటు చదివిన మరికొందరు కూడా ఆ ప్రయత్నంలోనే పడ్డారు.

షెర్నీ అమెరికా వెళ్ళిపోతుంది.

ఇక తనను షెర్నీని చూడలేడు.

పవన్‌కి పిచ్చెక్కినట్లు అవుతోంది.

ఏం చేయాలి?

శ్రీకాంత్ కూడా అమెరికా వెళ్లటానికి ఏర్పాట్లు చేసుకుంటున్నాడు.

దిక్కు తోచనట్లు తిరుగుతున్న పవన్‌కి శ్రీకాంత్ మాటలు కొత్త దిక్కును చూపించాయి.

"బ్యాంక్ లోన్ దొరుకుతుంది. ట్రై చెయ్యి" అన్నాడు.

"దానికి గ్యారంటీ అడుగుతారు. ఏం చూపించాలి? " అన్నాడు పవన్.

"ఆ ఏర్పాట్లు నేను చూస్తాను" అన్నాడు శ్రీకాంత్. తనకు తెలిసిన వాళ్ళతో షూరిటీ

## నేనిస్తారా దారి



భార్యాభర్తలిద్దరికీ ఎందుకో గొడవైంది. పరస్పరం మాట్లాడుకోవడం మానేశారు. ఓరోజున భార్య ఇరుకైన వారింటి మేడమెట్లు దిగుతోంది. అవసలే ఇరుకు. ఒక్కరు వెళ్లడానికే వీలవుతుంది. అదేసమయంలో భర్త పైకివస్తున్నాడు. ఒకర్నొకరు మొదటే చూసుకున్నారు. అయినా ఎదుటివాళ్లు తప్పుకుంటార్లెమ్మని ఎవరికివాళ్లు మనసులో అనుకుంటూ సగంలో ఎదురయ్యారు. తొలగిపోవడానికి వీల్లేని పరిస్థితుల్లో ఒకరికొకరు అభిముఖంగా నిలబడ్డారు. కొన్నిక్షణాలు చూసి భార్య 'దారివ్వండి' అంది విసుగ్గా.

'మూర్ఖులకి దారిచ్చే అలవాటు నాకులేదు' అన్నాడు భర్త బింకంగా. ఆవిడ మాత్రం 'అది నాకలవాటే లెండి' అంటూ వెనక్కు తిరిగింది. గర్వంగా మీసం దువ్వుకోబోయిన ఆయనకు ఆవిడమాటలోని ఆంతర్యం చురుక్కుమంది.

ఇప్పించాడు.

ఆ రోజు పవన్ ఆనందానికి అంతులేదు. దేవుడెంత గొప్పవాడు. ఎంతెంతమంది మంచివాళ్లు ఈ లోకంలో ఉన్నారు.

ఇంకా అవసరమైన డబ్బుని ఫ్రెండ్స్ అంతా తలా కాస్తా సర్దుకుని ఇచ్చారు.

జ్ఞానానందంగారి కాళ్ళకి నమస్కరించి, తను అమెరికా వెళ్ళే ప్రయత్నం చేస్తున్న విషయం చెప్పాడు పవన్. విజయ్ అప్పటికే ఆయనతో పవన్ షెర్నీని ప్రేమిస్తున్న సంగతీ, ఆమెని మార్చాలని అనుకుంటున్న విషయం అన్నీ చెప్పేశాడు.

షెర్నీనే హరిణి అన్న విషయం తెలుసుకుని ఆయన చాలా బాధపడ్డారు.

"నీ ప్రయత్నాలన్నిటిలో విజయం లభిస్తుంది" ఆశీర్వదించారాయన.

పవన్ తల ఎత్తి ఆయన వైపు చూశాడు.

అంటే షెర్నీ తన ప్రేమ అంగీకరిస్తుంది?

పవన్ మనసులో ఆలోచనని ఆయన పసికట్టారు

"పవన్. హరిణిలాంటి మంచి మనిషి మారిపోకూడదు. మంచితనానికి నిర్వచనం అయిన మనుషులే మారిపోతే ఇక మంచితనానికి విలువ ఎక్కడ ఉంటుంది. ఒక మంచి మనిషి పదిమందికి ఉపకారం చెయ్యగలడు. ఆ మంచితనం వెలుగై ఎందరికో చీకటిని తొలగిస్తుంది. ఒక దీపం మరో దీపాన్ని వెలిగించినట్లు ఒక మంచి మనిషిని చూసి మరొక మనిషి మంచిగా తయారవుతాడు. అందువల్ల, ఒక మారిపోయిన మనిషిని తిరిగి మంచి మనిషిగా మార్చి, ఎంతో మంది మంచిగా మారటానికి స్ఫూర్తి అవుతావు. నీ ప్రయత్నం తప్పక ఫలిస్తుంది" అన్నారాయన

★ ★ ★

షెర్నీకి, పవన్‌కీ, శ్రీకాంత్‌కీ వీసాలు లభించాయి. ముగ్గురికీ ఒకే యూనివర్సిటీలో సీట్లు వచ్చాయి. ఫ్రెండ్సందరి దగ్గరా వీడ్కోలు తీసుకుని విమానం ఎక్కారు.

న్యూయార్క్ విమానాశ్రయంలో దిగి దిక్కులు చూస్తున్నారు పవన్, శ్రీకాంత్.



షెర్నీ కోసం అప్పటికే వాళ్ల బంధువులు వచ్చేసి ఉన్నారు. వాళ్ల ఆంటీ కాబోలు గభాల్న కౌగిలించేసుకుని ముద్దుల వర్షం కురిపించేసింది. ఆమె పక్కన ఒక పాతికేళ్ల యువకుడు నిల్చుని ఉన్నాడు. అమెరికాలో పుట్టి పెరగటంవల్ల కాబోలు అమెరికన్ యువకుడిలాగే కనిపిస్తున్నాడు.

"హాయ్" అన్నాడు షెర్నీని చూసి.

"హాయ్" అంది షెర్నీ నవ్వుతూ.

అతను కూడా షెర్నీని కౌగిలించేసుకుని ముద్దులు పెట్టేస్తాడేమోనని పవన్ భయపడ్డాడు. కానీ ఎందుకో అతను అంతపని మాత్రం చేయలేదు.

పవన్ వాళ్ల ఏజెంట్ తాలూకు మనిషి వచ్చాడు. పవన్‌ని గుర్తుపట్టి, వచ్చి ఇద్దర్నీ తన కారు దగ్గరికి తీసుకెళ్లాడు.

అమెరికాలో కార్లని బట్టి అంతస్థు బేరీజు వేస్తారని పవన్ (ఫ్రెండ్స్) చెప్పారు. షెర్నీ బంధువుల సంగతి కూడా ముందే చెప్పారు. ఆ బంధువుల సంగతి కూడా ముందే చెప్పారు. ఆ బంధువులకి ఇక్కడ షెర్నీకి బంజారాహిల్స్‌లో ఉన్న ఇంటికన్నా పెద్ద ఇల్లు ఉందిట. ఇంద్రభవనం లాంటి ఇల్లు. ఇంట్లో పెద్దతోట ఉందిట. అందులో ఆఖరికి గోంగూర, మామిడికాయ లాంటివి కూడా ఉన్నాయిట. వాళ్లకి ఇక్కడ ఏదో బిజినెస్ బోలెడన్ని లాభాలతో నడుస్తోందిట. కార్లూ, మేడలూ, కాసినోలూ, పిక్నిక్‌లూ వాళ్ల జీవితం అంతా అద్భుతాలమయం అని చెప్పారు.

"షెర్నీకి తగ్గ ఆంటీ బాస్. డాషింగ్, డేరింగ్ డైనమిక్ లేడీ" అన్నారు.

ఏజెంట్ తాలూకు మనిషి పవన్‌నీ, శ్రీకాంత్‌నీ, దాదాపు సత్రంలా ఉన్న చోటుకి చేర్చాడు.

★ ★ ★

కాలేజ్ మొదలైంది. రోజూ షెర్నీ

ఎదురు పడుతూనే ఉంది. కాస్త పొగరు తగ్గిందేమో కానీ షెర్నీ ఏమాత్రం మార లేదు. చదువుకోక తప్పదు, ఉద్యోగం చెయ్యక తప్పదు అనే బాధ లేదు షెర్నీకి. షెర్నీకి వరసకి బావ అయిన భాను అప్పు డప్పుడూ షెర్నీని కార్లో దింపుతూ ఉంటాడు.

పవన్ ఒక చిన్న పార్ట్‌టైమ్ ఉద్యోగం సంపాదించాడు.

కొందరు ఇండియన్స్‌తో పరిచయం చేసు కున్నాడు. రోజూ కాలేజ్‌కి వెళ్లిరావటం, సెలవు రోజుల్లో బట్టలు ఉతుక్కోవటం ఇతర పనులూ వీటితో తీరిక ఉండదు.

తీరిక ఉన్నా లేకున్నా మనసు మాత్రం తన పని తాను చేసుకుని పోతుంటుంది. అది ఆగదు. వాయువేగంతో షెర్నీని చేరు కుంటుంది. ఎన్నిసార్లు ఘాటుగా మందలిం చినా ఆ మనసుకి తెలీదు. అది షెర్నీ చుట్టూనే పరిభ్రమిస్తూ ఉంటుంది.

"ఎందుకీ పిచ్చి? ఆమె నిన్ను ప్రేమిం చదు. నీకూ ఆమెకూ మధ్యా పెద్ద అగాధం. ఎందుకు నీకీ వ్యర్థ ఘోష?" అని మనసుని మందలిస్తూనే ఉన్నాడు. ఎంతో ప్రయత్ని స్తున్నాడు. ఎన్ని చేస్తున్నా, ప్రతీక్షణం బిజీ గానే ఉంటున్నా షెర్నీ తలపులు మాత్రం ఆగవు.

"ఎందుకు నన్ను వారిస్తావు? అసలు షెర్నీని చూస్తే చాలు నాకు. ఆమెని రోజుకి ఒక్కసారి చూస్తే, ఆ దర్శనం మనసంతా నింపుకుని ఎంతో ఆనందంగా, హాయిగా గడిపేయగలను. ఇది జరుగుతుందని అను కున్నానా? ఇలా అమెరికా రాగలనని ఊహించనైనా ఊహించానా? వచ్చాను. షెర్నీని ఇంకొన్నాళ్లు చూడగలిగే భాగ్యాన్ని ప్రసాదించింది జీవితం. ఇది చాలు నా జన్మకి" అనుకుంటాడు.

షెర్నీని చూస్తే ప్రేమ ఆప్యాయత పొంగిపొర్లుతాయి. ఆమెని చూడగానే కొంటెనవ్వూ, చిలిపితనం అతని మొహం లోకి తన్నుకుని వస్తాయి. ఆ నవ్వు చూడ గానే షెర్నీకి ఒళ్లు మండుతుంది. ఈవ్ టీజింగ్ చేస్తున్న పనికిరాని వెధవలా ఆమె కళ్లకి కనిపిస్తాడు. మొహం ముటముటలా డిస్తుంది. అది చూసి మరీ నవ్వు వస్తుంది పవన్‌కి. తనలో ఇంత కొంటెదనం, చిలిపి దనం ఉన్నాయని ఆమెని చూసేంతవరకు అతనికి తెలియదు.

ఒంటరితనం, ఏకాంతం అతనికి తెలుసు. అవి ఎంత భయంకరమైనవో తెలుసు. అన్నీ ఉండి ఎవరూ లేని ఏకాకిగా బతికిన షెర్నీని చూస్తే అతనికి జాలి.

అమెరికా రావాలని ఎందరికో డ్రీమ్. దానికోసం ప్రయత్నించని విద్యార్థి ఉండడు. అందులో ఏ కొందరికో మాత్రమే దొరికే భాగ్యం అమెరికా రావటం. వచ్చినందుకు సద్వినియోగం చేసుకోవాలి. చదవాలి. చద వాలి.

బలవంతంగా ఏకాగ్రత తెచ్చుకుని చదువు తున్నాడు.

సాంబమూర్తి అని ఒక తెలుగాయన పార్టీ ఇస్తూ తనకు తెలిసిన వాళ్ళందరినీ పార్టీకి పిలిచాడు. ఆయన శ్రీకాంత్‌కి బంధువు. శ్రీకాంత్‌ని పిలవటానికి వచ్చి అతనితో పాటూ ఉన్న పవన్‌కి ఇంకో ఫ్రెండ్ మైత్రేయకీ కూడా ఇచ్చాడు. ముగ్గురూ కారిడార్లో నడుస్తున్నప్పుడు మైత్రేయ ఆ సంగతి ఎత్తాడు.

"నన్నెందుకు పిలిచాడు మధ్యలో. నేను ఆయనకి ఏం తెలుసనీ?" అనేశాడు మైత్రేయ. అతని మొహంలో ఏదో అను మానం.

"ఇలాంటి పిచ్చి అనుమానాలు మానుకో వాలి. ఏం? శ్రీకాంత్‌ని పిలవటానికి వచ్చి అలాగే పాపం మనమూ అక్కడ ఉన్నామని

సుఖదుఃఖాల పైన ఆధిపత్యం సంపాదించిన వ్యక్తే జీవితంలో విజయానికి చేరువవుతాడు. – విశ్వేశ్వరయ్య

మర్యాదకి పిలిచి ఉంటాడు. ఆయన పిలవ కపోతే అప్పుడు ఇదే నువ్వు 'అయ్యో నేను పక్కనే ఉన్నా నన్ను పిలవనే లేదు, నన్నెంత తీసిపారేశాడు, మర్యాదలేని మనిషి' అని బాధపడి ఉండేవాడివి. ఇప్పుడేమో ఇలా ఏడుస్తున్నావు. ఈ రోజుల్లో మంచితనానికి విలువే లేదు. రానురానూ మనిషి తోటి మనిషిని ప్రేమించటం పోయి అనుమానించటం జరుగుతోంది" అన్నాడు పవన్. మైత్రేయ ఏడుపుమొహం పెట్టాడు.

"వీడిదీ తప్పులేదులే. ఈ రోజుల్లో ఏం చేసినా తప్పే. మంచితనం పెద్దశాపం. మనం ఫైనల్ ఇయర్ చదువుతున్నప్పుడు ఏం జరిగిందో తెలుసా? మా రిలేటివ్ ఒకాయన చాలా మంచివాడు పాపం. ఒకసారి ఆయన ఇంటికి వస్తుంటే దార్లో ఎవరో యాక్సిడెంట్ అయి రక్తపు మడుగులో కనిపించాడు. ఎవరో యాక్సిడెంట్ చేసేసి పారిపోయారు. అతన్ని పట్టించుకున్నవాళ్ళే



లేరు. మా బంధువు అతన్ని తన కార్లో హాస్పటల్‌కి తీసుకెళ్ళి అడ్మిట్ చేసి, బోలెడు సాయం చేశాడు. ఇంతా చేస్తే ఆ పేషెంట్ తాలూకు వాళ్ళు వచ్చి నానా గొడవా చేశారు. ఎవరో యాక్సిడెంట్ చేస్తే నువ్వెందుకు చేర్పించుతావు? అని వేలు లాగారు. ఆ తర్వాత శ్రీకాంత్ ఏదో చెప్పబోయాడు.

"ఆ తర్వాత ఇక చచ్చినా ఎవరికీ సాయం చేసి ఉండడు. చస్తున్నా తీరిగ్గా చూస్తూ ఉండిపోతాడు గానీ తను ఇన్వాల్వ్ కాడు. ఈ లోకం ఇంతే. ఎవర్నీ మంచిగా బతకనివ్వడు." అన్నాడు మైత్రేయ.

"అంతే జరిగింది" అన్నాడు శ్రీకాంత్. "కానీ అదిమాత్రం కరెక్ట్ కాదు. కారు యాక్సిడెంట్ అయితే కారెక్కటం మానేస్తామా? ఎవరినో కరెంట్ షాక్ కొట్టిందని కరెంట్ వాడటం మానేస్తామా? మంచిపని చేయాలనుకుంటే కొన్ని చేదు అనుభవాలు కూడా ఎదురవుతాయి. అందుకని మంచి పనులు చేయటమే అసలు మానేస్తే ఇంక వాళ్ళు మంచివాళ్ళెలా అవుతారు? " అన్నాడు పవన్.

అడుగుల చప్పుడుకి వెనక్కి తిరిగి చూశాడు. షెర్నీ. అసలే పెద్దవైన కళ్ళను ఇంకాస్త పెద్దవి చేసి పవన్‌వైపే చూస్తోంది.

★ ★ ★

సాంబమూర్తి గారి పార్టీకి వెళ్ళారు పవన్, శ్రీకాంత్. అక్కడికి షెర్నీ కూడా వచ్చింది. మొట్టమొదటిసారిగా షెర్నీని చీరెలో చూశాడు పవన్. గులాబీరంగు జార్జెట్ చీరెకి జరీవర్క్ చేసి ఉంది. అదేరంగు జాకెట్టు. మెడలో ఎర్రరాళ్ళ నెక్లెస్, చెవులకి జూకాలు.

షెర్నీయేనా?

పవన్ ముగ్ధుడై చూశాడు. షెర్నీ మొహం ముటముటలాడించటం చూసి, తన తప్పు తెలుసుకుని, సర్దుకుని, అతి కష్టం మీద చూపులు మరల్చుకున్నాడు.

ఆ ఫంక్షన్‌లో షెర్నీ పాట కూడా పాడింది. "సింహం పాడుతుందా? " శ్రీకాంత్ గొణిగాడు. పవన్ నవ్వేశాడు. షెర్నీకి ఆ మాటలు వినబడినట్లున్నాయి. కోపంగా చూసింది.

★ ★ ★

అమెరికాలో కూడా అనేకరకాల లాట



రీలు. షేర్నీ ఒకసారి లాటరీ టిక్కెట్ కొనటంచూసి తనూ కొన్నాడు పవన్. అది చాలా చిన్న స్కీమ్.

గెలిచినవాళ్ళకి డిస్నీలాండ్ ఇంకా అలాటివే కొన్ని చూపించి తీసుకువస్తారు. మొదటి బహుమతి, రెండవ బహుమతి మాత్రం ఉన్నాయి. వాళ్ళిద్దర్నీ స్పెషల్‌గా చిన్న ప్లేన్‌లో తీసుకుని వెళ్తారుట. వాళ్ళు ఇండియన్స్‌కి, అందులో స్టూడెంట్స్‌కి మాత్రమే అమ్ముతున్నారు ఆ టిక్కెట్లు.

పవన్ ఎంతో గాఢంగా కోరుకునే కోరిక హరిణితో ఏకాంతంగా గడపాలని. అది తీరే కోరిక కాదని తెలుసు. అట్లాంటి అవకాశం తనని ఎన్నడూ రాదని తెలిసినా ఆశ అన్నది మనిషికి ఊపిరి కాబట్టి ఆశపడుతూనే ఉంటాడు.

ఆ కోపిక తీరిపోయే రోజు వచ్చింది. లాటరీలో హరిణి, పవన్ సెలెక్ట్ అయారు. పవన్‌కి అది కలా, నిజమా, తను వింటున్నది నిజమేనా అర్థం కాలేదు.

"షేర్నీ ఏదో టిక్కెట్ కొన్నది కానీ వస్తుందని నమ్మకం లేదు" అన్నాడు శ్రీకాంత్.

పవన్ గుండె గుభేల్‌మంది. హరిణి రావాలని వెయ్యి దేవుళ్ళకి మొక్కుకున్నాడు.

ఆరోజు విమానంలో హరిణీ, తనూ వెళ్తున్న సమయం. పవన్ జీవితంలో మర్చిపోలేని క్షణాలు అవి.

హరిణి ఏం పట్టించుకోకుండా తన లోకం తాను అన్నట్లే ఉంది. పవన్‌ని పలకరించను కూడా లేదు.

విమానం ఎగిరిపోతోంది. మేఘాల్లో తేలిపోతోంది పవన్ గుండె.

విమానం కింద దట్టమైన అడవిమీద నుంచి ఎగుర్తోంది.

"కింద సింహాలూ, పులులూ ఉంటాయా?" షేర్నీని పలకరించినట్లు అడి

గాడు పవన్.

షెర్నీ ఒకసారి కోపంగా చూసింది.

"అహ. నీ పేరు షెర్నీ అని సింహం గురించి అడగలేదు. పోన్లే టాపిక్ మార్చే స్తాను. నీకు విమానం నడపటం వచ్చా?" అడిగాడు పవన్.

షెర్నీ కోపంగా చూసి ఏదో అనబో యింది. ఇంతలో కాక్‌పిట్ తలుపు తెరుచు కుని ఒకతను గభాల్న వచ్చేశాడు.

"మీకు విమానంలోంచి దూకటం వచ్చా? పారాషూట్స్ ఉన్నాయి" అన్నాడు ఆయాస పడుతూ.

"ఇదేంటి. జోకా?" అన్నాడు పవన్.

"నీ మొహం. ఏదో కొంపలు మునిగినట్లు న్నాయి. ఆయన మొహం చూడు" అంది హరిణి.

అతను పూర్తి టెన్షన్ నిండిన మొహంతో సంగతి చెప్పాడు. విమానంలో బాంబు పెట్టారుట. పేలిపోతుందిట. అందుకే పవన్, హరిణీ పారాచూట్లతో కిందికి దిగి పోతే తాము తమవాళ్లకి వెంటనే హెలికా ప్టర్ పంపమని చెప్పి తామూ దిగిపోతా రుట.

"రిస్క్ తీసుకోవటం ప్రమాదం. వెంటనే దిగిపోవాలి" అన్నాడతను.

విమానం తక్కువ ఎత్తుకి దిగటం మొద లుపెట్టింది. అతను పారాషూట్స్ అందించి వాటిని ఎలా వాడాలో కూడా వివరించాడు.

"ఎందుకిలా జరిగింది?" అడిగింది హరిణి.

"బీస్ట్ గ్రూప్ వాళ్లు పెట్టారు. వాళ్లకి ఏషి యన్స్ అంటే పడదు. ఎవరో ఆసియా వాసి వల్ల వాళ్ల గ్రూప్‌కి చాలా నష్టం వచ్చిందిట" అన్నాడతను.

"ఇంత తాపీగా ఉంటే కుదరదు. క్విక్. మీరు దూకాక మేమూ దూకాలి" అన్నాడ తను అసహనంగా చూస్తూ.

పవన్, హరిణీ పారాచూట్ల సాయంతో కిందికి దూకారు.

నేలమీదికి దిగగానే ముందుగా పవన్‌చే సిన పని "హరిణీ" అని బిగ్గరగా అరవటం

రెస్పాన్స్ రాలేదు.

మళ్లీ మళ్లీ అరిచాడు.

"హరిణీ. హరిణీ. అయ్యో, ఏమైపోయావ్ హరిణి" అతని పిలుపులో అడవి దద్దరిల్లిపో యింది.

"అయ్యో. హరిణి సేఫ్‌గా లేదా?"

ఇంతలో చిరాగ్గా ఒక గొంతు.

"ఎందుకలా గొంతు చించుకుని అరు స్తావ్?" అతను ఆనందం పట్టలేకపో యాడు. హరిణి. హరిణి క్షేమమే అన్న మాట.

"హరిణీ. ఆర్యూ సేఫ్?" మళ్లీ బిగ్గరగా అరిచాడు.

"షెర్నీ హియర్" అన్న గొంతు ఆడ సింహం గర్జించినట్లు వినబడింది.

"ఓ. అయామ్ సారీ. పొరపాటయింది. ఒ.కే. షెర్నీ. ఎక్కడున్నావ్?" మళ్లీ బిగ్గ రగా అరిచాడు.

"ఇక్కడ. అయినా నేనెక్కడుంటే నీకుం దుకు?" చిరాగ్గా అరిచింది షెర్నీ.

"చింత చచ్చినా పులుపు చావలేదనీ..." అన్నాడు అటు పరుగెత్తి షెర్నీని చేరు కుంటూ.

"నీ బోడి సామెతలు నాకర్థంకావు. అయినా నాతో నీకేంపని? నీదారి నీది, నాదారి నాది" అంది షెర్నీ.

క్షేమంగానే లాండ్ అయినట్లుంది. అడ విలో చిక్కుపోయానన్న బెదురూ, దిగులూ ఏమీలేవు షెర్నీ మొహంలో. ఏమాత్రం బెరుకూ, భయం లేవు. బెట్టుగా భేషజం ఒలికిస్తూ ఎప్పటి షెర్నీలాగానే ఉంది.

"ఓహో. సారీ. నేనేదో మామూలు అమ్మాయితో మాట్లాడుతున్నాననుకున్నాను.

మనం గతాన్ని మార్చలేము - కానీ భవిష్యత్తుకు సంబంధించిన దిగులు బంగారం లాంటి మన వర్తమానాన్ని పాడుచేస్తుంది. - పార్కర్

షెర్నీ కదూ" అన్నాడు.

"అవును. నువ్వేదో పెద్ద మొగాడిలా నాకు అండగా సాయం చేయబోతున్నట్లు పోజ్‌లు కొట్టక్కర్లేదు. నీ దారిన నువ్వుపో. గెట్‌లాస్ట్".

"ఇది అడవి. పులులూ, సింహాలూ, పాములూ" పవన్ బెదిరించాడు.

షెర్నీ కోపంగా చూసింది.

"ఏవీ నన్ను భయపెట్టలేవు. ఉంటే ఉంటాం. చస్తే చస్తాం" షెర్నీ గబగబా అడుగులువేసుకుంటూ పోతోంది.

దట్టమైన ఆకుపచ్చటి వృక్షాలూ, లతలూ, ఆకాశానికి ఆకుపచ్చటి పందిరి వేసినట్లు ఉంది. ఏవేవో జంతువులు పరుగెడుతున్నాయి. తప్పకుండా ఏదో ఒకటి ఎటాక్ చేసి తీరుతుందనిపించింది పవన్‌కి.

"ఓ.కె. నీకు భయంలేదులే. కానీ, ఒంటరిగా నడవటానికి నాకు భయంగా ఉంది. ప్లీజ్. నేను ఇక్కడ్నించి బయటపడిందాకా నీతోనే ఉంటాను. ప్లీజ్... కాదనకు" అన్నాడు ప్రార్థిస్తూ...

"ఓ.కే. నో ఆబ్జెక్షన్" అంది షెర్నీ.

"చాలు. చాలు ఆ అభయం చాలు. నభయం భయం నభయం, అభయం" అంటూ పాడాడు పవన్.

షెర్నీ బ్యాగ్ తెరిచి చూసింది. సెల్‌ఫోన్ పనిచేస్తుందేమోనని ప్రయత్నించింది. పడిపోయినప్పుడు ఆ ప్రాసెస్‌లో సెల్ పాడయిపోయినట్లుంది.

"మనకిక్కడ ఏ దిక్కూ లేదు. ఎప్పుడో రెస్క్యూ టీమ్ వాళ్ళు వచ్చి రక్షించాలి. అంతే' అన్నాడు పవన్.

"షిట్" అంది షెర్నీ

"షిట్ అన్నా, మై ఫుట్ అన్నా, మన పొజిషన్ మాత్రం ఇది. ఇంతే సంగతులు" అన్నాడు పవన్.

ఇద్దరూ నడిచి నడిచి అలసిపోయారు. పవన్ ఒక చెట్టు కింద కూర్చుండిపోయాడు. ఏమనుకుందో ఏమో, షెర్నీ కూడా ఆగి నిలబడింది. "నువ్విక్కడే ఉండు. నేనిప్పుడే వస్తా" అంటూ లేచాడు పవన్.

"ఎక్కడికీ" అంది హరిణి.

"అన్నీ చెప్పాలా? టాయిలెట్‌కి".

"హు" అని అటు తిరిగి నిలబడింది షెర్నీ. ఎక్కడో సింహం గర్జించిన చప్పుడు... మళ్ళీమళ్ళీ

షెర్నీ ఉలిక్కిపడింది.

'అంతలోనే సర్దుకుని నిర్లక్ష్యంగా నిలబడింది. "అయ్యా బాబోయ్- సింహంలా ఉంది. ఎలాగ? " పవన్ పరుగెత్తుకుంటూ వచ్చాడు.

షెర్నీ నిర్లక్ష్యంగా చూస్తోంది.

"దా. పారిపోదాం పదా" అన్నాడు పవన్ వగరుస్తూ.

"వెధవ్వేషాలు ఆపు" అంది షెర్నీ

"అవేంటీ? " పవన్ అర్థం కానట్లు చూశాడు.

"సింహంలా గర్జించింది నువ్వేననీ, నీకు వెంట్రిలాక్విజం మిమిక్రీ లాంటి కళలు వచ్చనీ నాకర్థమైపోయింది. వేషాలు ఆపి మామూలుగా ప్రవర్తించు. నన్నేదో టీజ్ చేద్దామని చూస్తే ఊరుకోను" షెర్నీ సింహంలా గర్జించింది.

"అయామ్ సారీ. టీజింగ్ కాదు. ఊరికే టెన్షన్‌గా ఉంది కదా అని కాస్త రిలాక్సేషన్‌కి కామెడీ... అంతే. అయినా ఎలా కనిపెట్టావ్? "

"సింహాలెప్పుడు గ్రూప్‌గా వస్తాయి. ఒక్కటే గర్జించుకుంటూ రాదు".

"డిస్కవరీ ఛానెల్ చూస్తుంటావా? "

"ఏదో నీకెందుకు? అయినా నేను భయపడి, ఏడుస్తూ పరుగెడుతుంటే, నీకు కామెడీగా ఉంటుందా? " షెర్నీ గర్జించింది.

"సారీ. సారీ. క్షమించు".

"ఊహూ" అనేసి మళ్ళీ గబగబా నడుస్తోంది షెర్నీ.

"మౌనంగా ఉంటే బలం పెరుగుతుందిట. అందుకే స్వామీజీలూ, మహానుభా

వులూ అంతా మౌనవ్రతం చేస్తారు".
"నీకూ బాగానే నాలెడ్జ్ ఉందే".
"థాంక్స్ ఎగైన్".
షెర్నీ ఇంకేం మాట్లాడకుండా నడుస్తోంది. నడిచి, నడిచి అలసిపోయారు.
"ఇంకా నడవలేను బాబూ" షెర్నీ ఒక చోట కూలబడిపోయింది.
"అమ్మయ్య. ఇన్నాళ్ళకి నీ నోటివెంట నీకు చేతకాదని ఒక్కసారి విన్నాను".
షెర్నీ వినిపించుకోలేదు. చుట్టూ చూస్తోంది. "కాస్త మైదానం లాంటి ప్రదేశం కనబడితే బాగుండును. రెస్క్యూటీమ్ వచ్చినా వెంటనే వాళ్ళకి కనిపిస్తాం" అంది.
"అవును. నడుస్తుంటే అదే కనిపిస్తుంది". కాసేపు నడిచారు. అనంతంగా కనిపిస్తున్న చెట్లు పలచబడ్డాయి. ఖాళీప్రదేశం కనిపించవచ్చనే ఆశ కలిగింది ఇద్దరికీ.
"నీటి శబ్దంలా వినిపిస్తోంది. ఏదన్నా నది ఉందేమో" అంది షెర్నీ.
ఇద్దరూ ఆశగా పరుగెత్తి, పరుగెత్తి, చివరకు ఒక ప్రాంతం చేరారు. అక్కడ నదీ ప్రవాహం కనిపించింది. ఒడ్డున ఏవో చెట్లకి పళ్ళు కూడా కనిపించాయి.
"ఆకలేస్తోంది" అంటూ ఆ చెట్లవైపు వెళ్ళబోయాడు పవన్.
"ఏపండు పడితే ఆ పండు తినెయ్యకు. కొన్ని పళ్ళు తింటే పిచ్చెక్కుతుందిట. బికేర్ ఫుల్" అంది షెర్నీ.
"నువ్వు జాగ్రత్తగా ఉండు. నీకసలే పిచ్చి ఉంది" అన్నాడు పవన్.
షెర్నీ కోపంగా చూస్తోంది.
చీకటి పడింది. నడిచి నడిచి అలసిపోయి ఉన్నారు. ఆకలి దంచేస్తోంది. కానీ ఏది తినాలన్నా భయమే.
ఎక్కడన్నా కాస్త శబ్దం వినిపిస్తే చాలు. ఏదన్నా హెలికాప్టర్ వచ్చిందేమోనని ఆశగా చూస్తున్నారు. ఏదీలేదు.
"ఇక ఇంతే. ఇవాళ్టికి భోజనం లేదు. ఇలాగే పడుకుని నిద్రపోవాలి".
"చలికి చస్తాం" అంది షెర్నీ.
"నువ్వేం అనుకోనంటే ఒక మార్గం ఉంది". షెర్నీ కోపంగా, అనుమానంగా చూసింది.
పవన్ గట్టిగా నవ్వేశాడు.
"ప్రతిదీ మిస్ అండర్‌స్టాండ్ చేసుకుంటావేం? చలిమంట వేసుకుందామని. అలా అయితే వైల్డ్ యానిమల్స్ కూడా మనదగ్గరికి రావు".
"ఓ. కే." అంది షెర్నీ
"సరే మరి నీ దగ్గర అగ్గిపెట్టెగానీ, లైటర్ గానీ ఉన్నాయా? "
"ఒళు దగ్గర పెట్టుకుని మాట్లాడు. నా దగ్గర ఎందుకుంటాయి? " కోపంగా అంది షెర్నీ.
"అమెరికా వచ్చాక సిగరెట్టేమైనా అలవాటయిందేమోనని..."
"హూ".
"ఓ! సారీ! అయితే మరి నా దగ్గరా లేవు. ఎట్లా మరి? మంట ఎలా వేయాలి?
షెర్నీ సమాధానం చెప్పలేదు.
పవన్ అటూ ఇటూ పరుగెత్తి, చితుకులూ, ఎండు ఆకులూ, కర్రలూ పోగు చేశాడు. రెండు రాళ్లని ఆదిమ మానవుడిలా కొట్టటం మొదలుపెట్టాడు. ఎంతో సేపటికి అతని కృషి ఫలించింది. మంట వెలిగింది.
"అమ్మయ్య. ఈ రాత్రికి ఇక పర్వాలేదు" అన్నాడు.
"పడుకో" అన్నాడు పవన్.
"ఎక్కడా? " షెర్నీ దిక్కులు చూసింది.
"ఇక్కడ ఫోమ్ పరుపులూ, దిళ్ళూ ఉండవు. నేలమీదే పడుకోవాలి"
షెర్నీ ఒకసారి ఆకాశం వైపు చూసింది.
"డోంట్ వర్రీ. హాయిగా పడుకో, ఎవరన్నా సేవ్ చెయ్యటానికి వచ్చినా నిన్ను వదిలేసి పారిపోనులే. లేపుతాను" అన్నాడు.
"నాకలాంటి భయాలూ లేవు".

"మరింక దేని గురించి? నా గురించా? అంత భయం అయితే నేనింకెక్కడికన్నా వెళ్ళి పడుకుంటాను పోనీ".

"హు. నాకేం భయం లేదు" అంది షెర్నీ. నిర్లక్ష్యంగా తల ఎగరేసింది.

"నాకు తెలుసు. షెర్నీ ఎవరికీ భయపడదు. షెర్నీ అంటే ఏదన్నా కుందేలా? షెర్నీ అంటే ఆడ సింహం" అన్నాడు పవన్.

షెర్నీకి కళ్ళు మూతలు పడుతున్నాయి. ఇసుక మీదికి వాలి అలాగే నిద్రపోయింది.

మంటకి అటు వైపున షెర్నీ... ఇటు వైపు పవన్.

షెర్నీ నిశ్చింతగా నిద్ర పోయింది కానీ పవన్‌కి మాత్రం నిద్ర పట్టలేదు. అప్పుడప్పుడూ లేచి చూస్తూనే ఉన్నాడు.

పక్కనే పడుకుని నిద్ర పోతున్న షెర్నీ.

ఇది కలా, నిజమా?

ఇంత చేరువలో తనకి ప్రియాతి ప్రియమైన మనిషి.

షెర్నీ గులాబీ రంగు ఒళ్ళు మంట వెలుగులో ఎర్రగా మెరుస్తోంది. నిద్రలో ముడుచుకుని ఉన్న పెదవులు గులాబీ మొగ్గల్లా ఉన్నాయి. ఆమె మొహంలో ఎందుకనో చిరాకు తగ్గి, ప్రశాంతంగా ఉంది.

మంట తగ్గిపోతున్నట్లు ఉంది. పవన్ లేచి అటూ ఇటూ తిరిగి మరి కొన్ని చితుకులూ, కర్రలూ ఏరి మంటలో వేశాడు.

మంట మళ్లీ ఉజ్వలంగా మండుతోంది. కర్రలు వేస్తున్న చప్పుడుకి షెర్నీ గబుక్కున కళ్ళు తెరిచింది.

"ఏంటి? " అంది కనుబొమలు ముడిచి.

"ఇంకొన్ని పుల్లలు వేస్తున్నాను. మంట చల్లారి పోయేట్లు ఉంది" అన్నాడు పవన్.

"ఓహో" అంది షెర్నీ.

"నిద్ర పట్టలేదా? " అడిగాడు పవన్.

"హాయిగా పట్టింది. నీ చప్పుడుకి మెలకువ వచ్చింది".

"మళ్లీ పడుకో".

ఆమె కనుబొమలు ముడుచుకునే ఉన్నాయి. పవన్ నదీ ప్రవాహం వైపు చూస్తున్నాడు.

"ఏంటి చూస్తున్నావ్? "

"ఒడ్డున ఉన్నాం కదా. ఒకవేళ నువ్వా నిద్రలో అలా దొర్లుకుంటూ వెళ్ళి నదిలో పడతావేమోనని".

"పడితే. అయినా పల్లం ఇటు ఉంటే అటు చూస్తున్నావు? "

"అందరూ అయితే పల్లం వైపుకి కొట్టుకుపోతారు కానీ నువ్వున్నావే, ఏటికి ఎదురీదటం నీకు బాగా అలవాటు కదా. అటే కొట్టుకుపోతావు".

"నువ్వు నన్ను ఊరికే క్రిటిసైజ్ చేస్తున్నావు" అంది షెర్నీ.

"ఇంకా నయం. నేనెందుకు క్రిటిసైజ్ చేస్తాను. నిజానికి నేను నిన్ను అప్రిషియేట్ చేస్తున్నాను."

"ఓ.కే. నీతో నాకేంటి? " అనేసింది షెర్నీ.

"ఎప్పుడూ అయితే అంతే అనుకో. కానీ ఇప్పుడు మనిద్దరం కలిసి జీవించాలి కదా? "

"నీ మొహం. తెల్లవారగానే హెలికాప్టర్ వస్తుంది. ఏదో జీవితాంతం కలిసి బ్లూ లాగూన్ సినిమాలో లాగా జీవిస్తాం అనుకోకు" అంది షెర్నీ.

"నీ మొహం. అసలు మనం ఎక్కడ దిగామో వాళ్ళకి తెలియకపోతే ఎప్పటికీ రారు."

షెర్నీ జవాబు చెప్పలేదు.

"సారీ. కోపం వచ్చిందా? ఊరికే జోక్ వేశానంతే. వాళ్ళు తప్పకుండా వస్తారు. బీ హ్యాపీ".

"నువ్వు ఇంకెక్కడన్నా దిగి ఉంటే బాగుండేది" అంది షెర్నీ.

"ఎవరికి, నాకా? " పవన్ నవ్వేశాడు.

"ఎందుకు నవ్వుతావ్? " కోపంగా చూసింది షెర్నీ.

"మిగతా వాళ్ళెక్కడ ఉన్నారో పాపం" అన్నాడు పవన్.

"ఏమో పాపం" అంది షెర్నీ.

"అదేంటి సింహంలా మాట్లాడాల్సిన నువ్వు మనిషిలా మాట్లాడుతున్నావేం? ".

"అంటే? "

"ఎవడెట్లా పోతే నాకేం అనుకోవాలి కదా నువ్వు. మరి ఇంత సానుభూతిగా పాపం అన్నావంటే..." నవ్వాడు పవన్.

"అసలు నీతో మాట్లాడటం బుద్ధి తక్కువ. హు. ఆ బీస్ట్ గ్రూప్ వాళ్ళ మూలంగా ఇట్లా నీతో గడపాల్సి వచ్చింది."

పవన్ ఏం మాట్లాడలేదు.

"వాళ్ళకేమన్నా బుద్ధుందా? ఎవడో ఏదో చేశాడని ఇక ఆ జాతినందర్నీ ద్వేషిస్తారా? " అంది షెర్నీ.

"నీ దగ్గరకు వచ్చేసరికి అర్థమైందా? " అన్నాడు పవన్.

ఆ రాత్రి గడిచి పోయింది. రాత్రి అప్పు డప్పుడూ ఆకాశం వైపు చూస్తూనే ఉన్నాడు పవన్. హెలికాప్టర్ వస్తుందేమోనని.

తెల్లవారి పోయింది. నది దగ్గర మొహం కడుక్కున్నారు.

ఈ లోపల షెర్నీ పవన్‌ని కొద్దిగా నమ్మటం మొదలుపెట్టింది.

ఏ పండు తింటే మంచిది. ఏది మంచిది కాదు, ఏ జంతువు ఎలా బిహేవ్ చేస్తుంది, దేన్ని ఎలా ఎదుర్కోవాలి దేనినుంచి ఎలా తప్పించుకోవచ్చు అన్నీ పవన్‌కి చెప్పటం మొదటు పెట్టింది.

"అన్నిటికన్నా క్రూరమైన, భయంకరమైన జంతువు మనిషే. వేరే జంతువులేవీ అనవ సరంగాఎటాక్ చెయ్యవు" అన్నాడు పవన్.

షెర్నీ వింతగా చూసింది.

"నేను జీవితాన్ని చాలా చూశాను. నువ్వు నాకేం టీచ్ చెయ్యఖ్ఖర్లేదు" అంది.

"నీ మొహం చూశావు" అన్నాడు పవన్.

షెర్నీ కోపంగా చూసింది.

"ఏంటి నీ ఉద్దేశం? " అంది క్రూరంగా చూస్తూ.

"అదుగో, అలా క్రూరంగా చూడటమే మానుకోమంటున్నాను. నీకసలు జీవిత మంటే ఏమిటో కూడా తెలీదు" అన్నాడు పవన్.

"ఏడిశావ్? " అంది షెర్నీ కోపంగా చూస్తూ.

"ఏడవలేక నవ్వుతున్నాను. నీకసలు జీవితం అంటే ఏమిటో తెలిస్తే ఎన్నటికీ ఇలా ప్రవర్తించవు" అన్నాడు పవన్.

"నీకు మాట్లాడటం చేత కాకపోతే నోరు మూసుకో" అరిచింది షెర్నీ. ఎన్నడూ ఒక్క మాట కూడా ఎక్కువ మాట్లాడని షెర్నీకి ఎందుకో ఆవేశం వచ్చేసింది.

"అసలు నేను నీకేం తెలుసని ఇలా మాట్లాడుతున్నావ్? " అంది అరుస్తూ.

"మనిషిని దేన్నిబట్టి తెలుసుకుంటారు? " అడిగాడు పవన్.

"మాటలబట్టి, ప్రవర్తన బట్టి"

"అవునా? నీ ప్రవర్తన దురహంకారంతో ఎంత ఘోరంగా ఉంటుందో ఎనలైజ్ చేసుకో. ఇప్పుడు నీక్కావల్సినంత తీరిక ఉంది. ఎవరన్నా వచ్చి రక్షిస్తారేమోనని ఎదురుచూడటం తప్ప మరో పనిలేదు. నీక్కావల్సిన పళ్ళో, దుంపలో నేనే వెతికి కొట్టుకొస్తాను. తీరిగ్గా ఈ బండమీద కూర్చుని ఆలోచించుకో" అన్నా డు పవన్.

"నీకు నా గురించి మాట్లాడే అర్హతలేదు" అంది షెర్నీ.

"అవును. డబ్బులో మీకన్నా చాలా తక్కువ"

"కాదు. డబ్బుని నేనెప్పుడూ కేర్ చె య్యను".

"మరి? "

"వ్యక్తిత్వంలో. మానసికంగా మేమెంతో ఉన్నతులం. మాగురించి ఆలోచించే అర్హత కూడా ఈ లోకానికి లేదు. ఈ లోకంలో అంతా దుష్టులూ, దుర్మార్గులూ"

"అవును. మీరొక్కరే చాలా మంచివాళ్లూ.

మిగతా అంతా కపటం, మోసం ద్రోహం" వెక్కిరింపుగా అన్నాడు పవన్.

"నన్ను రెచ్చగొట్టకు" అంది షేర్నీ.

"రెచ్చగొట్టడం కాదు. నిజం ఏమిటో తెలుసుకోమంటున్నాను. హరిణీ..."

"షటప్"

"నేనూ ఆ మాట అనగలను. హరిణీ... నీకు జీవితం అంటే తెలుసన్నావు. నీకేం తెలియదని నేను క్షణంలో రుజువు చెయ్యగలను"

"ఎలా చేస్తావు? " షేర్నీ ఛాలెంజ్ గా చూసింది.

"జీవితంలో పూర్ణసత్యం అంటూ ఉండదు. అవునా? ? " అడిగాడు పవన్.

"అవును."

"మరి పూర్ణసత్యం అంటే ఆబ్సొల్యూట్ ట్రూత్ అనేది లేదు. ఎవడూ పరిపూర్ణుడు కాడు. ఎవడూ పురుషోత్తముడు కాడు. పెర్ఫెక్ట్ జెంటిల్మాన్ అని ఎవడూ ఉండడు. అవసరాన్నీ అవకాశాన్నీ బట్టీ మనిషి మారుతూ ఉంటాడు. నూటికి తొంభైతొమ్మిది మందిలో ఇదే జరుగుతుంది"

"అవును. ఎక్కడో నూటికో, కోటికో ఒకరు మాలాంటి ఉన్నతులు. హైస్టాండర్డ్స్ కలిగిన వాళ్లు ఉంటారు" గర్వంగా చెప్పింది షేర్నీ.

"అవునా. నీ అభిప్రాయం, నీపట్ల నీకున్న అభిప్రాయం అది కదా. మరి నువ్వంత పెర్ఫెక్ట్ మైండ్ ఉన్నదానివైతే ఇందాక అలా ఎందుకు తిట్టావ్? " అడిగాడు పవన్.

"ఎవర్ని తిట్టాను."

"అదే బాంబు పెట్టిన వాళ్లని ఏమన్నావు? ఎవడో ఒకడు చేసిన దానికి అందర్నీ బలిచెయ్యాలా అన్నావు. అవునా? నువ్వు అన్నది అక్షరాలా నిజం. లోకంలో ఎందరో మనుషులు ఉంటారు. మంచి వాళ్లూ ఉంటారు. చెడ్డవాళ్లూ ఉంటారు. ఒకడు ఏదో నీకు అన్యాయం చేశాడని సమస్త మానవ జాతినీ ద్వేషించిన నీకు వాళ్లని తిట్టే అధికారం ఎక్కడుంది? అలా అయితే వాళ్లని వాళ్లూ సమర్థించుకుంటారు. ఒకడేదో చేస్తాడు. ఆ చేసిన వాడి జాతినో దేశాన్నో ద్వేషించి ఇంకోడు వాళ్లందరినీ నాశనం చేయాలని బయల్దేరుతాడు. ఒకడిని చూసి మరొకడు ద్వేషంతో అసహ్యంతో రగిలిపోతాడు. యుద్ధాలు జరుగుతాయి. తీవ్రవాదం పెరుగుతుంది. మానవ జాతి సమస్తం నాశనమైపోతుంది" అన్నాడు పవన్.

షేర్నీ కోపంగా చూస్తోంది. ఉన్నట్లుండి తటాల్న అక్కడ్నుంచి బయల్దేరింది. మనిషి ఊగిపోతూ నడుస్తోంది.

పవన్ ఆమెను అనుసరించాడు. ఆమె ఏ అఘాయిత్యం చేసుకోదని పవన్‌కి తెలుసు.

అఘాయిత్యం, ఆత్మహత్య లాంటివి చేసుకునేంత పిరికి మనిషి కాదు షేర్నీ.

షేర్నీ గబగబా అడుగులు వేస్తోంది. ఈ సృష్టి మొదలయినప్పుడు ఏకాకి అయిన ఆదిమ మానవుడు అడవి మధ్య నిలిచి, ఆక్రోశించి, తన జీవితాన్ని ఎలా గడపాలా అని నిర్ణయించుకుని ఆగ్రహంతో ఏ జంతువునో చంపటానికి బయల్దేరినట్లు బలంగా, వేగంగా బరువుగా పడుతున్నాయి ఆమె అడుగులు.

"హరిణీ" ఆగమన్నట్లు అరిచాడు పవన్. హరిణి ఆగలేదు. వేగంగా, అతి వేగంగా అలా తాచుపాములా దూసుకుని సాగి వెళ్ళిపోతోంది.

"హరిణీ. ఓ సారీ. షేర్నీ. ప్లీజ్ ఆగు నువ్వే కరెక్ట్. నువ్వు చాలా ఉన్నతురాలివి. ఆగు. నా మీద కోపంతో ఇష్టం వచ్చినట్లు నడిచిపోవటానికి ఇది మీ బంజారాహిల్స్ కాదు. కారడవి. ఇక్కడ పాములుంటాయి. తేళ్ళుంటాయి. జాగ్రత్తగా నడవాలి. ప్లీజ్. ఆగు హరిణీ, ఆగు" అరిచాడు పవన్.

హరిణి ఆగలేదు. దూసుకుని దూసుకుని సివంగిలా వేగంగా వెళ్ళిపోతోంది. ఆవే

శంతో, దమ్ముతో ఆమె శరీరం మొత్తం ఎగసిపడుతోంది. కళ్ళు ఎర్రబడ్డాయి. గులాబీ రంగు శరీరం రక్తవర్ణంలోకి మారుతోంది.

"హరిణీ" అరిచాడు పవన్.

హరిణి హఠాత్తుగా ఆగిపోయింది. ఒక చెట్టు కిందికి చేరి కోపంగా చూస్తోంది. ఆ చెట్టుకి ఎర్రటి పళ్ళు బోలెడన్ని వేళ్ళాడుతున్నాయి. గుత్తులు గుత్తులుగా ఉన్న ఆ పళ్ళలోంచి తటాల్ని కొన్ని పళ్ళు తుంచింది. గబుక్కున వాటిని నోట్లో వేసుకుంది.

"ఏమిటవి? " అడిగాడు పవన్.

"విషం" అంది హరిణి కోపంగా చూస్తూ. అంతే. పవన్ కూడా కొన్ని పళ్ళు తుంచి నోట్లో వేసుకుని నమిలి మింగేశాడు.

హరిణి నిర్ఘాంతపోయింది.

"నేను జీవితమంతా బోలెడన్ని కష్టాలు పడ్డాను. నాకు జీవితం మీద ఆశలేదు. కానీ నువ్వెందుకు అవి తిన్నావు. చస్తావు మరి" అంది

"చావనీ. చచ్చేముందయినా కొన్ని నిజాలు తెలుసుకోవాలి" పవన్‌కి మత్తు వచేస్తోంది. ఒళ్ళు మొద్దుబారి పోవటం అతనికి స్పష్టంగా అర్థమవుతోంది.

"ఏమిటా నిజాలు? " అడిగింది హరిణి.

"చెపుతాను. నువ్వు హరిణివే కదూ? "

హరిణి కళ్ళు పేలిపోయేలా చూసింది. మొహంలో ఆక్రోశం స్పష్టంగా తెలిసిపోతోంది. మాట మొద్దుబారిపోయింది.

"అవును" అంది.

ఆ మాట అనటానికి ఆమె తన శరీరంలోని సర్వశక్తుల్నీ కూడగట్టుకోవడం అంత దురవస్థలోనూ పవన్ గమనించగలిగాడు. తనను తాను రూపుమాపుకుని, మనసునీ ఆత్మనీ అంతరంగాన్నీ సర్వం హరిణి నుంచి షేర్నీగా రూపాంతరం పొందించిన ఆమెకి ఇది పెద్ద అగ్ని పరీక్షలా అనిపించింది. ఆ పరీక్షలో విజయం పొందిన విద్యార్థిలా ఎలాగో ఆమాట అనగలిగింది. తనను తాను హరిణిగా ఒప్పుకోగలిగింది.

"చాలు హరిణీ చాలు. నువ్వు షేర్నీవి కాదు. హరిణివి. హరిణివి. నా హరిణివి." పవన్ ఆమెని హత్తుకోవటానికి ముందుకి అడుగువేయబోయి తూలి పడబోయి ఆగాడు.

"ఆగు" అరిచింది హరిణి.

"హరిణీ. ప్లీజ్ చావుకి దగ్గరలో ఉన్నాం ఇకనైనా నిజాలు తెలుసుకుని చావటం నయం. నువ్వు మారాలి. నిన్ను మార్చాలని చచ్చేదాకా పాకులాడాను"

"ఎందుకు? "

"ఎందుకంటే, నువ్వు ఒక మంచి మనిషివి. ఒక్క సంఘటనతో నువ్వు మారి లోకాన్ని ద్వేషించకూడదు. నువ్వు ప్రేమ మూర్తివి. ద్వేషం నిన్ను శాంతిగా ఉండనిచ్చిందా హరిణీ. చెప్పు. ఏ క్షణం అయినా విశ్రాంతిగా, హాయిగా ఉండగలిగావా? "

"లేదు" హరిణి సూటిగా సమాధానం చెప్పింది.

"అవునా? హరిణీ. ద్వేషం ద్వేషాన్ని చల్లార్చదని గౌతమబుద్ధుడు ఏనాడో చెప్పాడు. ద్వేషాన్ని ప్రేమతో జయించాలి. హరిణీ ప్లీజ్. నీ మనసులోంచి ద్వేషాన్ని తుడిచెయ్యి. ప్రేమా, శాంతీ దైవానికి మరో రూపాలు. సైతాన్‌ని తరిమికొట్టి దైవాన్ని నీ మనసులోకి ఆహ్వానించు" అన్నాడు పవన్ తడబడుతూ, తూలుతూ.

"ఓ.కే. ఇంతకు ముందు ఈ మాటలు చెప్పావంటే అర్థం ఉంది. అప్పుడు నన్ను ప్రేమిస్తున్నానన్నావు. పెళ్ళి ఆశ ఉండేదేమో. చచ్చేముందు కూడా ఎందుకీ జ్ఞాన బోధ? " అడిగింది హరిణి.

"ఎందుకంటే నేను నిన్ను గాఢంగా, అతి గాఢంగా ప్రగాఢంగా ప్రేమించాను కాబట్టి. ఆ ప్రేమ శరీరానికి సంబంధించింది కాదు. నీ మనసునీ, నీ ఆత్మనీ నేను ప్రేమించాను. ఆ మనసు ద్వేషంతో నిండి, పగతో ఆ ఆత్మ అపవిత్రమైపోకూడదు. నేను దేవుడ్ని

నమ్ముతాను. నీ ఆత్మకు కూడా ఉత్తమగ తులు కలగాలన్నదే నా ఆశ."

"ఓహో. పవిత్ర ప్రేమికుడివి కదూ" హరిణి విరగబడి నవ్వింది. నవ్వుతూనే ఉంది.

"పవిత్ర ప్రేమ. అమలిన శృంగారం. కేవలం ఆత్మలకే పరిమితమైన ప్రేమ" హరిణి
ఇంకా విరగబడి నవ్వుతూనే ఉంది.

"నువ్వు. నువ్వు నవ్వుతూ బతకాలి... నవ్వుతూ..." పవన్ ఇంక ఏం మాట్లాడలేకపోయాడు. అంతవరకూ ఉగ్గబట్టుకున్న ఒళ్ళు మొత్తం ఊగిపోయింది.

"నవ్వుతూ చావాలి" హరిణి నవ్వుతూ ముందుకి వాలిపోయింది.

"హరిణీ" పవన్ కుప్పకూలిపోయాడు.
హరిణి కూడా తన ముందు కుప్పలా పడిపోవటం అతనికి తెలుస్తూనే ఉంది.



హరిణి నవ్వు వినిపిస్తూనే ఉంది. ఆమె నవ్వు వింటూ బతకాలనుకున్నాడు. ఆమెకి నవ్వు అనేది ఉందని తెలపాలనీ, నవ్వుతూ బతకమని ఆశీర్వదించాలనీ ఎంతో కోరుకున్నాడు. చివరికి ఆ నవ్వు వింటూ తాను చావగలుగుతున్నాడు. తనే గెలిచాడు. హరిణి తనని తాను హరిణిగా ఒప్పుకుంది. మారింది. చాలు. ఇద్దరూ నవ్వుతూ చచ్చిపోవాలి.

నవ్వుతూ ఉన్న హరిణి పవన్ నవ్వు విని తలతిప్పి చూసింది.

"హరిణీ. నవ్వు, ప్లీజ్ నవ్వు' నీ నవ్వు కోసం జీవితమంతా తహతహలాడాను. నవ్వు, నేనూ నవ్వుతాను" పవన్ నవ్వుతూ చెప్పాడు.

★ ★ ★

అతనికి స్పృహ వచ్చేసరికి అతని తల హరిణి ఒళ్ళో ఉంది.

ఒక్క నిమిషం అతనికి అసలేం జరిగిందో కూడా అర్థం కాలేదు. తామిద్దరూ ఆ విషం పళ్ళు తిన్నారు. తర్వాత స్పృహతప్పి పడిపోవటం వరకూ అతనికి గుర్తుంది. అంటే తాము ఇప్పుడు స్వర్గంలో ఉన్నట్లా, లేకపోతే భూమి మీదే ఉన్నారా?

"హరిణీ" అతనికి లేవాలని మాత్రం అనిపించలేదు. ఇది కలో, నిజమో భూమో స్వర్గమో, ఆఖరికి పిచ్చాసుపత్రో? ఏదన్నా కానీ. తను హరిణి ఒడిలో ఉన్నాడు. అది చాలు.

"ఎలా ఉన్నావు పవన్? " హరిణి నవ్వుతూ అడిగింది.

"మనం... చావలేదా? "

"లేదు. అవి విషం పళ్ళు కాదు. కేవలం మత్తుమాత్రం కలిగిస్తాయి. నాకు వాటి గురించి తెలుసు. అందుకే తిన్నాను."

"ఎందుకలా? "

"నిన్ను టెస్ట్ చెయ్యాలని"

"అవునా? " పవన్ తటాల్న లేచి కూర్చున్నాడు.

"రిజల్ట్ ఏమిటి? "

"నా ఒళ్ళో పడుకున్నావంటే రిజల్ట్ ఏమిటి? "

"య్యాహూ" ఒక్కసారి లేచి గంతులు వేశాడు పవన్.

హరిణి విరగబడి నవ్వింది.

"అంత అరవకు. పులో, సింహమో

వస్తుంది"

"వచ్చినా నాకేం భయంలేదు. నువ్వు పక్కన ఉంటే చాలు. దేన్నయినా ఎదుర్కో గలను"

"ఓ. కే. చాలు చాలు"

"హరిణీ... హరిణీ" ఒక్కసారిగా హరిణిని బలంగా కౌగిలించుకుని ముద్దుల వర్షంలో ముంచెత్తాడు పవన్.

"హరిణీ. నా హరిణీ" అతనికి పెన్నిధి దొరికింది. ఎంతో తపించి, తహతహలాడి పోయిన పెన్నిధి ఎదురుగా నిలిచి నన్ను నీ సొంతం చేసుకోమంటుంటే ఆగలేక అతని గుండె వణికిపోయింది.

"హరిణీ. ఐ లవ్ యూ"

"పవన్. నేనూ అంతే"

"హరిణీ. ఎందుకిలా పరీక్షించావ్? "

"పవన్. నేనూ, అత్తయ్యా లోకం దృష్టిలో క్రూరమైన వాళ్లం. అవునా? కానీ నిజానికి మేము అలాంటివాళ్లం కాదు. కానీ మాకు లోకం అంటే భయం ఉండేది. ఇన్ సెక్యూరిటీ ఫీలింగ్ ఉండేది. దాన్ని కప్పిపుచ్చుకుని, కవర్ చేసుకుని పాముల్లా బుస కొట్టేవాళ్లమే తప్ప మేము విషసర్పాలం కాదు"

పవన్ నిశ్శబ్దంగా వింటున్నాడు.

"పవన్. నేను విజయ్‌ని చూడగానే గుర్తు పట్టాను. కానీ నాకు గతం తల్చుకోవటం ఇష్టం లేకపోయింది. మాలో బోలెడంత సెల్ఫ్ పిటీ కూడా ఉంది. అందరూ మమ్మల్ని ఎక్స్‌ప్లాయిట్ చేశారన్న కోపం కూడా ఉండేది. అవన్నీ మెల్లగా జయించాం. ఇక నీ సంగతి అంటావా? నిజమైన ప్రేమికుడికి ఉన్న నిజాయతీ నీ కళ్లల్లో ప్రతిబింబిస్తూనే ఉంది. అయినా ఏదో అహం నాచేత అలా టెస్ట్ చేయించింది" హరిణి తలవాల్చుకుని చెప్పింది.

"పర్వాలేదు. నేనేం బాధపడటంలేదు. మనిషికి సెల్ఫ్ అనాలిసిస్ అవసరం. ఓ. కే. నువ్వు పూర్తిగా మారిపోయావు. నాకు సంతోషంగా ఉంది" అన్నాడు పవన్.

"నేను హరిణినే అయిపోయాను పవన్. షేర్నీగా నేను అనుభవించే వేదన తక్కువ. హరిణిగా మారి, ఎమోషన్స్‌ని తట్టుకోగలనా అని భయంగా ఉంది" హరిణి కళ్ళల్లో నీళ్లు.

పవన్ ఆమె ముందుకి వెళ్లి నిలబడ్డాడు. ఆమె కళ్లు తుడిచాడు.

"హరిణీ. దేనికి బాధ? " అడిగాడు.

"డాడీ. డాడీ గుర్తుకొస్తున్నారు" హరిణి బాధ తట్టుకోలేక ఏడ్చేసింది.

పవన్ ఆమె తలని గుండెకి హత్తుకున్నాడు.

"హరిణీ. బాధపడకు. నేను నీకు మీ డాడీని తిరిగి తీసుకురాలేను. కానీ నీకు తండ్రి లేని లోటు రానివ్వను. నీకు తల్లీ, తండ్రీ, సర్వం నేనై నిలుస్తాను" పవన్ మెల్లగా చెప్పాడు.

పచ్చటి పందిరిలాంటి చెట్లూ, లతలూ, అక్షతలు కురిపిస్తున్నట్లు రాలుతున్న పూలు ప్రకృతిమాత ఒడిలో హరిణికి ఆ మాటలు అమృతపు జల్లులా అనిపించాయి.

"పవన్" అతన్ని హత్తుకుపోయింది. అతని చెయ్యి ఆమె వీపుని నిమురుతోంది. ఆ చేతిలోంచి ఏదో బలం తన ఒంట్లోకి ప్రవహిస్తున్నట్లు అనిపిస్తోంది హరిణికి.

తనకి మంచి భర్త దొరకాలని డాడీ ఎంతగా కోరుకుని ఉండి ఉంటారో! పవన్‌ని చూస్తే ఎంత సంతోషించి ఉండేవాళ్లో.

"డాడీ" ఆమె గుండె ఆవేదనగా పిలిచింది. కృష్ణప్రసాద్ బదులిచ్చాడా అన్నట్లు ఆ అడవి ప్రశాంతతలోంచి ఒక శబ్దం

"హెలికాప్టర్" అన్నాడు పవన్. వాళ్లని ఆశీర్వదించడానికి దివినుంచి భువికి దిగుతున్న దేవదూతలా మెల్లగా కిందికి వస్తోంది ఆ హెలికాప్టర్.

✦



# మినీ కథలు

## గుట్టురట్టు

"హలో శివరాం గారున్నారా? "

"స్పీకింగ్...."

"నమస్కారం సార్.... నాపేరు విజయ"

"నమస్కారమండీ...."

"మీ రచనలంటే నాకెంతో ఇష్టమండీ"

"చాలా సంతోషమండీ"

"నాకూ చాలా సంతోషంగా ఉందండీ. నా అభిమాన రచయితతో ఇలా ఫోన్ ద్వారానైనా మాట్లాడుతున్నందుకు..."

"భలేవారే! అనుకోవాలే గానీ ఫోన్ ద్వారానే ఏమి ఖర్మ ముఖాముఖీనే మాట్లాడుకోవచ్చు.."

"థ్యాంక్యూ...."

"నో మెన్షన్..."

"మిమ్మల్ని ఎలా కలుసుకోవాలి. ఆఫీసుకి రమ్మంటారా? "

"అమ్మమ్మ... ఆ పని మాత్రం, చెయ్యకండి. ఇక్కడున్న మగాళ్లందరూ దగుల్బాజీ వెధవలు, పరాయి ఆడది కనిపిస్తే చాలు ఎలా ప్రవర్తిస్తారో వాళ్లకే అర్థం కాదు"

"పోనీ మీ ఇంటి అడ్రసు చెప్పండి. అక్కడికే వస్తాను."

"బాబోయ్... ఆపని అసలు చెయ్యకండి. అదంత కన్నా డేంజర్"

"ఏమండీ... మీ ఇంటి దగ్గర కూడా దగుల్బాజీ మగ వెధవలున్నారా? "

"అంతకన్నా పెద్ద దగుల్బాజీ ఆడ వెధవ ఉంది. నాకోసం ఎవరైనా ఆడపిల్లవస్తే ఇంకేమయినా ఉందా? అది అనుమానంతో కుళ్లిపోతుంది"

"నిప్పు లేనిదే పొగ రాదని మీ కథల్లో తెగరాస్తుంటారు కదండీ..."

"కథలు వేరు, జీవితం వేరు. ఆ విషయాలు అంతటితో వదిలేయండి. సాయంత్రం సరిగ్గా ఆరుగంటలకల్లా అన్నపూర్ణాకి వచ్చేయండి. ఫస్ట్‌షో చూస్తూ కబుర్లు చెప్పుకుందాం."

"అలాగే బావా"

"బావా? "

"అవును బావా - నేను ఉదయని. మీ మరదలిని. ఇందాకే వచ్చాను ఊరు నుంచి.



అక్కయ్య ఇలా ఫోన్ చెయ్యమంటే చేశాను. అక్కయ్య మాట్లాడుతుందిట. మాట్లాడు."

"నేను సాయంత్రం సినిమాకి వెళ్దామంటే అర్జంటు ఆఫీసు పనులున్నాయన్నారు."

"అబ్బే... ఏంలేదు... పెందలాడే వచ్చేస్తాను. ముగ్గురం సినిమాకి వెళ్దాం."

"పక్కనే నేనున్నా, మీతో పాటు మాచెల్లెల్ని సినిమాకి చచ్చినా రానివ్వను."

"...?"

– బద్దిగం పాండురంగారెడ్డి

---

## గ్రహపాటు

విశాఖపట్నం నుంచి హైద్రాబాద్ వెళ్లే గోదావరి ఎక్స్‌ప్రెస్ చీకటి గుండెల్ని చీల్చుకుంటూ దూసుకుపోతోంది. విశాఖలో ఎక్కిన విశ్వేశ్వరరావూ, సామర్లకోటలో ఎక్కిన సర్వేశ్వర్రావులవి ఎదురెదురుగా వున్న మిడిల్ బెర్త్‌లు. విశ్వేశ్వరరావు ఏలూరు

వరకు, సర్వేశ్వరరావు సికిందరాబాదూ వెళుతున్నారు. ఇద్దరూ నడివయస్కులే కాక పీలగా కూడా ఉంటారు. సర్వేశ్వరరావుపై బెర్త్‌కి చెందిన ముప్పయ్యేళ్ల కోటేశ్వరరావు వారికి తోడయ్యాడు. అన్నవరంలో ఎక్కిన అతను సికిందరాబాద్ వెళుతున్నాడు. ముగ్గురూ పిచ్చాపాటీకి దిగారు. డిన్నర్ ముగిశాక పడకలు వేశారు.

"ఏలూరు వచ్చేసరికి అర్ధరాత్రవుతుంది. నాదసలే మొద్దునిద్ర. నన్ను లేపే బాధ్యత మీదే. ఒకవేళ నేను లేవకపోతే మోసుకెళ్లి ప్లాట్‌ఫాం మీద పడెయ్యండి" అన్నాడు విశ్వేశ్వరరావు నవ్వుతూ సర్వేశ్వరరావుతో 'అలాగే' నన్నాడతను.

కీచుమన్న చక్రాల శబ్దంతో రైలు ఏదో స్టేషన్లో ఆగడంతో హఠాత్తుగా మెలకువ వచ్చింది లోయర్‌బెర్త్‌లో పడుకున్న కోటేశ్వరరావుకు. కిటికీలోంచి బయటకు చూస్తే 'ఏలూరు' అన్న బోర్డు కనిపించింది. విశ్వేశ్వరరావు అక్కడే దిగాలన్న విషయం చటుక్కున స్ఫురించింది. స్విచ్ వేస్తే లైట్ వెలుగలేదు. పవర్ పోయినట్టుంది, కంపార్ట్‌మెంట్ చీకటిగా వుంది.

కళ్లు చించుకుని చూస్తే, ఎదుటి బెర్త్ మీది వ్యక్తి గాఢనిద్రలో ఉన్నాడు. అతన్ని లేపుతానన్న వ్యక్తి కూడా సన్నగా గురకపెడుతున్నాడు... విశ్వేశ్వరరావును లేపడానికి ప్రయత్నించాడు కోటేశ్వరరావు. ఫలితం లేకపోయింది. ట్రెయిన్ ఎంతోసేపు ఆగదక్కడ. ఆలస్యంచేస్తే ప్రమాదం. వెంటనే నిద్రలో వున్న మనిషిని క్రిందికి లాగి, చేతుల్లో ఎత్తుకుని గబగబా తీసుకువెళ్లి ప్లాట్‌ఫాం మీద కుదేశాడు కోటేశ్వరరావు. రైలు బయలుదేరుతున్నానంటూ కూత వేయడంతో పరుగెత్తుకెళ్లి ఆ వ్యక్తి బెర్త్‌మీదున్న ట్రావెల్ బ్యాగ్‌ని తెచ్చి అతని వద్దకు విసిరేశాడు. అంతలోనే ట్రెయిన్ కదిలి, వేగం పుంజుకుంది... ఓ మంచిపని చేశాను కదా అన్నతృప్తితో బెర్త్ మీద వాలి కన్ను మూశాడు.

కోటేశ్వరరావుకి మెలకువ వచ్చేసరికి ట్రెయిన్ సికిందరాబాద్ స్టేషన్‌లో ప్రవేశిస్తోంది. చటుక్కున లేచి కూర్చున్న అతను, కళ్లెదుట కనిపించిన శాల్తీని చూసి బిగిసిపోయాడు.

"రాత్రి ఏలూరు వచ్చాక లేపమని అంతగా చెబితే, సరేనన్న పెద్దమనిషి నా కొంపముంచేశాడు. ఇవాళ ఏలూరు కోర్టులో ఓ ముఖ్యమైన వ్యాజ్యం వుంది" కోటేశ్వరరావు లేవడం చూసి నెత్తికొట్టుకుంటూ ఫిర్యాదు చేశాడు విశ్వేశ్వరరావు. కోటేశ్వరరావు తెలగ్రుడ్లు వేసుకుని చూశాడు.

"ఇంతకూ ఆ పెద్దమనిషి ఏమయ్యాడో! అతని బ్యాగ్ కూడా కనిపించడంలేదు. కొంప



దీసి నన్ను లేపలేక నా బదులు తాను దిగిపోలేదుగదా!" అంత టెన్షన్‌లోనూ జోక్ చేశాడు విశ్వేశ్వరరావు.

కోటేశ్వరరావుకి నవ్వు రాలేదు. రాత్రి సంఘటనలు బుర్రలో గిర్రున తిరిగాయి... సర్వేశ్వరరావుపైన ఉన్న అప్పర్‌బెర్త్ తనది. ఓ రాత్రివేళ విశ్వేశ్వరరావు బెర్త్ క్రింద ఉన్న లోయర్‌బెర్త్ ఖాళీగా కనిపిస్తే తాను దాన్ని ఆక్రమించుకున్నాడు. టాయ్‌లెట్‌కి వెళ్లడానికి వీలుగా ఉంటుందని. ఏలూరు వచ్చేసరికి హఠాత్తుగా మేల్కొనడంతో తాను బెర్త్‌మారిన సంగతి మరిచిపోయి, తన ఎదుటి వరుసలోని మిడిల్ బెర్త్‌లో వుండే విశ్వేశ్వరరావును లేపాలన్న విషయం గుర్తుకు రావడంతో, చీకట్లో ముఖం చూడకుండా, ఆ బెర్త్‌లోని

వ్యక్తిని రైల్లోంచి దింపేశాడు.

తాను ఏలూరు దింపేసింది సర్వేశ్వరావునని గ్రహించిన కోటేశ్వర్రావు నివ్వెరపోయి, 'పాపం, అతను అక్కడ ఏం అవస్థపడ్డాడో! నన్నెంత తిట్టుకున్నాడో!' అనుకున్నాడు మనసులోనే నొచ్చుకుంటూ. అంతలోనే, 'ఇది నా పొరపాటు ఎందుకవుతుందీ? అతని గ్రహపాటు! అంతే...' అని మనసును సరిపెట్టుకున్నాడు.

– పి.వి.వి.సత్యనారాయణ

# ర్యాగింగ్

పల్లె నుంచి వచ్చి పట్నం కాలేజీలో చేరాడు అలీ. 'ఫ్రెషర్స్ డే' రోజున కాలేజీలో ర్యాగింగ్ జరిగింది. "మేము చూపించిన అమ్మాయికి లైనేసి వారం తిరిగేలోగా ఆమెచేత 'ఐ లవ్ యూ!' అనిపించుకోవాలి నువ్వు" అంటూ అలీని ఆదేశించారు సీనియర్స్. 'ఫెయిలయితే కాలేజీ, స్వీపరు అప్పలమ్మను పబ్లిగ్గా ముద్దుపెట్టుకోవలసుంటుంది' అని బెదిరించారు కూడా.

సీనియర్స్ చూపించిన అమ్మాయిని చూసి ఎగిరి గంతేశాడు అలీ. ఆమె పేరు దివ్య. కను, ముక్కుతీరు వగైరా దివ్యంగా, అందంగా వుంది. తనలాగే ఆమె కూడా ఆ కాలేజీలో కొత్తగా చేరిందట.

అమ్మాయిలకు లైన్ వేయడం ఎలాగో తెలీని అలీ, తన రూమ్మేట్‌ని శరణు కోరాడు. "ఇందుకు రెండు పద్ధతులున్నాయి. మొదటిది - నేరుగా అమ్మాయి దగ్గరకువెళ్లి 'ఐ లవ్ యూ' చెప్పెయ్యడం. అయితే ఇందులో చిన్న రిస్కుంది. ఇష్టమైతే అమాంతం కావలించేసుకుంటుంది. ఇష్టంలేకపోతే కాలిజోడు తీసి ఎత్తుమడమలతో ఎడాపెడా వాయించేస్తుంది. ఇంకా కరాటే వచ్చిన వనిత అయితే తిన్నగా నిన్ను హాస్పిటల్ బెడ్‌మీదికే విసిరేస్తుంది..."

'అమ్మో!' అనుకున్నాడు అలీ, అతను చెబుతుంటే.

"ఇక రెండో పద్ధతి - రోజుకో లవ్ లెటర్ సంధించి ఆ పిల్ల వొళ్లోకి విసిరేయడం" చెప్పాడతను. "ఇష్టమైతే చదువుకుని దాచుకుంటుంది. కష్టమనిపిస్తే చదవకుండానే చింపి పారేస్తుంది. మరీ వికటిస్తే ప్రిన్సిపాల్‌కి చూపించి కాలేజీ నుంచి డిబార్ కూడా చేయిస్తుందన్న విషయం మాత్రం అలీ దడుసుకుంటాడని చెప్పలేదతను.

రెండోదే సేఫ్ అనుకున్న అలీ, శాంపిల్‌గా ఓ లవ్‌లెటర్ రాసి రూమ్మేట్‌కి చూపిస్తే, తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు. అతను, "ప్రియురాలికి రాసిన లవ్ లెటర్‌లా లేదిది. ప్రిన్సిపాల్‌కి రాసిన లీవ్‌లెటర్‌లా ఉంది!" అంటూ.

అతన్ని బ్రతిమాలి తొలి ప్రేమ లేఖను అతని చేతే రాయించుకున్నాడు అలీ. గుండెల్లో ఎమ్.ఎమ్.టి.ఎస్. రైలు పరుగెడుతూంటే, మలేరియా రోగిలా చేతులు వణికిపోతుంటే ఎలాగో ఆ ఉత్తరాన్ని దివ్యకు అందించాడు అలీ. ఓసారి అతన్ని ఎగాదిగా చూసి, ఆ ఉత్తరాన్ని చదవకుండానే బాణంలా మడిచి వ్రేళ్ల మధ్య ఇరికించుకుని సూటిగా అతని ముఖమ్మీదికే విసిరేసిందామె.

తొలి ప్రయత్నం అలా తలకొచ్చి తగలడంతో తల్లడిల్లిపోయాడు అలీ. పోనీ, ఎందుకొచ్చిన గొడవ అని ఊరుకుందామనుకుంటే, అప్పలమ్మ చింకి చేట, చీపురు కట్టా, పట్టుకుని కళ్లెదుట ప్రత్యక్షమవుతోంది.

"ఆరంభంలో ఆమాత్రం బెట్టుచూపించకపోతే ఆడవాళ్లే అవ్వరు. నువ్వు ధైర్యంగా ప్రొసీడ్ అయిపో. ఆనక ఆపిల్లే కుక్కపిల్లలా జడ ఊపుకుంటూ నీవెంట తిరుగుతుంది" అంటూ లవ్వోపదేశం చేశాడు రూమ్మేటు ఓదార్చుతూ.

సో, విక్రమార్కుణ్ణి మదిలో తలచుకుని తన 'లవ్వాస్త్రాలను' దివ్యమీదకు ఏకధాటిగా

సంధించాడు అలీ. వారం కావస్తున్నా ఆమె నుంచి ఆశించిన రెస్పాన్స్ లేకపోవడంతో, మిత్రుడి సలహా ప్రకారం, "మౌనం అర్ధాంగీకారమని సరిపెట్టుకోలేకపోతున్నాను. ఇప్పటికైనా నీ మనసేమిటో చెప్పకపోయావంటే మన ప్రిన్సిపాల్ చచ్చినంత ఒట్టు! వచ్చే ఆదివారం ట్యాంక్‌బండ్‌కి పిక్నిక్‌కి వెళ్లి హుస్సేన్ సాగర్‌లో దూకి బుద్ధుడి విగ్రహానికి తలబాదుకుని చచ్చిపోతాను!" అంటూ అల్టిమేటమ్ రాసిపడేశాడు.

వెంటనే ఆ అమ్మాయి నుంచి జవాబు అందింది ఆలీకి. ఆత్రుతగా తెరిచి చూస్తే అందులో '143' అన్న అంకెలు తప్ప మరేమీ లేదు!

తెల్లబోయి రూమ్మేటుకు చూపిస్తే, హుషారుగా అలీని పైకెత్తి గిరగిరా త్రిప్పి నేలమీద పడేశాడు. అలీనడుం విరిగి కుయ్యోమొర్రో అంటూంటే, "కంగ్రాట్స్‌రా! నీ ప్రేమ గురి తప్పకుండా బీర్‌గ్లాసులో పడింది. ఈ రాత్రికి నువ్వు మందుపార్టీ ఇవ్వాల్సిందే నాకు" అన్నాడు.



"మందుమాట ఆనక. ముందు ఈ అంకెలకు అర్థమేమిటో చెప్పు" అన్నాడు అలీ విసుగ్గా.

"ఓహ్ం, నువ్వు కంట్రీ బ్రీడ్‌వ్ కదూ!" అంటూ నుదురు కొట్టుకున్నాడతను, "143 అంటే ఐ లవ్ యూ అని అర్థం!"

"అదెలా? " బోలెడు ఆశ్చర్యపోయాడు ఆలీ.

"ఇంగ్లీష్‌లో... ఐ- ఎల్.ఒ.వి.ఇ.- వై.ఒ.యూ.. అన్న అక్షరాల సంఖ్య అది. లవర్స్ కోడ్ అన్నమాట!" వివరించాడతడు.

ఆలీ వదనం ఫ్లాష్‌లైట్‌లా వెలిగిపోయింది. "అయితే దివ్య నా ప్రేమను అంగీకరించినట్టేనంటావా? " అన్నాడు ఇంకా నమ్మకం కుదరక.

"ఓ దివ్యంగా! ఆ పిల్ల మనసు మార్చుకునే లోపునే ఎడ్వాన్స్ అయిపో" అంటూ ఏంచేయాలో బోధించాడతను.

మర్నాడు కాలేజ్ క్యాంపస్‌లో దివ్యను కలుసుకుని, "నాకు ఐ లవ్ యూ చెప్పినందుకు థాంక్స్, దివ్యా! ఐస్‌క్రీం పార్లర్‌కి వెళదాం పద" అంటూ చనువుగా భుజమ్మీద చేయివేశాడు అలీ.

పళ్లన్నీ కదిలిపోయేలా చెంప పగులగొట్టిందామె, "ఎవర్రా నీకు ఐ లవ్ యూ చెప్పిందీ? " అంటూ.

అలీ నిర్ఘాంతపోయి, "మరి నువ్వు పంపిన లెటరు... 143...?!" అన్నాడు తడబడుతూ.

"ఇడియట్! 143 అంటే ఐ లవ్ యూయే కాదు, ఐ హేట్ యూ కూడాను! ఎల్.ఒ.వి.ఇ. లాగే హెచ్.ఎ.టి.ఇ కూడా నాలుగక్షరాలే" అందామె కోపంగా.

'ఆc...!? " అంటూ నోరు వెళ్లబెట్టిన అలీ పక్కను ప్రత్యక్షమయింది అప్పలమ్మ చింకిచేట, చీపురుకట్టతో. "ప్రిన్సిపాల్ సారు కూతురికే లైనేస్తివి, నీకేం పోయేకాల మొచ్చిందిరో పోరగా! లవ్వూ గివ్వూ అన్నావంటే నీ వొంట్లోని కొవ్వు నేనే తీసేస్త. జాగ్రత్త!" అంది ఉరిమిచూస్తూ.

'ఆc, దివ్య ప్రిన్సిపాల్ డాటరా...!? " అంటూ మూర్ఛబోయి దబ్బున నేలమీద పడిపోయాడు అలీ.

దూరం నుంచి ఆ వినోదాన్ని తిలకిస్తూన్న సీనియర్స్ నవ్వులు అతని చెవిలో పడనేలేదు పాపం!

– తిరుమల శ్రీ

★

# 'గువ్వల చెన్నా' పై సమీక్షలు

ఫిబ్రవరి 2005 'చతుర'లో ప్రచురితమైన డాక్టర్ కాలువ మల్లయ్య నవల "గువ్వల చెన్నా"పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## పరిశోధన గ్రంథం

*(మొదటి బహుమతి రూ. 100/-పొందిన సమీక్ష)*

బరువు బ్రతుకుల చిరుగుపాతల నేతగాళ్ళ జీవితాల్ని, పరిణామం చెందుతున్న సామాజిక పరిస్థితుల్ని, సహజమైన గ్రామీణ ప్రజల పరిభాషలో కళ్లకు కట్టినట్లు చిత్రీకరించిన నవల కాలువ మల్లయ్య కలంనుండి వెలువడిన 'గువ్వలచెన్నా'.

పద్మశాలీల ఇండ్ల పేర్లు, గ్రామాలలో ప్రజల నోట వినబడే లోకోక్తులు, సామెతలు, గ్రామీణ వృద్ధుల అనుభవాలు, ఈనాటి యువతరం తెలుసుకొనేలాగ రచయిత చక్కగా విశదీకరించారు.

"మున్నూరు కాపులకు నన్నూరు మొగులు, సాలె సంకుటం గోచిలిరుకుటం, ముప్పయ్యారు జుట్లు కలిసుంటయిగాని మూడు సిగలు కలవవు, ఇంటిపేరు కస్తూరివారు ఇంట్లో గబ్బిలాల వాసన" ఇలాంటి తెలుగు సామెతలు మరుగునపడిపోకుండా తెలుగువారికి అందించారు రచయిత.

నవలలో ముఖ్య పాత్ర శంకరయ్య ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నవాడు. పుస్తకాలతో పాటు లోకాన్ని చదువుతూ సామాజిక తత్వాన్ని అధ్యయనం చేస్తూ ఉంటాడు. అక్షరజ్ఞానం ఉన్నా పెద్దల అనుభవ జ్ఞానం కూడా అవసరం అని శంకరయ్య గుర్తిస్తాడు.

"ప్రభుత్వాలు పారిశ్రామికీకరణ మీద హడావుడి చేయటం తప్ప వ్యవసాయాన్ని ప్రోత్సహించింది లేదు. "కొనబోతే కొరివి, అమ్మబోతే అడివి" లాంటి పరిస్థితివల్ల వ్యవసాయాలు దెబ్బతిన్నాయి. అయిదు ఎకరాల భూమి ఉన్న రైతుకు కూడా ఒక చిన్న ఉద్యోగికి వచ్చే ఆదాయం రావటంలేదు. చిన్న ఉద్యోగాల కోసం రైతులు వందలాది మైళ్లు దాటిపోతున్నారు"

"యేది యేమైనా ఊళ్లకూ, భూములకూ, వ్యవసాయాలకూ, వృత్తిపనులకూ, భవిష్యత్తులో విలువ వచ్చే అవకాశాలున్నాయి"

అని రాజేష్‌తో శంకరయ్య అన్న మాటలు భవిష్యత్తులో అటువంటి పరిణామం వస్తుందన్న భావాన్ని సూచిస్తున్నాయి. ఇది రచయిత భావం కూడా.

శంకరయ్య పెళ్ళి అట్టహాసంగా చేసే అవకాశం ఉన్నా, నిరాడంబరంగా పెండ్లి జరపాలని శంకరయ్య నిర్ణయించటం, అందుకు కలవారి అమ్మాయి మల్లీశ్వరి అంగీకరించటం ఆదర్శం! సమాజానికి మంచి సందేశం!

గ్రామీణ నిరుపేదల అవస్థల్ని, అవమానాల్ని, సామాజిక పరిస్థితుల్ని, పరిణామాన్ని ఎంతో స్పష్టంగా, లోతుగా, చర్చించిన ఈ నవల సందేశాత్మకమైన పరిశోధక గ్రంథం!

– సూర్యదేవర శారద, హైదరాబాద్

## విన్నవీ... చూసినవీ...

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

గత 30 సం.ల కాలంలో మారిన కాలాన్ని, కాలానికి అనుగుణంగా మారిన మనుషుల నైనాన్ని డా॥ కాలువ మల్లయ్య గారు "గువ్వలచెన్నా" నవల ద్వారా స్పష్టంగా ఆవిష్కరించారు. అందులోని ఎన్నో సంఘటనలు, సంఘర్షణలు నేను విన్నవీ కళ్లారా చూసినవీ.

పద్మశాలీల బ్రతుకులు తెరకెక్కడం కాని, కథలుగా, నవలలుగా రావడంగాని అతిత

క్ష్యవగా జరిగింది. అటువంటి పద్మశాలీల జీవితాలని 'గువ్వలచెన్నా' ద్వారా లోకానికి తెలిపారు. ఆయన ఒక గదిలోనే కూర్చుని వ్రాయకుండా పద్మశాలీల జీవితాలు ప్రత్యక్షంగా పరిశీలించి, పాఠకులకు అందించడం ఆనంద దాయకం!

కన్నతల్లికి పట్టుచీర కొనివ్వలేకపోయా నన్న కొడుకు తపన, ఆ ఆశతోటే ఆ తల్లి మౌనంగా ఈ లోకం నుండి వెళ్లిపోవడం, వారి పేదరికం కాలంతోపాటుగా పరిగెత్తలేకపోవడం ఒక బాధాకరమైన జ్ఞాపకంగా మిగిలిపోయింది. కాని, చీర కొనివ్వలేని స్థితి నుండి కొడుకును అమెరికా పంపగలిగే స్థానానికెదగడం అనేది ప్రపంచీకరణలో భాగంగానే జరిగింది. ప్రపంచీకరణలో భాగంగానే నైతిక విలువలు పతనం కావడం, మనిషి విలువలేనివాడు కావడం, జీవితాలలో దేనికీ లెక్కలేకుండా పోవడం, ఎంత ఘోరమైన విపత్తు సంభవించినా గాని క్షణంలో దానిని మరచిపోయి నూతనోత్సాహాలతో ముందుకు సాగడం ఇదంతా ఒక మానవీయ ధ్వంస రచనగా నాకనిపిస్తుంది. కాని ప్రపంచీకరణలో ప్రపంచమంతా వేగంగా అటువైపే ప్రయాణిస్తూ ఒక తీరుగా బలహీనవర్గాలు సైతం అభివృద్ధి చెందుతూ ఆనందిస్తుంటే ఈ అభివృద్ధి పథం సరి అయినదా కాదా అనేది ఒక మాయలాగే మిగిలిపోయింది.

*– జి.గంగాధర్, జగిత్యాల*

## బాపూకల...

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

"గువ్వలచెన్నా" హృదయాన్ని స్పందింపజేసింది. 'గాంధీజీ' కన్న కలలకు చాలా దగ్గరగా ఉంది. కాలగమనాన్ని బట్టి వారి వారి వృత్తుల నుండి దూరంగా జరిగి విద్యలు నేర్చుకొని, అమెరికా వంటి దేశాలకు వెళ్లి అభివృద్ధి సాధించి ఆ విద్యనే తన గ్రామంలో తన వారికోసం ఉపయోగిస్తామనే ప్రతిజ్ఞ నేటి యువతరానికెంతో స్ఫూర్తి కలిగించేదిగా ఉంది. ఒక్కొక్క తరంలోని మంచిని, లోటుపాట్లను సమీక్ష చేసుకుంటూ తన వ్యక్తిత్వాన్ని అల్లుకున్న శంకరయ్య పాత్ర అందరికీ ఆదర్శప్రాయమైంది. కానీ ఆ పాత్ర తల్లితో చిన్నతనంలో నేను నీకు పెద్దయ్యి ఉద్యోగం చేసి 'పట్టుచీర' కొనిపెడ్తానన్నమాట నిలబెట్టుకోలేకపోవటం లోటుగా అన్పించింది. మొత్తంమీద మనదేశంలోని 'నేతపనివారి' జీవన సంఘర్షణకి అద్దం పట్టిందీ నవల'. వాక వృత్తిపనివారి జీవనశైలిని, వారి నిజ జీవన విధానాలను, పరిశీలించి ఆ గ్రామంలో వారికి కావలసిన సదుపాయాలు ప్రభుత్వ సహకార సంఘాల ద్వారా కల్పించి, కావలసిన ఆర్థిక, మానసిక సహకారాలు అందించాల్సిన బాధ్యతను గుర్తించి అందరూ మానవత్వంతో స్పందించాల్సిన ఆవశ్యకతఉంది.

*– యు. శైలజ, చెన్నై*

## నగ్నసత్యం

*(నాలుగవ బహుమతి 50/– పొందిన సమీక్ష)*

**అత్యధికశాతం** పేదరికం అనేది గ్రామాల్లోనే వుందనే నగ్న సత్యాన్ని "గువ్వల చెన్నా" నవల మరొకసారి ఋజువు చేసింది. సామ్యవాదం సాధ్యంకానప్పుడు ప్రజాస్వామ్యాన్ని ఆహ్వానించాలి. కాని ప్రజాస్వామ్యమనేది నేడు నేతి బీరకాయగా మారింది. వ్యవసాయం ప్రధాన జీవన ఆధారమైన భారతదేశంలో వ్యవసాయ అనుబంధమైన ఇతర కులవృత్తులకు ప్రాధాన్యత తగ్గిపోయింది. దీనికితోడు ప్రాపంచీకరణ అనేభూతం- కులవృత్తులు, చిన్నవ్యాపారాలు, కుటీర పరిశ్రమలు మూలపడుతున్నాయి. నేత కార్మికులకు బట్టల కరువు. వ్యవసాయదారులకు తిండి కరువు. ఈ నేపథ్యంలో సాగిన మల్లయ్యగారి నవల చాలా

ఆసక్తిగా చదివించింది. చిప్పమల్లయ్యది నిజమైన నేత కార్మిక జీవితానికి ప్రతిబింబం. కాని వారికుటుంబంలో అక్షరం అనే బీజం శంకరయ్య మనసులో నాటుకుని కుటుంబ వ్యవస్థను మార్చింది. కేవలం ఇంటి మొత్తంమీద శంకరయ్య అక్షరజ్ఞానంతో మిగిలిన వారు విద్యావంతులు అయ్యారు. గ్రామం వదలి బ్రతుకు తెరువు కోసం వలసపోతున్న వారికి వద్దని చెప్పి తన కొడుకులు దగ్గరికి వచ్చేసరికి ఆశయాలకు నీళ్ల వదిలాడు. అది మనిషిలోని నిజమై స్వార్థం.

బతుకుతెరువుకు అనకుండా కొంత సంపాద నిమిత్తం విదేశాలకు వెళ్లి తిరిగి భారతదేశానికి రావాలనే కోర్కె కలుగుతుందా? ఈ అనుమానం శంకరయ్య దంపతులకు కలిగింది. తిరిగి రావాలనే ఆలోచనవున్నవారు తక్కువ. ఏమైనా సమాజంతోనే మనుషులు మారవలసిన పరిస్థితి. పరిస్థితులకు అనుగుణంగా మనం మారుతున్నామా? దీనికి కాలమే సమాధానం చెపుతుందనేది నగ్నసత్యం. మల్లయ్యగారు నవలద్వారా పాఠకుల్ని ఒక్కసారిగా కరీంనగర్‌కు తీసుకుపోయారు.

– సాయిప్రకాష్, విశాఖపట్నం

## అరుదైన నవల

*(ఐదవ బహుమతి 50/- పొందిన సమీక్ష)*

"గువ్వలచెన్నా" అరుదైన నవల. మీరు మా నేతగాళ్ళ పద్మసాలీల పాట్లు, లోట్లు, గెలుపులూ వెలికితెచ్చారు!

చిప్ప మల్లయ్యని పెద్ద దొరలు 'సాలె సంకటం గోచిలిరుకటం' అని చేసే అపహాస్యాన్ని చర్చించారు. ఇంటిల్లిపాదీ శ్రమపడి నేసిన పంచెలచాపు అమ్ముకొనే నేతగాడు తినేది మక్కగుట్క, గంజి వార్చిన కాస్త అన్నం. అదీ బతుకు.

పేదరికం కాస్తన్నా వదల్చుకుంటానని భీవండి, సిరిసిల్ల, షోలాపూరు మరమగ్గాల పాలయ్యి జీవితాలను కోల్పోయిన బ్రతుకులు. మగ్గం గుంతలోనే మగ్గిపోయి, మూడుతరాలలో కూడా 'ఒక్క' పట్టుచీరకొని తల్లి కోర్కె తీర్చలేని పేదతనం.

మనదేశంలో కుల నిర్మూలన సాధ్యమేనా? వృత్తులను బట్టి కులాలూ అవసరమే కదా! ఏ పనయినా తక్కువకాదు సామాజిక అవసరాలు తీరటానికి అన్ని వృత్తులూ అవసరమే! పారిశ్రామీకరణ క్రింద, విద్యార్హతలతో ఎదుగుతున్న ఈ 'గ్లోబలైజేషను' మనల్ని ఎక్కడికి ఈడుస్తోంది? కులవృత్తుల్లో మిళితమైన మానవ సంబంధాలు అంతరించిపోతున్నాయా?

పద్మశాలీల జీవనస్రవంతిలోని మార్పులు చేర్పులూ హృదయానికి హత్తుకునేటట్లు వ్రాశారు. ఈ సమస్యను ఇంత లోతుగా రాసినందుకు రచయితగారికి ధన్యవాదములు.

శంకరయ్యలు వెయ్యిమంది పుట్టాలి! ఈ సమాజంలో ఆత్మహత్యలు, ఆత్మన్యూనతా భావాన్ని తొలగించాలి.

– జి.ఇందిరాదేవి, బళ్ళారి

☆

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.



తొలిపూజలందుకునే గణనాథుడవట! విఘ్నాలను బాపి విజయాలనొసగుదువట!!
ఏమివ్వగలం స్వామీ కర్పూరహారతులు తప్ప! ఏమర్పించగలం నీకు వినమ్ర ప్రణామములు తప్ప!!

ఫొటో: కె.ఎల్. కుమారస్వామి

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78